మనోతిమిరాన్ని పారద్రోలే పుస్తక దీపాలు

యండమూరి వీరేంద్రనాథ్

# మిమ్మల్ని మీ పిల్లలు ప్రేమించాలంటే!...

నవసాహితి బుక్ హౌస్
ఏలూరు రోడ్ • విజయవాడ-520 002

# MIMMALNI MEE PILLALU PREMINCHALANTE

By

YANDAMURI VEERENDRA NATH

36, Jayanagar, Road No. 3,

Banjara Hills, Hyderabad-500 034

Phone : 3313676

Fourth Edition :

January, 1998

Publishers :

NAVASAHITHI BOOK HOUSE

Eluru Road, Near Ramamandiram

Vijayawada-520 002

Phone : 432885

Printers :

Venkata Satya Printers

Vijayawada-3

Cover Design :

ART LINES, G. V. RAMANA

Hyderabad

Price :

Rs. 25-00

# మిమ్మల్ని మీ పిల్లలు ప్రేమించాలంటే!...



మీరు నాన్నయితే—

మీరు ఆఫీసు నుంచి వస్తూంటే మీ పిల్లల మొహంలో ఆనందానికి బదులు భయం తొంగి చూస్తోందా ?

మీ స్కూటర్ చప్పుడు వినపడగానే అప్పటి వరకూ హుషారుగా వున్న ఇంటి వాతావరణం నిశ్శబ్దమై పోతోందా ?

'ఆఫీసు నుంచి తొందరగా వచ్చెయ్ నాన్నా' అని మీ పిల్లలు మిమ్మల్నెప్పుడయినా అడిగారా ?

మీ పిల్లలు ఏయే సబ్జెక్టుల్లో 'వీక్' అన్న విషయం మీకు క్షుణ్ణంగా తెలుసా ?

మీ పిల్లలకు మీకన్నా వాళ్ళ తాతగారి దగ్గర ఎక్కువ చనువా ?

..........

మీరు అమ్మయితే—

మీకు మీ పిల్లలు ఇవ్వవలసినంత గౌరవం ఇవ్వటంలేదని మీరెప్పుడైనా అనుకున్నారా ?

మీ పిల్లల అల్లరిని కంట్రోలు చేయలేకపోతున్నానని మీకు నిస్సహాయంగా అనిపిస్తోందా ?

మీ పిల్లల్ని వదిలి ఒక్కరోజు కూడా మీరు వుండలేరా ?

పిల్లల చదువు విషయంలో మీకు నిరాశగా వుందా ?

తనకన్నా మరొకర్ని మీరు కాస్త ఎక్కువగా ప్రేమిస్తున్నారన్న భావం మీ పిల్లల్లో ఒకరికున్నట్టు మీరు గుర్తించారా ?

అయితే మీకూ మీ పిల్లలకూ ఏదో తెలియని కమ్యూనికేషన్ గ్యాప్ ఏర్పడిందన్నమాట. దాన్ని మొగ్గలోనే తుంచెయ్యండి.

# తొలి పాఠం

తిరస్కారపు పీడకలల్తో పెరిగిన చిన్నారి
నేర్చుకునేది 'పరనింద'.

ద్వేషపు ఆవేదనలో పెరిగిన చిన్నారి
నేర్చుకునేది 'కొట్లాట'.

అవహేళన అనే గుంజిళ్ళు తీసిన చిన్నారి
నేర్చుకునేది 'సిగ్గు'.

అవమానం అనే గోడకుర్చీ వేసిన చిన్నారి
నేర్చుకునేది 'అపరాధ భావం'.

.... ....

సహనంలో ఊయల లూగిన చిన్నారి
నేర్చుకునేది 'శాంతం'.

ప్రోత్సాహపు గోరుముద్దలు తిన్న చిన్నారి
నేర్చుకునేది 'ఆత్మవిశ్వాసం'.

నిజాయితీ మూడు చక్రాల బండి నడిపిన చిన్నారి
నేర్చుకునేది 'న్యాయం'.

సద్భావపు జన్మదినాలు జరుపుకున్న చిన్నారి
నేర్చుకునేది 'నమ్మకం'.

అనురాగపు జోలపాటలు విన్న చిన్నారి
నేర్చుకునేది 'సంతృప్తి'.

స్నేహ పొత్తిళ్ళలో పెరిగిన చిన్నారి
నేర్చుకునేది - ప్రపంచం మీద
"ప్రేమ".

# అధ్యాయం - 1

# మీ పిల్లల్ని గౌరవించండి

స్వచ్ఛమైన ప్రేమలాగే 'గౌరవించడం' అనేది కూడా ఓ వ్యక్తి మరో వ్యక్తికిచ్చే కానుక. మనం ఓ వ్యక్తికిచ్చే విలువ అతడి వ్యక్తిత్వంపై ఆధారపడి వుంటుంది. మనం ఎవరినైనా గౌరవించడం మొదలుపెడితే వారికి కూడా మనమీద ప్రేమ, గౌరవం కలుగుతాయి. గౌరవం యిచ్చి పుచ్చుకోవడం అనేది మానసిక బంధాలను పెంచే మొట్టమొదటి చర్య. ఆ తరువాతే ప్రేమా, ఆప్యాయతలు మొదలౌతాయి.

మన పిల్లలని మనం గౌరవించడం అనేది ఎంతో ముఖ్యం. ఇక్కడ గౌరవించడం అంటే వారి అభిరుచుల్ని ప్రోత్సహించడం, వారికీ, వారి అభిప్రాయాలకు విలువ ఇవ్వడం అని అర్థం. పిల్లల పెంపకంలో గౌరవం, ప్రేమ పునాదిరాళ్ళుగా వుంటే వాటిమీదే పిల్లల ఉన్నత వ్యక్తిత్వం నిర్మించబడుతుంది. అది అద్దాలమేడా, అందమైన మేడా అనేది మీ చేతిలో వుంది.

మీరు చదవబోయే పేజీల్లో మనిషిని మనిషి ఎందుకు గౌరవించాలి?... పిల్లలు తమ తండ్రులకు ఎంత విలువ యివ్వాలి?.... తల్లిదండ్రులు తమ పిల్లలకి ఎంత విలువ, గౌరవం ఇవ్వొచ్చు? అనే విషయాలు చర్చిస్తాను.

ఒకే ఇంట్లో వుండే వ్యక్తుల మధ్య బంధాలు సరిగ్గా లేకపోతే మానసికపరమైన అనారోగ్యాలు, వ్యక్తుల, వ్యక్తిత్వాల పతనం ఎలా వుంటుందో కూడ వివరిస్తాను.

# అసలు పిల్లలంటే ఎవరు?

ఈ ప్రశ్న మీకు విచిత్రంగా కనబడవచ్చు. ఇందులో విచిత్రం ఏమీ లేదు. ఈ ప్రశ్నకు మీరు ఇచ్చుకునే సమాధానం బట్టి మీ మనసులో పిల్లలకు ఎలాంటి స్థానం వుందో అర్థమవుతుంది.

సంసార వృక్షానికి కాసిన సంతాన ఫలాలు కొంతమంది తల్లి దండ్రులకు అనవసర ఫలాలయితే, మరికొందరికి 'అవసరానికి' పుట్టిన ఫలాలు. కొందరు అనురాగ ఫలాలని హృదయపూర్వకంగా చెబుతారు. మీరు ఏ వర్గానికి చెందినవారయినా మీ పిల్లలను మీరు అంతో యింతో ప్రేమగా చూసుకుంటారు. అందులో సందేహం లేదు. దుర్యోధనుడిని కూడా ధృతరాష్ట్రుడు ప్రేమగానే చూసుకున్నాడు కదా!

జీవించడానికి, బ్రతకడానికి ఎంత భేదం వుందో పిల్లల్ని కని ఏదో గాలికి పెంచడానికి, వాళ్ళను ఉత్తమ వ్యక్తులుగా తీర్చిదిద్దడానికి మధ్య అంతే భేదం వుంది.

వరి మొక్కలనే ఉదాహరణగా తీసుకోండి. వడ్లను తీసుకెళ్ళి కొన్నిటిని రాయలసీమలో, కొన్నిటిని రాజస్థాన్ ఎడారిలో, మరికొన్నిటిని గోదావరీ నదీతీరంలో వుండే సారవంతమైన భూముల్లో చల్లండి. అవి చక్కగా పెరిగే అవకాశాలు గోదావరీ తీరంలోనే ఎక్కువ. మిమ్మల్ని గోదావరీ తీరం వెళ్ళి పిల్లల్ని కనమని చెప్పడం కాదు నా ఉద్దేశ్యం. లోపం వడ్లలో లేదని చెప్పడమే నా అభిప్రాయం. భూమి చాలా సార వంతంగా వున్నా, పెరుగుతున్న పైరుని, రైతు సరిగా పెంచి పోషించక పోతే పంట సరిగా రాదు. అంటే ఇక్కడ దోషం కష్టపడని రైతుదన్న మాట. గోదావరీ తీరంలో పెరిగే పంటకికూడా ఈ ఉపమానం వర్తిస్తుంది.

కేవలం స్కూటర్ మీద పిల్లల్ని స్కూల్లో దింపి, నెలకోసారి సినిమాకో, షికారుకో, పార్కుకో తీసుకువెళితే తమ బాధ్యత తీరిపోయిందని అనుకొనే తండ్రులు ఇలాటి రైతులు !

కడుపు నింపే పంటనే మనం ఇంత జాగ్రత్తగా చూసుకోవలసి వస్తుంది. అలాంటిది మన కడుపు పంట ఎంత జాగ్రత్తగా చూసుకోవాలి అనేది చాలామంది తల్లిదండ్రులు ఆలోచించవలసిన విషయం.

పిల్లలు, వాళ్ళ మనస్తత్వాలు ఎప్పుడూ ఒకటే. వాళ్ళు పెరిగే పరిసరాలు, వాళ్ళను పెంచే తల్లిదండ్రుల సమిష్టి సహకారం వాళ్ళ జీవితాలకు, వ్యక్తిత్వాలకు ఊపిరిపోస్తాయి. వాళ్ళ మనసులు ఉత్త మట్టిముద్దలు. మనమే ఆ మట్టిని ఆర్ద్రతాభావంతో తడిపి, చక్కటి మూర్తులుగా తీర్చిదిద్దాలి. ఆ నైపుణ్యం, ఏకాగ్రత, ఓర్పు, సాధన తల్లిదండ్రులు కష్టపడి నేర్చుకొని ముందు తమ వ్యక్తిత్వాలను తాము తీర్చిదిద్దుకొని, తర్వాత పిల్లల వ్యక్తిత్వాలను తీర్చిదిద్దాలి.

# జీవితం ఒక యుద్ధరంగం

జీవితంలో పోరాడటం అనేది చిన్నప్పటి నుండి మొదలవుతుంది. పెద్దలచేత గౌరవించబడని పిల్లల మానసిక సంఘర్షణ గురించి అర్థం కావాలంటే మీరు యుద్ధరంగానికి చెందిన ఓ వాస్తవ గాథను చదవాలి.

1944, అక్టోబర్ నెలలో రెండో ప్రపంచ యుద్ధం జరుగుతోంది. అమెరికాకు చెందిన ఒక సైనికదళ కమాండర్‌కు వైర్‌లెస్ ద్వారా ఒక సమాచారం అందింది. ఆ వార్త ప్రకారం ఫ్రాన్స్‌లోని ఓ నగరాన్ని నాజీ సైనికులు ఆక్రమించుకున్నారు. ఆ నగరాన్ని తిరిగి ఫ్రెంచివారి స్వాధీనం చేయమని, నాజీలను ఓడించమని ఆ అమెరికన్ కమాండర్‌కు అధికారుల నుంచి ఆదేశాలందాయి. ఫ్రెంచ్ గూఢచారులు ఎంతో కష్టపడి పంపిన మేప్ కూడా ఆ కమాండర్‌కు ఇవ్వబడింది.

ఆ మేప్‌లో కేవలం ఆ నగరంలోని రహదారులు, సరిహద్దులు మాత్రమే కాక నాజీల సైనిక స్థావరాలు, రహస్య స్థావరాలు, మెషిన్ గన్‌లు మొదలైనవి వుండే ప్రదేశాలు చాలా వివరంగా వున్నాయి. ఇంత అవసరమైన, విలువైన సమాచారం దొరికినందుకు, ఆ కమాండర్ సంతోషించాడు. ఆ నగరాన్ని తమ అధీనంలోకి తెచ్చుకోవడం ఎంతో అవసరం. కానీ ఆ పని చాలా కష్టం. ఏ మాత్రం తప్పు జరిగినా ఆ మేప్‌ను సేకరించడానికి పడిన కష్టమంతా వ్యర్థం అయిపోతుంది. ఎంతోమంది సైనికులు తమ జీవితాలు కోల్పోతారు.

నగరాన్ని జయించడానికి బయలుదేరే ముందు, కమాండర్ ఆ మ్యాప్‌ను పరిశీలించమని ప్రతి ఒక్క సైనికుడిని ఆజ్ఞాపించాడు. ఓ గంట తర్వాత వారిని పరీక్షించాడు. సైనికులందరూ అమోఘంగా అన్ని స్థావ

రాలూ, రహదారులూ, గుర్తుపెట్టుకున్నారు. ఏదో ఒకటి రెండు చిన్న విషయాల్లో తప్ప అందరూ అన్ని విషయాలను గుర్తుపెట్టుకోవడం ఆ కమాండర్ కు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. ఇందువల్లే వాళ్ళు ఆ నగరాన్ని తేలికగా ముట్టడించి, జయించి ఫ్రెంచివారికి మళ్ళీ అప్పగించారు.

ఈ సంఘటన జరిగి ముప్పయి ఏళ్ళ తర్వాత మిలటరీకి చెందిన ఓ పరిశోధకుడు ఈ వాస్తవ గాథ చదివి ఇటువంటిదే మరో ప్రయోగం చేయాలనుకున్నాడు. అదే మ్యాప్‌ను ఓ పాతికమంది టూరిస్ట్‌ల కిచ్చి పరిశీలించమన్నాడు. వాళ్ళకు చాలా గంటల వ్యవధి ఇచ్చాడు. ఆ తర్వాత వారిని పరీక్షించాడు. ఎవరూ సరిగా గుర్తుంచుకోలేక విఫలమయ్యారు. ఇందుకు కారణం ఒక్కటే. ఈ పరీక్షలో విఫలమైతే ఆ టూరిస్ట్‌లకు జరిగే నష్టం అంటూ ఏమీలేదు. కాకపోతే వాళ్ళ అహం కాస్త దెబ్బతింటుంది. అంతకు మించి ఇంకే నష్టం వాళ్ళకి జరగదు. కానీ, సైనికుల విషయం అలా కాదు. వాళ్ళు సరిగా గుర్తుంచుకోలేకపోతే వాళ్ళ ప్రాణాలే పోయుండేవి.

తమకు ప్రాముఖ్యత, విలువలేని చోట వాటిని పొందడం కోసం పిల్లలు పోరాడుతూ వుంటే, మనలో చాలామంది తల్లిదండ్రులు టూరిస్టుల లాగా వాళ్ళ పోరాటాన్ని చూస్తూ వుంటారు తప్ప, వాళ్ళ భావాల గురించి తెలిసినా పట్టించుకోరు. పై పరీక్షలో సైనికులు విఫలమైతే వాళ్ళు కోల్పోయేది వాళ్ళ జీవితం. టూరిస్టులు కోల్పోయేది కొద్దిపాటి గర్వం. అలాగే, ఈ జీవిత పోరాటంలో తల్లిదండ్రులు ప్రేక్షకుల్లా చూస్తూ వుంటే వాళ్ళు కోల్పోయేది వాళ్ళ పిల్లల భవిష్యత్తునే. కానీ, పిల్లలు కోల్పోయేది మాత్రం వాళ్ళ పూర్తి జీవితం.

అసలు పిల్లలకు సమస్యలుంటాయనేది కొంతమంది తల్లిదండ్రులు గ్రహించరు. వారు అనుకోవడం ప్రకారం పిల్లలు బుద్ధిగా చదువుకొని పెద్దలను గౌరవిస్తే చాలు. బాల్య, యవ్వన దశలలో ఒక మనిషి కేవలం

బుద్ధిగా చదువుకొని పెద్దలను గౌరవిస్తే చాలా! ఇంకేమీ అక్కర్లేదా? ఇదే ప్రశ్న నేను చాలామంది తల్లిదండ్రులకు వేశాను. వారిలో చాలామంది "ఏనాడీ, మా కాలంలో చాలా వెర్రిగా, అమాయకంగా పెరిగాం, ఇప్పుడు పిల్లలకున్న ఇన్నిన్ని వసతులు, ఎంజాయ్‌మెంట్లు మా కెక్కడివి?" అంటూ వుంటారు. పైగా "మధ్యాహ్న భోజనానికి రెండు రొట్టెముక్కలు సంచిలో పేక్ చేసుకొని వెళ్ళేవాళ్ళం. ఆ విధంగానే పైకొచ్చాం" అంటారు.

మీరివన్నీ లేకుండానే పెరిగుండొచ్చు. కానీ, మరిన్ని సౌఖ్యాలతో మీ పిల్లలని పెంచి జీవితంలో బాగా పైకి తీసుకురావచ్చని మీరెందుకు గ్రహించరు?

తల్లిదండ్రుల పట్ల పిల్లలకుండవలసింది భయం కాదు. తండ్రి ఆఫీస్ నుండి వస్తున్నప్పుడు పిల్లలు ఆడుకోవడం ఆపేసి, పుస్తకాలు తీసుకొని గదిలోకి వెళ్ళిపోవడం చూస్తాం. ఆఫీసు నుంచి వచ్చి, తమ పిల్లలు చదవకుండా కనిపిస్తే, పిల్లలను గొడ్డును బాదినట్లు బాదేవారిని చూశాను.

తమ పిల్లవాడు, తమతో కొంచెం క్లోజ్‌గా వుంటే గౌరవించటం మానేస్తాడని అనుకొనేవాళ్ళనిచూస్తే నవ్వాలో, ఏడ్వాలో తెలీదు. తమ సమస్యలు చెప్పుకుంటే, తల్లిదండ్రులు తంతారని భయపడ్తారు పిల్లలు. ఉదాహరణకి ఒక స్కూల్లో మీ పిల్లవాడి క్లాసులోనే మీ అబ్బాయికన్నా కొంచెం లావుగా, ఎత్తుగా వుండే అబ్బాయి ఏదో ఒక నెపంమీద మీ పిల్లవాడిని కొట్టాడనుకోండి. ఇంటికొచ్చి మీ పిల్లవాడు మీతో ఈ విధంగా క్లాసులో కొట్టాడని చెప్తే, వెంటనే మీరు వాడిని మాస్టరు వద్దకు తీసుకువెళ్ళటమో, ఆ కుర్రవాడి బ్యాక్‌గ్రౌండ్ ఏంటో పరిశీలించటమో చెయ్యకుండా మీ అబ్బాయిని తిడతారు. మీకు స్కూలుకి వెళ్ళే ఓపిక లేకపోవటం, అవతలి కుర్రవాడి వెనుక ఎవరున్నారనే అంతర్గతభయం తప్పునంతా మీ పిల్లలమీద తోసివేయడానికి కారణమౌతుంది. ఇలాంటి చిన్న చిన్న సమస్యలనే మీరు

గుర్తించకపోతే, ఇక కుర్రవాడు మీతో ఏ విధమైన కమ్యూనికేషన్ ఏర్ప రచుకోగలడు? మీ పిల్లవాడితో సక్రమమైన కమ్యూనికేషన్ ఏర్పరచు కోవాలి. సన్నిహితంగా మెలగాలి. చదువు చెప్పించటం, రాత్రిపూట పడు కోవటానికి రూమ్ ఇవ్వటం, అల్లరిచేస్తే కొట్టటం లాంటివి మాత్రమే తల్లిదండ్రుల బాధ్యత గాదు. పిల్లల తరపున సరియైన నిర్ణయాలుతీసుకొని, వారిని ఒక మంచి వ్యక్తిత్వం గల పౌరులుగా తీర్చిదిద్దడం తల్లిదండ్రుల కర్తవ్యం.

సమస్యలు వారే పరిష్కరించుకోలేరా అని మీరడగవచ్చు. ఈ వయసులో మీరే మీ సమస్యలు పరిష్కరించలేరు. చిన్నపిల్లలు వాళ్ళ సమస్యలను వాళ్ళే పరిష్కరించుకోగలరని ఎలా అనుకుంటారు? మీ లెవెల్లో మీ సమస్యలు మీకెంత పెద్దవిగా కనబడతాయో, వాళ్ళ లెవెల్లో వాళ్ళకీ పెద్దవిగానే వుంటాయి. వాళ్ళు మెంటల్‌గా మెచ్యూర్ అయ్యేవరకూ వారి సమస్యలను పరిష్కరించటం కూడా మీ బాధ్యతే.

## చిన్నపిల్లల కెలాంటి సమస్యలుండొచ్చు?

* స్కూల్లో అధ్యాపకులతో గొడవలు
* తోటి మిత్రుల దురభ్యాసాల ప్రోత్సాహం
* తమ లోపాల్ని ఎవరైనా ఎత్తి చూపించి తమని ఇంట్రావర్ట్‌గా చూస్తుంటే బాధపడటం.
* తల్లిదండ్రులు అర్థం చేసుకోలేకపోవటం.
* తమకన్నా మిగతా కుర్రవాళ్ళకి ఎక్కువ మార్కులు రావటం
* తమని క్లాస్‌రూమ్‌లో ఒక బఫూన్‌గా మాష్టర్లు చిత్రీకరించి బాధ పెట్టటం - ఇలాంటివన్నీ చిన్నపిల్లల సమస్యలే.

తల్లిదండ్రులు తమను ప్రేమించకపోవటం అనేది పిల్లలకి చాలా పెద్ద సమస్య. ఇక్కడ ప్రేమించటం, ప్రేమించకపోవటం అనే పదాలు నేను ఎందుకు వాడానంటే, ప్రతి తల్లిదండ్రులు తమ పిల్లలని ప్రేమిస్తారు.

కానీ, అది బైటకి కనపడనివ్వరు. అలా బైటకు ప్రదర్శిస్తే, ఎక్కడ తమ దగ్గర పిల్లలకి భయం తగ్గిపోతుందో అని సందేహిస్తారు. స్కూల్లో పిల్లలని దించి వాళ్ళ నుదుటిమీద ముద్దు పెట్టుకొని, టాటా చెప్పి లోపలికి పంపుతున్న తల్లిదండ్రులని, మీ పిల్లవాడు చూస్తే-తనకి లేని ఒక సౌఖ్యం తోటి మిత్రుడికి కలుగుతున్నందుకు మానసికంగా బాధపడతాడు. మీరేమో పిల్లవాడు స్కూలుకి వెళ్తుంటే ముద్దు పెట్టుకోవటం అంతస్తుకో, తాహతుకో భంగంగా భావిస్తారు.

క్రీస్తు కాలం నుంచీ ఈ రోజు వరకూ ప్రతీ తల్లీదండ్రీ తమ పిల్లలకి ఇవ్వగలిగినవి చాలా మిగిలి వున్నాయి. కానీ ఇవ్వరు. దీనివల్లే తరచూ పిల్లలు 'ఫ్రస్ట్రేషన్'కి లోనవుతూ వుంటారు.

పిల్లవాడు ఇంటికొచ్చేసరికి ఇంట్లో ఎప్పుడూ గొడవలూ, అరుపులూ, అశాంతి, తిట్టుకోవటంలాంటి అవాంఛనీయ పరిస్థితులుంటే, ఆ పిల్లవాడు మానసికంగా కుంగిపోతాడు. నిరుత్సాహకరమైన వాతావరణం పిల్లల జీవితాన్ని, వ్యక్తిత్వాన్ని మార్చేస్తుంది. తల్లిదండ్రులు దురలవాట్లకు లోనై తమ తాగుడుకో, లేక స్టీలుసామాన్లు వాడిని ఇంటిముందు కూర్చోబెట్టుకొని గంటల తరబడి మాట్లాడే తల్లో అయితే ఆ పిల్లల సమస్యలు ఓ పట్టాన తీరవు.

ఓ కుటుంబంలో పుట్టిన ఒక కుర్రవాడి పేరు రాజు అనుకుందాం. రాజు చదువులో ఎప్పుడూ ఫస్టుర్యాంక్ తెచ్చుకునేవాడు. అతని తండ్రి రోజూ తాగి భార్యని కొట్టేవాడు. రాజు ఏదైనా భరించేవాడు కాని, తల్లిని కొట్టడం మాత్రం అతడికి నచ్చేది కాదు. చిన్న పిల్లవాడుగా వున్నప్పుడు ఆ విషయం చెప్పడానికి కాస్త భయపడ్డా, కొంచెం పెద్దయ్యాక తండ్రికి ధైర్యంగా చెప్పాడు. తనకన్నా చిన్నవాడు తనని నిలదీయటం ఏమిటనే కోపంతో రాజు తండ్రి రోజూ రాజుని ఏదో వంకతో తిట్టేవాడు. అతని స్నేహితులముందే అవమానించేవాడు. ఇవన్నీ భరించలేక రాజు, ఇంట్లో

వుండి చదువుకోవటం మానేసి, స్నేహితులతో తిరగటం, సినిమాల కెళ్ళటం, సిగరెట్లు తాగడం, ఏదో పిచ్చి - పిచ్చి ఆటలాడటం— ఇలాంటి అలవాట్లను పెంపొందించుకున్నాడు. ఎప్పుడూ ఫస్టుక్లాస్ వచ్చే స్టూడెంట్ చదువులో బాగా వెనుకబడ్డాడు. వీటన్నిటికీ మూలకారణం అతని తండ్రి అని చాలామంది ఊహించలేరు కూడా. ఒక సాయంత్రం రాజు ఇంటికొచ్చే సరికి తాగొచ్చిన తండ్రి, చెల్లిని ఒక మూల పడేసి తంతూ, అడ్డొచ్చిన తల్లిని బూతులు తిడుతూ వున్నాడు. రాజు, తల్లిని తండ్రి నుంచి దూరం చేసి తండ్రిని వరండా నుంచి కిందికి తోసేశాడు. నేలమీద పడిన అతని తండ్రికి అదో పెద్ద షాక్. "మరోసారి నా తల్లిమీద చెయ్యి వేస్తే చంపే స్తాను" అన్నాడు. తర్వాత ఇంట్లోంచి బైటకొచ్చేశాడు. అప్పుడు రాజు ఆలోచనలు ఈ విధంగా సాగాయి.

నా తండ్రి మంచివాడే. తాగితేనే ఈ విధముగా ప్రవర్తిస్తాడు. మిగతా సమయంలో బాగానే వుంటాడు. నన్ను, అమ్మని ప్రేమగా చూసు కోవటము అతని బాధ్యత కాదా? అంత చిన్నచెల్లిని కొట్టడానికి అతనికి చేతులెలా వచ్చాయి? 'నేనింతకన్నా మిమ్మల్ని బాగా చూసుకోలేను. ఇష్ట ముంటే వుండండి. లేకపోతే పొండి. అసలు మీకు తిండి, నీడ కల్పిస్తు న్నది నేను. వేరేవాళ్ళకంటే నేను వెయ్యిరెట్లు నయం. మా నాన్న ఇంత కన్నా ఘోరంగా మమ్మల్ని, మా అమ్మనూ కొట్టేవాడు. మమ్మల్నయితే చింతబరికలతో బాదేవాడు'— ఇలాంటి మాటలు-ఆ తండ్రి అంటూవుంటే ఆ కుర్రవాడి మనస్సు ఎలా వుంటుందో ఊహించండి. ఈ సంఘటన జరిగిన కొంతకాలానికి రాజు ఇంట్లోంచి శాశ్వతంగా వెళ్ళిపోయాడు. అతనిప్పుడు ఎక్కడ వున్నాడో ఎవరికీ తెలీదు.

రాజు ఎదుర్కొన్న సమస్యలకి రెండే కారణాలున్నాయి.

1. రాజు గతం.

2. రాజు తండ్రి గతం—ఈ రెండు గతాల మధ్య సరైన వారధి. అవగాహన లేకపోవటంవల్లే అలా జరిగింది.

ఈ సమయంలో రాజు ఒక మంచి మిత్రుడి సహకారంతో తనను తాను సంస్కరించుకున్నాడు అని ఊహిద్దాం. మొదట నైతిక విలువలంటే ఏంటో రాజు నేర్చుకున్నాడు. తనను తాను గౌరవించుకోవటం మొదలు పెట్టాడు. జీవితాంతం తనను ఎవరో ఆదరించాలి, తనని ప్రేమించాలి అనుకొన్న రాజు ముందు తనని-తాను ప్రేమించుకోవటం మొదలుపెట్టాడు. తనంటే ఏమిటో ఒక అవగాహనకొచ్చాడు. తన స్నేహితులను ప్రేమించటము మొదలుపెట్టాడు. రాజు స్వభావంలో మార్పు ఎన్నో ఆశ్చర్య జనకమైన మార్పులకి దారితీసింది. ఒకరోజు రాజు యింటికి తిరిగివచ్చాడు. తన తండ్రితో సమానస్థాయిగా మాట్లాడటము మొదలుపెట్టాడు. ఇక్కడొక పిల్లవాడిలా కాకుండా, తనే తండ్రి పొజిషన్‌లోకి వెళ్ళి, తండ్రిని కొడుకుని చేసి తండ్రి మనస్తత్వం మీద 'అడల్ట్ ఛైల్డ్ సైకాలజీ' ప్లే చేశాడు.

ఒకే సమస్యపట్ల రెండు ప్రతిస్పందనలు—రాజు—రాజు తండ్రి.

* * *

రాజు కథ మరీ అతిగా వుంది చాలామంది నమ్మకపోవచ్చు. ఇది కథ కాబట్టి రచయిత ఊహించి చెప్పింది కాబట్టి, రకరకాల ట్విస్టులతో ఒక అందమైన ముగింపుకి దారితీసింది. కానీ, నిజజీవితంలో కూడా మనం ఆలోచించుకోవలసిందల్లా, మనం రాజు పొజిషన్‌లో వున్నామా? లేక రాజు తండ్రి పొజిషన్‌లో వున్నామా? అని. ఒకవేళ మనంగాని రాజు తండ్రి పొజిషన్‌లో వుంటే, ఈ కథకి ఇన్ని ట్విస్టులు అవసరంలేదు. మనని మనం ఒక్కసారి అవగాహన చేసుకుంటే, రాజు జీవితంలో ఎన్నో సంవత్సరాలని ఇంకా ప్రొజెక్టివ్‌గా తయారుచేసి వుండేవాళ్ళం.

ఎందరో పిల్లలు రాజు అనుభవించిన వేదనకన్నా ఎక్కువ వేదన

అనుభవిస్తున్నారు. అందుకనే వారు పెద్దయ్యాక చాలా దుర్భరమైన పరిస్థితిలో బతుకుతున్నారు. చిన్నతనంలో గట్టిపునాది ఏర్పడిన మనుష అందరూ పెద్దయ్యాక ఏ చిన్న సమస్య వచ్చినా తల్లడిల్లిపోవడం, చిన్న చిన్న ప్రాబ్లమ్స్‌కే విపరీతంగా టెన్షన్ పడడంలాంటి మానసిక రోగాన్ని అనుభవిస్తున్నాడంటే, చిన్నప్పుడు అతని తల్లిదండ్రులే కారణం అనేది నిర్వివాదాంశం.

ఈ పుస్తకం రాస్తున్న రోజుల్లో నేను చాలామంది తల్లిదండ్రులతో చాలా క్యాజువల్‌గా ఈ విషయం ప్రస్తావించేవాడిని. 'మీ పిల్లలు మీ పట్ల ఎందుకు వ్యతిరేకభావంతో వున్నారు' అని చూచాయగా అర్థం వచ్చేటట్లు అడిగేవాడిని. చాలామంది తల్లిదండ్రులు చెప్పిన ఏకైక సమాధానం ఏమిటంటే మా పిల్లలు చాలా ఆనందంగా వున్నారు. వాళ్ళకేమీ సమస్యలు లేవు అనేవారు తర్వాత ఏ డిన్నర్ టైమ్‌లోనో, పార్టీటైమ్‌లోనో వారి పిల్లలను పిలిచి యిదే విషయం ప్రస్తావించి నొక్కి అడిగితే, ఆ పిల్లలు తమ తమ తల్లిదండ్రుల పట్ల వున్న భావాన్ని నిర్మొహమాటంగా చెప్పేసరికి, నా కళ్ళముందే ఆ తల్లిదండ్రులు బిత్తరపోవడం చూశాను చాలామంది తల్లిదండ్రులకు వాళ్ళ పిల్లల విషయంలో ఏ సమస్యా లేకపోవచ్చు. మన ఇంట్లో కరెంట్ పోలేదని చెప్పి, కొవ్వొత్తి కొనుక్కోకుండా వుండం గదా! అలాగే, పిల్లల సమస్యలనుకూడా ముందే ఊహించుకొని, వాటికి మానసికంగా ప్రిపేర్ అయి వుండాలి.

పిల్లల గురించి, వారి మానసిక స్థితి గురించి తెలుసుకోవడం ప్రతి తల్లిదండ్రుల కర్తవ్యం. ఏదైనా వచ్చినపుడు వాళ్ళ మానసిక పరిస్థితి అంతా విశ్లేషించుకోవలసి వస్తుంది. సమస్య ముందు పెట్టుకొని విశ్లేషించుకోవడం మొదలుపెట్టకుండా, ముందే మన పిల్లల గురించి మనం అంతా రికార్డు చేసుకున్నట్లుగా తెలుసుకొని వుండడం చాలా మంచి పద్ధతి.

చాలా మంచి కుటుంబమని, ఆ కుటుంబ సభ్యులందరూ చాలా

గొప్పవారని, పేరు తెచ్చుకొన్నవారని అనుకొన్న ఇళ్ళల్లో కూడా పిల్లల సమస్యలు వుంటాయి.

"ఏ రోజూ మా పిల్లలు ఇలా చెయ్యలేదు, ఇప్పుడిలా ఎందుకు తయారయ్యారో మాకు అర్థంకావడంలేదు" అన్న తల్లిదండ్రులు ఎక్కడో ఏదో చిన్న విషయం మర్చిపోయుంటారు. పిల్లలు ఈ రోజు ఈ విధంగా బాధాకరంగా తయారయారంటే, బాల్యంలో జరిగిన సంఘటనలో యేదో తప్పు జరిగిందన్నమాట. చిన్నతనంలో తన తండ్రి తనపట్ల అవమాన కరంగా ప్రవర్తించిన చిన్న సంఘటనని, పదిహేను ఇరవై సంవత్సరాల తర్వాత కూడా గుర్తుపెట్టుకొని, ఆస్తి పంపకాల సమయంలో 'నువ్వప్పుడు ఆ విధంగా చేశావు కదా' అని గుర్తుచేస్తే, ఎలా వుంటుందో ఆలోచించండి. ఉదాహరణకి. మీరు ఇంటికొచ్చినప్పుడు రెండు స్వీట్స్ తీసుకొచ్చారని అనుకొందాం. వాటిని పిల్లల కివ్వకుండా భార్యకొకటిచ్చి మీరొకటి తింటే, తన తండ్రి తీసుకొచ్చిన స్వీట్లు విషయం కొడుకు గుర్తుపెట్టుకొని, ఆ మర్నాడు ఆ ఖాళీ ప్యాకెట్ చూసి, తనకు రావలసిన ఆ చిన్న హక్కుని తల్లితండ్రి కలిసి మోసం చేశారనే భావానికి వస్తాడు. ఈ ఫీలింగ్ ఓ పాతిక సంవత్సరాల తర్వాత కూడా అ అబ్బాయికి గుర్తున్నా ఆశ్చర్యపోనవసరం లేదు.

## నెగిటివ్ థింకింగ్ :

సామాన్యంగా చిన్నప్పుడు పిల్లలందరూ పాజిటివ్ థింకింగ్లోనే వుంటారు. అబద్ధాలు ఆడకూడదు, లంచాలు తీసుకోకూడదు, పెద్దలని గౌరవించాలి. ఇలాంటి భావాలన్నీ వాళ్ళకి వుంటాయి. ఒక్కొక్కప్పుడు వాళ్ళ ఈ భావాలు మారడానికి తల్లిదండ్రులే ముందుగా దోహదపడుతుంటారు. పక్కింటావిడ అయిదు రూపాయలు అప్పుకోసం వచ్చినపుడు, మా దగ్గర లేవన్న తల్లి, తర్వాత కొడుకుని తీసుకెళ్ళి అయిదువందల రూపాయలిచ్చి

చీకకొంటే- ఈ రెండు సంఘటనలకి కొడుకు మనసులో లింకు ఏర్పడు తుంది. ఈ విధంగా పిల్లవాడు పెద్దవుతున్నకొద్దీ కటిస్ట్ అవుతాడు.

ప్రముఖ వేదాంతి మంచి చెడుల మధ్య వ్యత్యాసాన్ని అతి గొప్పగా ఒక వాక్యంలో విశ్లేషించాడు. "ఈ ప్రపంచంలో చెడు అనేది జరగకుండా వుండాలంటే మంచివాళ్లు తమ పనులు చెయ్యడం మానే యాలి" అని.

ప్రతి తల్లీ తండ్రీ పిల్లవాడిని ఎలా చదివించాలి? ఎలా పెంచాలి? అని ఆలోచిస్తారే తప్ప, పిల్లవాడి సమస్యని ఎన్ని కోణాలనుంచి ఆలో చించొచ్చు. ఎన్ని సమాధానాలు రాబట్టవచ్చు అని ఆలోచించరు.

ఎడ్యుకేషన్ వేరు, లిటరసీ వేరు, చదువు వేరు, విజ్ఞానం వేరు. భారతదేశంలో చాలామంది చదువుకున్న వాళ్లున్నారు. చాలామంది జ్ఞానులు లేరు. ఈ తేడాని మనం తప్పనిసరిగా గుర్తించాలి. ఇద్దరాడపిల్లలు పుట్టిన తర్వాత, వెంటనే మూడో పిల్లవాడి కోసం ప్రయత్నించే తల్లిదండ్రులు - ఒక ఆడపిల్ల పుట్టగానే చాలా భయపడిపోయి మగ సంతానం కోసం ఆర్నెల్లకే ప్రయత్నించే తల్లిదండ్రులు—గొప్ప తల్లిదండ్రులు కాలేరు. దేశానికి మనమెంత ద్రోహం చేస్తున్నాం అన్న కనీస ఆలోచనలేని తల్లి దండ్రులు వీళ్ళ పిల్లలని సరియైన రీతిలో తీర్చిదిద్దుతారనుకోవడం భ్రమ. చాలామంది తల్లిదండ్రులు పిల్లలని అక్షరాస్యులుగా చెయ్యడానికి పూను కుంటారే తప్ప, జ్ఞానులుగా తయారుచెయ్యడానికి ప్రయత్నించరు. పెళ్ళ యిన మూడు నాలుగేళ్ళవరకు పిల్లలను కనకూడదు. భార్యాభర్తల మధ్య ఏదేనా అవగాహన లోపమొస్తే విడాకులకి పిల్లలు అడ్డంకి అవుతారు అన్న కనీసపు ఆలోచన కూడా వీళ్ళలో వుండదు. పెళ్ళిచేసుకున్నప్పుడు విడాకులు అన్న సమస్య రావచ్చేమోనని కూడా వీళ్లు ఊహించరు. అదే విధంగా పిల్లవాడికి, పిల్లవాడికి మధ్య ఒక సంవత్సరంకన్నా తక్కువ గ్యాప్ వుంటే, అది ఎంత దారుణమైన పరిస్థితికి దారితీస్తుందో కూడా ఈ

తల్లిదండ్రులు ఊహించలేరు. ఇలాంటి తల్లిదండ్రుల పెంపకంలో పెరిగిన పిల్లలు జీవితంలో ఏ విధంగానూ పైకి రాలేరు.

పిల్లవాడి తెలివితేటలని వాడి మార్కులతో పోల్చడం మరొక తెలివితక్కువ చర్య. ఉదాహరణకి మీ పిల్లవాడికి క్లాసులో ఆరో ర్యాంకు వచ్చిందనుకోండి. మీ పక్కింటి పిల్లవాడికి మొదటి ర్యాంకొచ్చింది. అంత మాత్రాన ఆ పక్కింటి పిల్లాడు మీ పిల్లవాడికంటే గొప్ప అని అనలేం. ప్రతి వ్యక్తిలోనూ కొన్ని లక్షణాలుంటాయి. ప్రతి వ్యక్తి ప్రతిభను ఎప్పుడూ ఒక లక్షణంతో లెక్కకట్టలేం. అలాగే పరీక్షలలో వచ్చేమార్కులతో కూడా లెక్కకట్టలేం. ఉదాహరణకి మీ పిల్లవాడు ఎనిమిదో క్లాసు చదువుతూ యింట్లో ఫేన్ పాడైతే దానిని రిపేర్ చెయ్యగలడనుకోండి. మీ పక్కింటి కుర్రవాడికి కనీసం పెన్సిల్ చెక్కుకోవడం కూడా రాదనుకోండి. వాడికి ఫస్టు ర్యాంక్ వచ్చి, మీ వాడికి సెకండ్ వస్తే జరిగే నష్టమేమీ లేదు.

మీరు స్టాటిస్టిక్స్ వేసుకుంటే జీవితంలో పైకి వచ్చిన వారందరూ సెకండ్ క్లాస్ స్టూడెంట్సే. సోడాబుడ్డి కళ్ళద్దాలతో ఎప్పుడూ పుస్తకాలు ముందు పెట్టుకొని, క్లాసు ఫస్టు మాత్రమే జీవితాశయంగా చదివిన కుర్రవాళ్ళందరూ టీచర్స్, ప్రొఫెసర్స్ లేక మేధావులుగా స్థిరపడ్డారే తప్ప డబ్బు సంపాదన విషయంలో గాని, రాజకీయాల్లోగాని, లోక పరిజ్ఞానం విషయంలో గాని పైకి రాలేదనే విషయం గుర్తుపెట్టుకోవాలి.

ఐ క్యూ :

మీరు ఎప్పుడూ పాటుపడవలసింది మీ పిల్లవాడికి పరీక్షల్లో మార్కులెలా ఎక్కువగా వస్తాయా అని కాదు; మీ పిల్లవాడి ఐ. క్యూ పెంచడం ఎలాగా అని! లెక్కలు, సైన్స్, జనరల్ నాలెడ్జ్, తర్కం ఇవన్నీ ఐ. క్యూ కి సంబంధించినవి. బట్టీపట్టి మార్కులు తెచ్చుకోవటమనేది ఐ. క్యూని తక్కువచేసే చర్య. ఈ ఐ. క్యూ లోనే లౌక్యం

కూడా వుంటుంది. ఒక సమస్య వచ్చినప్పుడు ఎలా పరిష్కరించుకోవాలో మీ పిల్లవాడే మీకు ఒక్కోసారి చెప్పొచ్చు. మీ పిల్లవాడి ఐ. క్యూ, జీవితంపట్ల అవగాహన, ఒక నిర్దిష్టమైన దారిలో గమ్యంవేపు చేరుకోవడం–ఇవన్నీ సరిగ్గా సాగుతున్నాయో లేదో తెలుసుకోవాలంటే మీరు మీ పిల్లవాడిని ఈ క్రింది కోణాల్లో పరిశీలించాల్సి వుంటుంది.

* ఎవరేనా ఏదేనా చేస్తే యుక్తాయుక్తాలు ఆలోచించకుండా, మీ పిల్లవాడు గుడ్డిగా అనుకరిస్తున్నాడా?
* మీ పిల్లవాడి స్నేహితుడు సిగరెట్ తాగితే బావుంటుందిరా అనో, సిగరెట్ తాగడం మగతనానికి చిహ్నమని చెప్పినా, మీ పిల్లవాడు వెంటనే దానికి అలవాటు పడ్డాడా?
* మీ పిల్లవాడు తరచూ అబద్ధాలాడుతున్నాడా?
* మీ పిల్లవాడిలో స్వార్థం ఎక్కువగా కనిపిస్తోందా?
* తన చెల్లెళ్ళతోనూ, అన్నలతోనూ ప్రవర్తించేటపుడు ఈ విధమైన స్వార్థం చూపిస్తున్నాడా?
* మీ పిల్లవాడు అవసరమైన దానికన్నా తక్కువగా మాట్లాడుతూ ఆలోచనలో పడుతున్నాడా?
* మీ పిల్లవాడికి ఆత్మన్యూనతాభావం వున్నట్లుగా కనబడుతోందా?
* చిన్న చిన్న విషయాల్లో కూడా గట్టి నిర్ణయాలు తీసుకోలేకపోతున్నాడా?
* తన గురించిన నిర్ణయాలు కూడా మీమీదగాని, తోటి స్నేహితుల మీదగాని, పెద్దవాడిమీదగాని విడిచిపెడుతున్నాడా?
* మీ పిల్లవాడికి స్కూల్లో ఎలాంటి పేరుంది? మంచి పేరు లేదా? పిరికి అందర్లోనూ కలవడు-లాటి పేర్లున్నాయా?
* టీచర్లకి అతనిమీద ఎలాంటి అభిప్రాయం వుంది? మంచిదిలేదా?

* మీ పిల్లవాడికి అవసరమైన దానికన్నా ఎక్కువ పాళ్ళలో కోపం, చిరాకు వున్నాయా? ఎక్కువగా రోదిస్తున్నాడా?
* పట్టుదల లేకపోవడం అనేది మీ పిల్లవాడిలో యెక్కువగా కనిపిస్తోందా?
* ఏదేనా ఒక విషయాన్ని సాధించాల్సి వచ్చినపుడు దాన్ని సాధించలేక, అకారణంగా ఆ నెపాన్ని ఎవరిమీదేనా తోసేస్తున్నాడా?
* ఎక్కువగా తన స్నేహితుల గురించి మీ దగ్గర పొగుడుతూ మాట్లాడుతున్నాడా?

పై ప్రశ్నలన్నిటికి సమాధానం "అవును" అన్నట్లయితే, మీ పిల్లవాడిని పెంచడంలో మీరేదో తప్పు చేస్తున్నారన్నమాట. మీ పిల్లవాడిని సరియైన రీతిలో పెంచవలసిన బాధ్యత మీది.

ఇంతకుముందే చెప్పినట్లు విజ్ఞానపరమైన చదువు వేరు, అక్షరాస్యత వేరు. మనలో చాలామంది పిల్లలను అక్షరాస్యులుగా చేస్తున్నారనే తప్ప, విజ్ఞానులుగా తయారుచెయ్యడానికి ప్రయత్నం చెయ్యడంలేదని ఇంతకుముందే చెప్పడం జరిగింది. పైన చెప్పిన లక్షణాలన్నీ ఎక్కువగా గౌరవం, ప్రేమ, ఆదరణ లభించని యిళ్ళల్లో పెరిగిన పిల్లల్లోనే కనిపిస్తాయి.

ఏ తల్లిదండ్రులు మనస్ఫూర్తిగా తమ పిల్లలు యీ రకమయిన అవాంఛనీయ సంఘటనలు యెదుర్కోవాలని కోరుకోరు. తల్లిదండ్రులకు తెలియకుండానే యింట్లో ఆ పరిస్థితులు అలుముకొని వుంటాయి. వేళకు భోజనం అమర్చి, స్కూలుకి పంపిస్తే పని అయిపోయిందని భావించడం సరికాదని యింతకుముందే చెప్పడం జరిగింది. ఇదే విధంగా పక్కింటి పిల్లలతో పోల్చి తమ పిల్లలని ఎలా అదుపులో పెడుతున్నారు? ఏవిధంగా ఫస్టు మార్కులొస్తున్నాయి? అన్న విషయం గురించి రీసెర్చి చెయ్యడం

మాని మనలో లోపాలన్నీ, మన పిల్లల్లో లోపాలని అంచనా వేసుకొని పరిదిద్దుకోవడం మంచిది.

### గౌరవం :

ఈ 'గౌరవం' అనే పదమంటేనే చాలా గౌరవం. అసలు ఒక వ్యక్తిపట్ల ఏ కారణాలవల్ల మనం గౌరవం చూపాలి? ఈ ప్రశ్నకు సమాధానం చాలా తేలికగా చెప్పొచ్చు. శంకరాభరణం సినిమాలో శంకర శాస్త్రి వేషం అద్భుతంగా వేసిన జె.వి. సోమయాజులు మన గదిలోకొస్తే, ఒక విధమైన గౌరవంతో లేచి నిలబడతాం. ఇది ఒక రకం గౌరవం. అలాగే ఒక బాబానో, స్వామీజీనో మన ఇంటికి వస్తే ఒక్కమారులేచి నిల బడతాం. ఇది ఒక రకం గౌరవం. మన బాస్ మనింటికొస్తే వేరే విధంగా ప్రవర్తిస్తాం.

ఇన్ని గౌరవాలను రకరకాలుగా ప్రదర్శిస్తున్న మనం మన పిల్లల పట్ల గౌరవంగా ప్రవర్తించం. మీకు ఆశ్చర్యంగా వుండొచ్చు. పిల్లల పట్ల గౌరవం ఏంటని? నిజానికి సంవత్సరానికో, ఆర్నెల్లకో వచ్చే ఓ వ్యక్తిపట్ల మనం చూపే గౌరవంకన్నా, జీవితాంతం మనం కలిసుండే వ్యక్తులపట్ల ఇంకా ఎక్కువ గౌరవం చూపాలి. గౌరవం అనేది ప్రేమలో ఒక భాగం మాత్రమే.

ఉదాహరణకి, మీ పిల్లవాడు మీ దగ్గరికివచ్చి క్రికెట్ మేచ్‌కివెళ్తాను డబ్బులిమ్మని అడిగితే, చదువుకోకుండా క్రికెట్ మేచ్ ఏంట్రా అనకుండా తనాక్రికెట్ మేచ్‌కి ఎందుకు వెళ్ళాలనుకుంటున్నాడు. తన అభిమాన క్రికెట్ ప్లేయర్ ఎవరు అన్నవి తెలుసుకోవాలి. మీ అబ్బాయి క్రికెట్ ప్లేయర్ కాకపోవచ్చు. కానీ, క్రికెట్‌ను స్ఫూర్తిగా పొంది లెక్కల్లో ఎక్కువ మార్కులు తెచ్చుకోవచ్చు. ఈ విధంగా మనం ఊహించలేని లింకులు పిల్లల్లో వుంటాయి. ఆ లింకులని గ్రహించి వాళ్ళపట్ల మసలుకోవడమే

మనం వాళ్ళకిచ్చే గౌరవం. గౌరవానికి ప్రేమ తోడైతే అది శాశ్వత బంధం అవుతుంది.

పెంపకం :

ఇక తండ్రి తన కూతురు చెయ్యి పట్టుకొని విసుగ్గా గదిలోకి తీసి కెళ్తాడు. లాగి చెంపదెబ్బ కొడతాడు. తల్లి అడ్డుగా వస్తుంది. అయినా పట్టించుకోడు. ఆ పిల్లకి పదమూడేళ్ళ వయసుందని కూడా మర్చిపోతాడు. "మరోసారి నీ గది ఇంత ఛండాలంగా వుంటే నువ్వీ యింటిలోకి అడుగు పెట్టవు. వారం రోజులనుంచి చూస్తున్నాను. నాలుగు గంటలకి స్కూలు అయిపోతే, ఆరు గంటలవరకు ఇంటికి రావటంలేదు. ఈ రోజంతా ఇంట్లో కూర్చుని నీ రూమ్ సర్దు" అని మళ్ళీ కొడతాడు. తల్లి యేదో చెప్పబో తుంది. "నువ్వేం దాన్ని సమర్ధించనక్కర్లేదు" అంటూ కసురుకుంటాడు.

ఎందుకు కొన్ని ఇళ్ళల్లో యింత కఠినత్వం కనబడుతుంది? మరి కొన్ని యిళ్ళల్లో ఎందుకు శాంతిగా వుంటాయి?

పదమూడేళ్ళ వయస్సున్న పాప నాలుగు గంటలకి స్కూల్ అయి పోతే ఆరుగంటల వరకూ రాకపోతే అది నిజంగా తండ్రి వ్యాకులపడవల సిన విషయమే. దానికి కారణం ఆ పిల్లకి మిగతా స్నేహితురాళ్ళతో కలిసి చదువుకోవాలి అన్న కోర్కె అయుండొచ్చు లేదా కొత్తగా పరిచయ మైన ఒక కుర్రవాడయినా అయ్యుండొచ్చు. ఈ రెండింటికిహ స్తిమళకాంతం అంత తేడా వుంది.

తన కూతురు తప్పు చేస్తున్నది. తనని దండించాలి అన్న భావనతో రూమ్ నీట్‌గా లేదని వంక చెప్పి కొట్టనవసరంలేదు. అదే తన కూతురు ఎందుకు స్కూల్ నుండి ఆలస్యంగా వస్తున్నదో తెలుసుకోగలిగితే, అది మంచి పని అయితే సమర్థించవచ్చు. లేదా మగపిల్లవాడితో తిరగటం లాంటి వ్యవహారమైతే యిలా కొట్టడం కాకుండా, నెమ్మదిగా చెప్పడం ద్వారానో, అది తప్పని ఆ పిల్లకి మెల్లిగా ఇంజక్ట్ చెయ్యడం ద్వారానో

సరిదిద్దవచ్చు. వేరే నెపంమీద కొట్టడం కాకుండా అంటే ఆ పిల్లని మాన సికంగా తనకు దూరం చేసుకొని, అవతలి కుర్రవాడు తీయటి మాటలతో చెప్పే ప్రేమభావం వైపు ఆకర్షితురాలయ్యేలాగ చేయకూడదు. చాలామంది తల్లిదండ్రులు చేసే ఘోరమైన తప్పిదమిదే. తమ కూతురు తెలిసీ తెలియని వయసులో ప్రేమలోపడితే, ఆమెని దండించటం ద్వారా నిస్సహాయురాలిగా చేసి, ఒంటరిదాన్ని చేసి, మరింతగా ఆ కుర్రవాడివైపు మొగ్గేవిధంగా చేస్తారే తప్ప తమకున్న ప్రేమ, ఆప్యాయతల ద్వారా తమవైపు ఆకర్షితు లయ్యేలా చేసుకోరు.

ఇంట్లో వాతావరణమే పిల్లల వ్యక్తిత్వానికి తోడ్పడే మరో కారణ మౌతుంది. కొంతమంది ధైర్యస్థులుగా, ఆశావాదులుగా తయారైతే మరి కొంతమంది ఎందుకూ పనికిరానివాళ్ళుగా తయారవడానికి కారణం తల్లి దండ్రులే అని, ఇంతకుముందే చెప్పడం జరిగింది.

సాధారణంగా తల్లిదండ్రులు మిగతాపిల్లలతో వ్యవహరించేవిధంగా తమ పిల్లలతో వ్యవహరించరు. ఒక స్నేహితుడు తమ కుటుంబంతో భోజనానికి వచ్చి, పిల్లలని తీసుకొచ్చినపుడు, ఆ పిల్లల దగ్గర కూర్చొని వాళ్ళ యోగక్షేమాలు, ఎలా చదువుతున్నారో అన్నీ కనుక్కుంటారు. అదే వాళ్ళ పిల్లల దగ్గర కొచ్చేసరికి ఒక్కసారీ అలా ప్రవర్తించివుండరు.

నాకు పదేళ్ళ వయసులో మా ఊరినుండి మా మావయ్య వచ్చా డంటే మా అందరికీ సరదావేసేది. మమ్మల్ని అందరినీ కూర్చోబెట్టి ప్రశ్నలు వేసేవాడు. ఏ ఏ సబ్జెక్ట్స్ చదువుతున్నామో అడిగి తెలుసుకునే వాడు. అప్పుడప్పుడు నాకు కొంచెం భయం కూడా వేసేది. న్యూటన్ సిద్ధాంతమో, ట్రిగ్నామెట్రీ ఫార్ములానో అడుగుతాడనుకొనేవాళ్ళం. కానీ అవేమీ అడిగేవాడు కాదు. నిజానికి ఆ సబ్జెక్ట్‌లేవీ అతనికి తెలియనే తెలీవు. మా దగ్గరకొస్తున్నప్పుడల్లా ఏవేవో బహుమతులు తీసుకొచ్చేవాడు. మాలో మాకే పరీక్ష పెట్టేవాడు. నెగ్గిన వాళ్ళకి ఏ పెన్సిలో, నోట్ పుస్తకమో

బహుమతిగా ఇచ్చేవాడు. అతని రాక కోసం మేమెంతగానో ఎదురుచూసే వాళ్ళం. మాకారోజు ఏ సినిమా ప్రోగ్రామ్ వున్నా, క్రికెట్ మ్యాచ్ వున్నా క్యాన్సిల్ చేసుకొనేవాళ్ళం. అంటే మాకు అత్యంత ఆనందాన్నిచ్చే అభిరుచులకన్నా మా మావయ్యే మమ్మల్ని ఆకట్టుకొనేవాడు.

ఒకరోజు మా మావయ్యే మాకు కాగితం, కలం ఇచ్చి మాలోని బలహీనతలు రాయమన్నాడు. నాకు బాగా గుర్తు ఇది చాలా చెత్త ప్రశ్నగా నేనా రోజున భావించాను. కానీ, రాయటం మొదలుపెడితే వెంటనే అందరి పేజీలు నిండిపోయాయి. తర్వాత, ఆయన మీలో మంచి గుణాలేంటో రాయండి అన్నాడు. నేను చాలాసేపు ఆలోచించాను. రెండు మూడుకన్నా ఎక్కువ తోచలేదు. అదొక నవ్వుల ప్రహసనంగా ఆరోజు మారింది. ఇన్ని సంవత్సరాలైనా ఆ సంఘటన అంతా బాగా గుర్తు పెట్టుకున్నానంటే, ఏ మానసిక శాస్త్రవేత్త చెయ్యలేని పనిని ఆ రోజుల్లో మా మావయ్య చేశాడు. (వెన్నెల్లో ఆడపిల్ల ఈ మావయ్యకే అంకితమిచ్చాను నేను)

అసలు మన బలహీనతలేంటి? మన ప్లస్ పాయింట్స్ ఏంటి? మన స్వభావమేంటి? మనకి తెలుసా? తెలుసుకోడానికి ప్రయత్నం చేస్తున్నామా? ముందు మనని మనం అర్థంచేసుకొని, మన పిల్లలని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి.

మీ పిల్లల సమస్యలు విని అర్థం చేసుకోవడానికి ఓపిక కావాలి. సాధారణంగా ఆడపిల్లలు తండ్రులతో దగ్గరగా వుంటారు. కానీ, కొన్ని సమస్యలు మాత్రం తల్లులకే చెప్పుకుంటారు. చాలామంది ఆడపిల్లలు చెప్పుకునే సమస్యలని తల్లులు వింటారే తప్ప సలహాలు ఇవ్వరు.

కొన్ని కొన్ని మంచి గుణాలు, కొందరు ఇళ్ళల్లో చాల ఛాదస్తముగా పరిణామం చెందుతూ వుంటాయి. ఒక తల్లికి ఇల్లు నీట్‌గా వుంచుకోవాలని అన్నకోర్కె వుండొచ్చు కానీ, ప్రతిరోజూ గదంతా తడి

గుడ్డతో తుడవటం, సోఫాలపై కవర్లు మారుస్తూ వుండటం లాంటివి పిల్లలకి ఖావన్తంగా కనబడొచ్చు.

ప్రేమించడం, ప్రేమ ప్రకటించడం :

మనం మన పిల్లలని కేవలం ప్రేమిస్తే సరిపోదు. అప్పుడప్పుడు ప్రకటిస్తూ వుండాలి. అప్పుడప్పుడేంటి, నిరంతరం ప్రకటిస్తూ వుండాలి! వాళ్ళ చిన్న చిన్న విజయాలపట్ల, మనం కొన్ని కొన్ని పరిస్థితులలో ఉత్సాహం కూడా చూపించవలసి వుంటుంది. వాళ్ళు మనతో పంచుకొనే భావాలపట్ల, మనతో చెప్పే విషయాలపట్ల మనకెంత ఉత్సాహం వుంది అనేది వాళ్ళకి అర్థం అయ్యేలా వ్యక్తీకరించాలి.

స్కూల్‌లో అలసిపోయి ఇంటికొచ్చిన పిల్లలను తల్లి, చిరునవ్వుతో పలకరించి వాళ్ళకోసం తాను ఎదురుచూస్తున్నానన్న విషయం తెలిసేలా చెయ్యాలి. అప్పుడు పిల్లలు చాలా సంతోషపడతారు.

పిల్లవాడు స్కూల్ నుంచి వచ్చే టైమ్‌కి తల్లి తన బెడ్ రూమ్‌లో నిద్రపోతూనో లేక ఇంటి వెనుక నున్న మెట్లపై కూర్చొని పనిమనిషితో కబుర్లు చెబుతూనో వుంటే అది అతడి మనసుమీద ఒక అసంతృప్తి భావాన్ని తప్పక కలుగజేస్తుంది.

తమ రొటీన్ లైఫ్‌లో పిల్లవాడు ఒక భాగం అన్న భావాన్ని తల్లిదండ్రులు పిల్లవాడికెప్పుడూ కలిగించకూడదు. కేవలం బొమ్మలు, వస్తువులూ కొన్నంత మాత్రాన పిల్లలు సంతోషపడరు. చిన్న చిన్న విషయాలు కూడా గొప్ప సంతృప్తినిస్తాయి. మార్జిన్లు గీయడం, పుస్తకాలకి అట్టలు వేయడం-లాంటి చిన్న చిన్న పనులు నిజమైన దగ్గరతనాన్ని కలుగజేస్తాయి.

నోట్‌బుక్‌లో టీచర్ గుడ్ అని రాస్తే పిల్లవాడు చాలా సంబరపడుతూ వచ్చి తల్లిదండ్రుల కావిషయం చూపించాలనుకుంటాడు. అదేదో చాలా రొటీన్ విషయంలాగా 'సర్లేరా' అంటే పిల్లల మనసు చివుక్కు

మంటుంది. చాలామంది తల్లిదండ్రులు పిల్లవాడిని ఎక్కువ పొగిడితేవాడిలో అహంభావం, సుపీరియారిటీ కాంప్లెక్స్ ఎక్కువ పెరిగి చదువుపట్ల నిర్లక్ష్యం చేస్తాడేమో అని భావిస్తుంటారు. కాని అది తప్పు. విజయంకన్నా గొప్ప విజయం ఇంకేదీ లేదు.

కొంతమంది పిల్లలకి బొమ్మలు వేసే అలవాటు వుంటుంది. వాళ్ళు వేసిన పిచ్చి గీతలని కూడా గర్వంగా తల్లికో తండ్రికో చూపిస్తారు. అలాంటప్పుడు వాళ్ళని ప్రోత్సహించవలసిన బాధ్యత తల్లిదండ్రులదే. అదే విధంగా టి.వి. లో తన కిష్టమైన అడ్వర్ టైజ్ మెంటో, కార్టూన్ షో నో వచ్చినప్పుడు, పిల్లలు తల్లిదండ్రులను లాక్కొచ్చి చూడమంటూ టి వి. ముందు కూర్చోబెడతారు. మనం ఈ వయసులో కూడా ఒక మంచి సినిమా చూసి, మంచి కథ చదివి ఎలా ప్రతిస్పందించామనేది మన స్నేహితులకు చెబుదామనుకొంటాం. అలాంటిది ఒక చిన్న పిల్లవాడు తాను స్పందించిన విషయాన్ని తల్లిదండ్రులకు చెప్పాలనుకోవడంలో తప్పలేదు.

## మీ తల్లిదండ్రులని మీరు ప్రేమించండి :

మీ పిల్లలచేత మీరు గౌరవింపబడాలి అనుకొనే ముందు, మీ తల్లిదండ్రులని మీరెంత గౌరవిస్తున్నారనే విషయం ఆలోచించుకోండి. మీ తల్లిదండ్రుల పట్ల మీ ప్రవర్తన బాగుంటే, దాని ప్రభావం మీ పిల్లల మీద కూడా పడి మిమ్మల్ని గౌరవిస్తారు. అన్ని మత గ్రంథాలలోనూ తల్లిదండ్రులను ప్రేమించమని, గౌరవించమని తప్పకుండా వుంటుంది.

కాళిదాసులాంటి గొప్పకవి కూడా ముందుగా వాగర్థాల లాగ వుండే పార్వతీ పరమేశ్వరులని తన తల్లిదండ్రులుగా భావించి స్తుతించాడు. గౌరవించటం అనే విషయాన్ని మీ పిల్లలు ఎలా గ్రహించగలరు? చూడడం ద్వారా, చూసినదానిని అర్థం చేసుకోవడం ద్వారా, తమకంటే పెద్దవాళ్ళు తమ తల్లిదండ్రులను గౌరవిస్తుంటే చూసి, పిల్లలు కూడా తమ తల్లిదండ్రులతో ఎలా వుండాలో తెలుసుకుంటారు. ఉదాహరణకి,

ఒక ఇంట్లో తాత, తండ్రి, కొడుకు వుంటే; తండ్రికి తాతకి అనుక్షణం పడకపోతే, తాతని తండ్రి నిర్లక్ష్యం చేస్తుంటే, కొడుకు ఒక వయసు వచ్చేసరికి తండ్రిని మానసికంగా దూరం చేసుకుంటాడు. (ఇదే థీమ్‌మీద ఒక సినిమా కూడా వచ్చింది) మీ అమ్మగారో, నాన్నగారో, మిమ్మల్నేదైనా ప్రశ్నించినప్పుడు మీకు చిరాకువేసి వాళ్ళకు ఎదురు తిరిగినట్లు మాట్లాడారనుకోండి. ఈ సంఘటన మీ పిల్లలు చూస్తే వారికి మీమీదవున్న గౌరవం, విలువ తగ్గిపోతాయి.

అదే విధంగా సవ్వులాటకై, 'నువ్వు మా పిల్లవాడివి కావురా' అనకండి. చాలామంది ఇళ్ళలో పిల్లల్ని 'నువ్వు మాకు పుట్టలేదురా' అనో ఆస్పత్రినుంచి తెచ్చామనో, ఎవరో చచ్చిపోతే తీసుకొచ్చామనో,అక్కయ్య తాలూకా బిడ్డవనో చెప్తూ జోక్స్ వేస్తుంటారు. పిల్లవాడు బాధపడి మంచమెక్కి రక్కుతూ, కొడుతూ మారాం చేస్తే, అదేదో గొప్ప ఘన కార్యంలా మురిసిపోతూ వుంటారు. కానీ, ఇలాంటి చిన్న చిన్న జోకులు "నీకు మా పిల్లవాడివయ్యే అర్హత లేదు. మా పిల్లవాడిని మేము ఇంత కన్నా గొప్పగా ఊహించుకుంటాము" అని ఇండైరెక్టుగా ఆ పిల్లవాడితో తల్లిదండ్రులు చెప్పినట్లుగా భావం వస్తుంది.

"నీలాంటి కొడుకు వుండడం మాకెంతో అవసరం" అని ఇండైరెక్టుగా పిల్లలకి తెలియజేస్తూ వుండాలి. కాని ఎంతమంది తల్లిదండ్రులు ఇలా చేస్తారు?

మరి కొంతమంది తండ్రులు యిలా అంటూ వుంటారు. మా తల్లీ తండ్రీ మా కోసం ఏమీ చేయలేదు. మమ్మల్ని శ్రద్ధగా పెంచలేదు. వాళ్ళు మాకు డబ్బుకూడా సరిగ్గా యిచ్చేవారుకాదు. మేం కష్టపడి చదువుకున్నాం. కష్టపడి పైకొచ్చాం అని వాళ్ళే పిల్లలతో చెబుతూ వుంటారు. వీళ్ళు అంతర్గతంగా చెప్పేదేంటంటే 'మా తల్లిదండ్రులు మాకిచ్చే సదుపాయాలకన్నా మీ కెక్కువ సదుపాయాలు యిస్తున్నాం' అని.

ఇది కేవలం ఒక ఆత్మన్యూనతా భావంవున్న తండ్రి తన కొడుకు దగ్గర అహాన్ని చూపించుకోవడమే తప్ప, మరే విధంగానూ ఉపయోగ పడే విషయంకాదు దీనిని గురించి విపులంగా వేరేచోట చర్చిద్దాం.

ఎప్పుడైనా పిల్లవాడొక తప్పుచేస్తే, వాడిని దండించే ముందు అదే వయసులో మీరు చేసిన తప్పు, మీ తల్లిదండ్రులు దండించిన విధానము, దానికి మీరు ఎలా ప్రతిస్పందించారు అనేది ఆలోచించండి. ఉదాహరణకి, మీ పిల్లవాడు స్కూలులో పెన్నుపారేసుకొని వచ్చాడనుకోండి. వాడిని మీరు కొట్టబోతారు. మీరు అదే వయసులో పెన్ను పారేసుకుంటే స్కూలు నుంచి ఇంటికి వస్తూ మీరెంత బాధపడ్డారో, ఆ విషయం ఇంట్లో చెప్పడానికి మీకెంత భయం వేసిందో, దానిపట్ల మీ తండ్రి రియాక్షన్ ఏంటో గుర్తు తెచ్చుకోండి. మీ తండ్రి ఆ రోజు మిమ్మల్ని అలా కొట్టకుండా, 'పోన్లేరా, పెన్ను పారెయ్యడం అనేది నువ్వు అనుకొని చేసినది కాదు. ఇంకెప్పుడూ అలా అజాగ్రత్తగా వుండకు' అని గుర్తు పెట్టుకుని మరుసటి రోజు మీ కోసం ఒక కొత్త పెన్ను తీసుకువస్తే మీరెంత ఆనందంగా వుండేవారో ఆలోచించండి. మీరు, మీ తండ్రి ప్రవర్తన ఎలావుంటే బాగుండేది అని అనుకున్నారో మీ కొడుకు కూడా మీ ప్రవర్తన అలా వుండాలని కోరుకుంటాడు. మీ తండ్రిని మీరు చిన్నప్పుడు సంస్కరించలేకపోయారు. కానీ ఈ వయసులో తప్పకుండా మీరు మిమ్మల్ని సంస్కరించుకోగలరు.

మిమ్మల్ని అశ్రద్ధచేసిన తల్లిదండ్రులవల్ల మీకు కలిగిన బాధ, అశాంతి పూర్తిగా పోవాలంటే, అందుకే ఏకైక మార్గం మీ తల్లిదండ్రులను గౌరవించడమే. ఇందుకు ఉదాహరణగా రామాయణం తీసుకోండి. ఏ కైకేయి తను అడవులపాలవడానికి మూలకారణమైందో ఆ కైకేయినే రాముడు ఎక్కువ గౌరవించాడు. "నేను శ్రీరామచంద్రుణ్ణి కాదండీ,అంత గొప్ప గుణం నాకులేదు" అని మీరనొచ్చు.

ఒక క్షణం ఆలోచించండి. తీవ్రంగా ద్వేషించి, ఆవేశపడి టెన్షన్‌కు లోనయితే మీ శారీరక మానసిక ఆరోగ్యాలు పాడవడమే తప్ప, దానివల్ల ఎవరికీ ఏ లాభమూ లేదు. అలా చేసేకంటే, కాస్త సహనంతో తల్లి దండ్రులను సహకరించగలిగే మీరు సంతోషంగా వుండడమే కాక మీ పిల్లల దృష్టిలో కూడా మీ విలువ పెరుగుతుంది.

చాలామంది తమ తల్లిదండ్రులతో కోపంగా మాట్లాడకపోయినా, తిట్టకపోయినా - నిర్లిప్తంగా, ముభావంగా ప్రవర్తిస్తూ తమయొక్క అసంతృప్తిని తెలుపుతూ వుంటారు. ఇది అన్నిటికన్నా దారుణమైన పరిస్థితి. ముసలి వయస్సులో ఏ వ్యక్తి ఐనా తనవాళ్లు తనతో ఆప్యాయంగా మాట్లాడాలని, దగ్గరగా సన్నిహితంగా వుండాలని కోరుకుంటారు. వాళ్ళని తమ మౌనంతో ముభావంతో బాధపెట్టటం కసాయితనం కన్నా ఎక్కువ. మీరు మీ తల్లిదండ్రులకు దూరంగా వేరే ఊర్లో వున్న పక్షములో రోజూ ఫోన్‌చేసి వాళ్ళతో మాట్లాడక్కరలేదు. మర్యాద చెయ్యక్కర్లేదు. వాళ్ళింకా జీవించి వున్నారనే విషయం మీకు గుర్తున్నట్లు వాళ్ళకి, ప్రేమగా ఉత్తరాలు రాయడంద్వారా వాళ్ళని మీరు మరచిపోలేదని, ప్రేమిస్తున్నారని వాళ్ళకి తెలుస్తుంది. ఇలాగే మీ పిల్లవాడిని కూడా "గౌరవించటం ద్వారా" ఆనందింప చెయ్యవచ్చు. ఇంత చిన్న చిన్న విషయాలే వాళ్ళకి తృప్తిని కలుగజేస్తాయి.

మీ పిల్లవాడు పది పన్నెండేళ్ళు దాటిన వాడైతే, ఉదాహరణకి వాడి స్నేహితులను కూడా ఒకరోజు మీ ఇంటికి పిలిచి లంచ్‌గాని, డిన్నర్ గాని యివ్వొచ్చు. ఎప్పుడూ మీ స్నేహితులు లేక మీ భార్య స్నేహితురాండ్రు యిళ్ళకొచ్చి అర్ధరాత్రి వరకూ పార్టీలు చేసుకుంటూ వుంటే మీ అబ్బాయి ఒంటరితనం ఫీలవుతూ వుంటాడు. ఇలాంటి పార్టీలు తప్పని సరైనప్పుడు మీ పిల్లవాడి 'కంపెనీ' కూడా ఎంటర్‌టైన్ చెయ్యవలసిన బాధ్యత మీది. అలాగే, మీ అబ్బాయి వాళ్ళ స్నేహితులింటికి ఏదేనా పార్టీకి

వేళాకోళంకే, అదేదో చెడిపోయే కార్యంగా భావించి, వద్దని నిరాకరించ కండి. ఒక్క శృంగారంలో తప్ప మిగతా అన్ని విషయాలలోను మీ పిల్ల లని పెళ్లైనంతవరకూ కలుపుకుంటూ వుండండి. మీరంతా కలిస్తేనే ఒక కుటుంబం. ఆ తర్వాతే బయటవాళ్ళెవరయినా, తిరిగి తల్లిదండ్రుల విష యానికొస్తే, మీ బాల్యంలో మీరు స్కూల్‌నించి రాగానే మిమ్మల్ని ప్రేమతో కౌగలించుకున్న మీ తల్లిదండ్రులు, మీకే అనారోగ్యమో వస్తే మీ తల్లి మీకు చేసిన సేవలు–లాంటి మంచి జ్ఞాపకాలని గుర్తుచేసుకోండి. మీ తల్లిదండ్రులు మీకేదో చెయ్యలేదనే భావాన్ని విడిచిపెట్టి, వాళ్ళు మీకు చేసిన సహాయాలని గుర్తు తెచ్చుకోండి.

# ఏ మనిషీ పరిపూర్ణమైన వ్యక్తి కాడు

అలాగే తల్లిదండ్రులు కూడా.

"తల్లి అంటే శాంతానికి, సహనానికి మరో పేరులా వుండాలి. తల్లి అంటే అసలెప్పుడూ తప్పుచేయని వ్యక్తి. తల్లి అంటే కొడుకు కోసం తన గుండెనైనా కోసిచ్చే వ్యక్తి"— ఇలాంటివన్నీ మనం చిన్నప్పుడు పుస్తకాల్లో చదువుకుంటాం. కానీ, తల్లికూడా ఒక స్త్రీయే. ఆమెకి సహజ మానవ గుణాలైన స్వార్థం, ద్వేషం, కోపం, అసూయ మొదలైనవి వుంటాయి. వాటిని గుర్తించాలి.

మీరు మీ తల్లిని యేదో విషయం ప్రశ్నించారు. మీ తల్లి విసుక్కుంటూ ఏదో సమాధానం చెప్పింది. లేదా స్కూల్‌నుంచి ఇంటి కొచ్చేసరికి తల్లి పక్కింటావిడతో కరివేపాకు గురించో, స్టీలు సామాన్ల వాడితో కబుర్లు చెబుతూనో కనిపించింది. లేదు మీరు ఏదో చెప్పబోతుంటే గట్టిగా తిడితే మీరు మనసులోనే బాధపడతారు. ఇలా మూడు నాలుగు సార్లు జరిగితే మీ యిద్దరిమధ్యా దూరం యెక్కువవుతుంది. మీరు పుస్తకాలలో చదివినదానికి, మనసులో అనుకున్న భావానికి, ఇప్పుడు జరుగుతున్నదానికి చాలా తేడా వుంటుంది. అయితే ఒక మనిషి విసుక్కోవటం గాని, కబుర్లు చెప్పటంద్వారా రిలాక్సవడంగాని అసమంజసం కాదు.

తల్లి అంటే సినిమాల్లో చూపిస్తున్నట్లుగా చాలా ఔన్నత్యంగా వుంటుందనుకోవడం పొరపాటు. సినిమాల్లో తల్లి వేషాలు వేసిన నటీమణులు తమ ఇళ్ళల్లో యింతకన్నా ఘోరంగా ప్రవర్తిస్తారు. ఏ లోపాలు లేని పరిపూర్ణమయిన వ్యక్తిత్వం కలిగి వుండాలనే అభిప్రాయమే సరియైనది కాదు. మీలో, మీ బంధువుల్లో, మీ మిత్రుల్లో వుండే లోపాలే మీ తల్లిదండ్రులలో కూడా వుంటాయి.

తల్లిదండ్రులతో భేదాభిప్రాయాలుకూడా అసహజమేమీ కాదు. కెరీర్ విషయంలోగాని, డబ్బులు యెలా ఖర్చుపెట్టాలి అనే విషయంలో అయితేనేమి, గదిని యెంత అందంగా అలంకరించుకోవాలి అన్న విషయములో అయితేనేమి చాలా భేదాభిప్రాయాలు వస్తూ వుంటాయి. వాళ్ళ జనరేషన్ వేరు. మీ జనరేషన్ వేరు. వాళ్ళు మీకున్న అభిరుచులని, మీ అలవాట్లని, మీ స్నేహితులని అర్థం చేసుకోలేకపోయుండవచ్చు. మీకు వాళ్ళకి వున్నది తరం భేదమే తప్ప, వాళ్ళు మిమ్మల్ని అసహ్యించుకొన్నట్లుగాని, మీ పరిస్థితులపట్ల కోపంగా వున్నట్లుగాగాని కాదు. వీలైనంతవరకూ వాళ్ళు అర్థం చేసుకోవడానికి వీలయ్యే విధంగా వివరించి చెప్పండి. రోజూ కనీసం పదిహేను నిముషాలు పాటైనా తల్లిదండ్రులతో మాట్లాడడం అనేది అలవాటు వుండాలి. ఒక పది నిముషాలు మీరు వాళ్ళతో ఆహ్లాదకరంగా మాట్లాడితే ఆ అనుభూతి వాళ్ళకి పదిగంటలపాటు వుంటుంది.

'నేను ఎంత గౌరవించినా, ఎంత ప్రేమించినా మా అమ్మకూ నాన్నకూ ఎప్పుడూ అసంతృప్తే' అని కొందరంటారు. మరికొంత పెద్దవాళ్ళైతే నా పిల్లలని వాళ్ళు (నా తల్లిదండ్రులు) అత్యంత గారాబంచేసి పాడుచేస్తున్నారు. పిల్లలని ఒళ్ళో కూర్చోబెట్టుకొని కబుర్లు చెబుతూ గంటల తరబడి కాలక్షేపం చేస్తున్నారు అని వాపోతుంటారు. మానసికంగా ఒంటరితనాన్ని అనుభవిస్తున్న వృద్ధులు తమ మానసిక స్థాయితో పిల్లలని సరిపోల్చుకుని దగ్గరవడానికి ప్రయత్నిస్తుంటారు. వాళ్ళిరువురూ ఒకే స్థాయిలో స్నేహంపట్ల స్పందిస్తూ వుంటారు. దీన్ని మనం అర్థం చేసుకోవాలి. మీరు చెబుతున్న వాదనకూడా నిజమే అయుండొచ్చు. మీ పిల్లలని ఏ విధంగా పెంచదల్చుకున్నారని విషయాన్ని, మీ తల్లిదండ్రులకు అర్థం అయే రీతిలో చెప్పండి చాలు. అప్పరాల్ వాళ్ళు మిమ్మల్ని పెంచి పెద్దచేసినవారు.

మీకు మీ తల్లిదండ్రుల మనస్తత్వం బాగా తెలిసి వుంటుంది. అలాగే మీ మనస్తత్వం వాళ్ళకింకా బాగా తెలిసే వుంటుంది వాళ్ళకి నచ్చని పనులు చేస్తే మీరు వాళ్ళని అగౌరవపరిచేరనుకుంటారు. ఉమ్మడి కుటుంబాల్లో ఈ సమస్య ఎక్కువగా కన్పిస్తుంది.

అల్పసంతోషులైన తల్లిదండ్రులతో ఏ సమస్యా వుండదు. వాళ్ళని గుడికి తీసికెళ్ళినా, ఆస్పత్రికి తీసికెళ్ళినా చాలా సంతోషపడుతూ వుంటారు. మీరు ఆప్యాయంగా రాసే ఉత్తరాలకి కరిగిపోతారు.

మీకు ఏదైనా సమస్య వచ్చినపుడు మీ తల్లిదండ్రులను సంప్రదించండి. వాళ్ళిచ్చినసలహా మీరు పాటించారా లేదా అన్నది వేరే విషయం కేవలం సంప్రదిస్తే చాలు వాళ్ళు సంబరపడిపోతారు.

కొందరు తలిదండ్రులకి మీ పిల్లలకి వాళ్ళ పేరు పెట్టాలనే కోరిక వుంటుంది. దానివల్ల మీ కొచ్చిన నష్టమేమీ లేదు. మీరు మీ పిల్లలకి ఏ పేరైతే పెట్టదలచుకున్నారో, దానికి మీ తల్లిదండ్రుల పేరు కలిపి నామకరణంచేసి రికార్డులలో మాత్రం మీకు ఇష్టమైన పేరు రాయించుకోవచ్చు. ఇది ఉభయత్రా ఆమోదనీయమైనది.

కొందరు తలిదండ్రులు పిల్లలనించి యేమీ ఆశించరు. పిల్లలు క్షేమంగా వుండి, అన్నీ మంచి పనులు చేస్తూ వుంటే చాలనుకుంటారు. మరికొందరు తల్లిదండ్రులని ఏ విషయమూ తృప్తిపరచదు. ఎన్ని వస్తువులు కొనిచ్చినా, ఎన్నిసార్లు యాత్రలకి పంపించినా, ఇంకా ఏదో తక్కువైనట్లు భావిస్తూ కటువుగా మాట్లాడతారు. అటువంటి వాళ్ళని మార్చడం చాలా కష్టం. చిన్నతనంలో వాళ్ళు పొందిన అసంతృప్తినంతా మీమీద చూపిస్తున్నారన్నమాట. అటువంటివాళ్ళని మార్చడానికి ఒకటే మార్గం. మీ వ్యక్తిత్వాన్ని మీరు నిలబెట్టుకుంటూ, మీ వైపునుండి పొరపాట్లు చెయ్యకుండా ప్రవర్తిస్తూ వుండడం.

'మా తల్లీ తండ్రీ మా కోసం ఏం చేశారని గౌరవించాలి? చిన్న

ప్పటినుండి ఒక్కసారైనా మా తండ్రి మమ్మల్ని ముద్దుగా చూసుకున్న పాపాన పోలేదు' అన్న పిల్లలని నేను చూశాను. వాళ్ళ సమస్యలు సమంజసంగానే వుంటాయి. కరక్ట్‌గానే వుంటాయి. ముఖ్యంగా తల్లిదండ్రులు దెబ్బలాడుకోవటం, వాటికి తామే ప్రత్యక్ష సాక్షి అవడం, వీళ్ళని యీ విధంగా తల్లిదండ్రులపట్ల విరాసక్తులను చేస్తాయి. తల్లిదండ్రులు దెబ్బలాడుకొని, ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడకుండా, ఇంటిని ఒక నిశ్శబ్ద యుద్ధరంగంగా చేస్తే పిల్లలమీద ఆ ప్రభావం వుంటుంది. అలాగే తన కళ్ళముందే తల్లిని కొడుతున్న తండ్రిని ఏ పిల్లవాడూ సహించలేడు. ఇలాంటివన్నీ పిల్లలమీద చాలా చెడు ప్రభావాన్ని చూపిస్తాయి. ఇలాంటి పిల్లలు పెద్దవాళ్ళయిన తర్వాత తమ అసంతృప్తిని జీవిత భాగస్వాములమీద చూపిస్తూంటారు. నిత్యం అశాంతితో చిరాకుగా వుంటారు. తమలోని అశాంతిని, వేదనను, ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌ను మరిచిపోవడానికి తాగుడు, పేకాట, రేసులులాంటివి అలవాటు చేసుకుంటారు. ఒక తండ్రిగా మీ బాధ్యత ఎంతో ఒక కొడుకుగా మీ తండ్రిపట్ల కూడా మీకు అంతే బాధ్యత వుంది.

## కష్టాలచుట్టూ కోటలు :

ప్రతి తండ్రీ తమ పిల్లలు సుఖంగా వుండాలనీ, వారికే కష్టం రాకూడదని కోరుకుంటారు. తాము పస్తులుండైనా సరే, పిల్లలకి పంచ భక్ష్య పరమాన్నాలు పెట్టాలనుకుంటారు. ఇంకా డబ్బున్న తండ్రులైతే, కార్లలో స్కూలుకి పంపించి, వేసవిలో ఊటీ పంపించి అపురూపంగా చూసుకుంటూ వుంటారు.

ఇలా గారాబంగా పెరిగిన పిల్లలు అసలు సమస్యలనేవి వుంటాయని ఊహించలేరు. భవిష్యత్తు గురించి బంగారుకలలు కంటూ వుంటారు. తోటి పిల్లల మధ్య తమయొక్క సుపీరియారిటీ కాంప్లెక్స్‌ను చూపిస్తూ

వుంటారు. వాళ్ళ కలలు కల్లలుగా మారిపోతే, విధి వెక్కిరిస్తే ధైర్యాన్ని మనస్థయిర్యాన్ని పోగొట్టుకొంటారు. కొందరు పిల్లలు 'బ్రేక్' తట్టుకోలేక, చెడు అలవాట్లను, చెడు వ్యసనాలను చేసుకొని చెడు స్నేహాన్ని ఆశ్రయించి ఏస్కేపిస్టులవుతారు.

కష్టాలు, కన్నీళ్ళు, అగ్నిపరీక్షలు, జీవితంలో ఒక భాగం. వీటిని చిన్నప్పటినుంచే పిల్లలకు రుచి చూపించాలి. అలాగని—అట్లకాడతో వాత పెట్టమని, జైల్లో పది రోజులు వుండేటట్లు చూడమని కాదు. కనీసం ఒక్కసారేనా సిటీబస్‌లో ప్రయాణించని కుర్రవాడు, కారు పాడై సిటీబస్‌లోనో, ఆటోలోనో వెళ్ళవలసిన పరిస్థితి వచ్చినపుడు, ఆటోవాడితో ఎలా మాట్లాడాలో తెలియని పరిస్థితిలో వుంటే—ఎలా వుంటుందో ఊహించండి.

మీ పిల్లవాడిని అంతటి లజ్జాపూరితమైన పరిస్థితిలోకి తోసింది మీరే. మన పిల్లలకు ఏ కష్టమూ, బాధా కలగకూడదని వాళ్ళని అనుక్షణం కాపాడుతూ వుంటే, మనం కష్టాలలో వున్నప్పుడు వాళ్ళు మనని ఏ విధంగానూ ఆదుకోలేరు. మహాభారతంలో పరీక్షిత్తు కథ చదివే వుంటారు. తన కొడుకైన పరీక్షిత్తుకి సర్పగండం వుందని తెలిసి, సర్పజాతినే నాశనం చెయ్యాలని సర్పయాగం చేస్తాడు. పరీక్షిత్తుని ఒంటిస్తంభం మేడలో వుంచి, అతడిని ఇరవై నాలుగ్గంటలూ కాపలాపెట్టి మనుషులని నియమిస్తాడు. ఇన్ని జాగ్రత్తలు తీసుకొని, ఇక భయం లేదనుకొని వున్న సమయంలో, తక్షకుడు చిన్న క్రిమిగా ఓ పండులో దూరి, పరీక్షిత్తు ఆ పండు తింటున్న సమయంలో పాము కాటు వేస్తాడు.

మన పిల్లలను ఏ కష్టమూ లేకుండా చూడాలని ఎంత జాగ్రత్తగా కాపాడినా-ఏదో ఒక క్షణంలో రావలసిన సమస్య రాకుండా పోదు. మన పిల్లలు సమస్యల్లో పడినప్పుడు మనం చెయ్యవలసిందేమిటంటే-వాళ్ళని కించపరచకుండా, వాళ్ళు చేసిన పని తప్పని మాటి మాటికీ చెప్పిపొడవకుండా, వాళ్ళు ఇరుక్కున్న సమస్యని మనం పరిష్కరించలేని నిస్సహాయస్థితి

ఏదైనా వుంటే దానిని ప్రదర్శించకుండా, వాళ్ళకి తోడుగా అండగా నిల బడడం. వాళ్ళు నిరాశాపూరితంగా ఆలోచించకుండా, ఆత్మహత్య చేసు కొనే లెవల్ వరకూ రాకుండా హాయిగా నిద్రపోయేలా చేయగలగడం.

తమకొచ్చే సమస్యలని నిర్మాణాత్మకంగా, సులభంగా ప్రదర్శించు కొనే విధానం పిల్లలకు తెలియకపోతే, వాళ్ళలో తులనాత్మక శక్తి నశించి పోయి, మానసిక వికాసం లేకుండా పోతుంది. పధ్నాలుగేళ్ళ కుర్రవాడు స్కూల్లో యింకో కుర్రవాడితో దెబ్బలాడాడే అనుకోండి. అవతలి కుర్ర వాడు 'మరుసటి రోజొచ్చి నీ పని పడతానురా' అని బెదిరించాడనుకోండి. అవతలి కుర్రాడు ఏదో మాటవరసకి ఆ మాట అనుండొచ్చు కానీ, మీ అబ్బాయి రాత్రంతా నిద్రపోడు. ఇలా ఏదయినా అశాంతి వుంటే వాడితో మాట్లాడి, గుర్తించి, ధైర్యం చెప్పి మరుసటి రోజు మీ కుర్రవాడితో స్కూలుకి వెళ్ళి, అవతలి వాళ్ళతో మాట్లాడవలసిన బాధ్యత మీదే. ఒక వేళ మీ అబ్బాయి అశాంతిని మీరు గుర్తించని మరుక్షణం, తల్లిదండ్రు లుగా మీరు మీ బాధ్యతను మరిచిపోయారన్నమాట. కష్టం అంటే ఎవరికీ ఇష్టం వుండదు. అందరూ కష్టాలకి దూరంగా వుండాలనే అనుకుంటారు. అలా అనుకోడంలో తప్పులేదు గానీ, అసలు కష్టాలే రాకుండా వుండా లనుకోవడం, వచ్చినపుడు వాటినుంచి దూరంగా పారిపోవాలనుకోవడం, పట్టించుకోకుండా వుండడం మంచిది కాదు. కష్టాలు, సమస్యలు జీవితంలో ఓ భాగం అనే విషయాన్ని మనం మర్చిపోకూడదు. కష్టాలకు మనం ఏ విధంగా ప్రతిస్పందిస్తున్నామనేది ముఖ్యం.

కష్టాలవల్లే జీవితం విలువ తెలుస్తుందనే విషయాన్ని మనం మన పిల్లలకు నేర్పాలి. పూతరేకుల మధ్య తీపి వున్నట్లు, కష్టాల మధ్యనే జీవన మాధుర్యం వుంటుంది. కష్టాలని కూడా జీవితంలో ఒక భాగంగా తీసుకొనే స్థాయికి ముందు మనం ఎదగాలి; మన పిల్లలు ఎదిగేలా చెయ్యాలి. 'తినగ తినగ వేము తియ్యనుండు' అన్నట్లు కష్టాలకి అలవాటుపడితే బాధకూడా మనని అంతగా బాధించదు.

పిల్లలకి ఏదేనా సమస్యవస్తే, తమ తల్లిదండ్రులే తమనా కష్టాల నుంచి బైటపడేయాలనుకుంటారు. అప్పుడే అడుగులు వేయడం నేర్చుకున్న పాపాయి పొరపాటున కిందపడితే, లేవదీస్తారేమోనని తల్లివైపో తండ్రివైపో జాలిగా చూస్తుంది. ఆ చూపులో అర్థం నేను కింద పడ్డాను. నన్నూ నా బాధని గమనించు, నన్ను రక్షించు అని. అప్పుడు మీ రెండు చేతులూ ముందుకు చాపడం ద్వారా 'నేనున్నాను' అనే భద్రతా భావాన్ని మీ పాపకి కలిగిస్తున్నారన్నమాట. అదే, మీ పాప కిందపడగానే మీరేదో పనివున్నట్లు పక్కరూమ్‌లోకి వెళ్ళిపోండి. ఎంత అసహ్యంగా వుంటుందో ఆ సిట్యుయేషన్. ఇదే ఉదాహరణకి ఒక కొస మెరుపు ఏంటంటే, మీ పాప తనకు తాను పడి, అవసరమైన దానికన్నా ఎక్కువ ఏడుస్తూ మీ దృష్టిని తనవైపు తిప్పుకోవాలనుకున్నప్పుడు, మీరది గమనించకుండా పక్కకి వెళితే, నిజంగా ఆ పాపకేమీ దెబ్బతగలకపోతే, తనే స్వస్థత చేకూర్చుకొని మామూలుగా ఆటలో పడిపోతుంది. అలా చేసినప్పుడు, 'అవసరమైనప్పుడే నా తల్లిదండ్రులనుంచి అటెన్షన్‌ని తీసుకోవాలి తప్ప, లేనప్పుడు నేనే నా కష్టాలనుండి బైటపడాలి' అనే భావం మీ పిల్లలలో కలుగుతుంది! అయితే, ఎప్పుడు మీరు ఓదార్పు యివ్వాలి, ఎప్పుడు యివ్వకూడదు అనేది మీ విచక్షణాజ్ఞానం మీద ఆధారపడి వుంటుంది.

కొంతమంది పిల్లలు మరీ మొండిగా వుంటారు. ఏ చిన్న దెబ్బ తగిలినా గంటా, రెండు గంటలు ఏడుస్తుంటారు. ఎప్పుడూ ఓదారుస్తూ వుండేలా మీనుంచి ఎక్కువ సమయాన్ని ఆశిస్తారు. ఇది మొదట్లోనే తుంచి వేయడం మంచిది. లేకపోతే 24 గంటలు పిల్లలని తిప్పుతూ, ఆడిస్తూ వాళ్ళేడుస్తుంటే ఓదారుస్తూ వుండే నవ్వుగొలిపే తండ్రులలో మీరూ ఒకరైపోతారు.

పిల్లలకేదేనా కష్టం వచ్చినప్పుడు పెద్దల ప్రవర్తన ఎలా వుంటుందనేది చూస్తే ఒకోసారి చిత్రం అనిపిస్తుంది. ఎంతమంది తల్లిదండ్రులు

పిల్లలు బాధల్లో వున్నప్పుడు ప్రేమగా దగ్గరకు తీసుకొని లాలిస్తారు? ఉదాహరణకి ఓ బాబు స్కూలునుంచి వస్తూ వస్తూ తల్లి దగ్గరకు రావాలని పరిగెత్తుతూ మెట్లమీద పడిపోయాడనుకోండి. అప్పుడు 'ఎన్నిసార్లు చెప్పాలి నీకు అలా పరిగెట్టుకు రావద్దని' అంటూ మరో దెబ్బ వేసేవాళ్ళే ఎక్కువ. పొద్దుటనుంచి చూడలేదనే తొందరలో, అప్యాయతతో దగ్గరకు వస్తూ ఆ బాబు ఏడుస్తుంటే, మీరు యివ్వవలసింది ఓదార్పు తప్ప, బాబు పరిగెట్టడంవల్ల దెబ్బలు తగిలాయా, నిలబడితే దెబ్బలు తగిలాయా అన్న విశ్లేషణ కాదు. పొరపాటున ఏ ఇంక్ బాటిలో జారి క్రిందపడిపోతే లేదా అద్దంపడి విరిగిపోతే గబగబా వచ్చి పిల్లాడిని వంచి వీపుమీద రెండు దెబ్బలు వేస్తారు. నేలమీద ఇంక్ బాటిల్‌ని పడేసి, ఆ ఇంక్ నేలమీద పారుతూ వుంటే ఎలా వుంటుందో చూడాలనుకోడుకదా అబ్బాయి జరిగింది పొరపాటు మాత్రమే. మీరు చెప్పవలసిందల్లా ఇంక్‌బాటిల్‌గాని, అద్దం గాని తీసినపుడు యెంత భద్రంగా వాడాలనేదే తప్ప, క్రింద పడినపుడు దండించడం కాదు. మీరు ఎలాటప్పుడు దండించాలంటే మీ పాపాయి పక్క స్నేహితుల బాక్స్‌నుండి పెన్సిల్ దొంగిలించినప్పుడో, మీ పర్స్‌నుండి డబ్బులు తీసి బయట ఏదేనా కొనుక్కున్నప్పుడో—ఇలాంటి సమయాల్లో దండించాలి.

పొరపాటు వేరు. తప్పు వేరు. ఇండియన్ పీనల్‌కోడ్‌లో ఈ విషయం స్పష్టంగా రాయబడివుంది. Mistake is Excusable. But Fraud is Punishable అని.

ఇంకొంచెం పెద్దయ్యాక మీ పిల్లవాడు సైకిల్‌మీదో, లూనామీదో వెళ్తూ మధ్య తోవలో యాక్సిడెంట్ జరిగి ఆ సైకిల్ చక్రం పాడవటమో, వంగిపోవడమో జరిగితే, టెన్షన్‌తో భయపడుతూ యింటికి రావడం జరిగితే వాళ్ళమీద యాక్సిడెంట్ జరిగిన దానికంటే ఎక్కువగా వాతావరణం సృష్టిస్తే వాళ్ళు బెదిరిపోతారు. "నువ్వు చాలా నిర్లక్ష్యంగా వెళ్ళేవు.

అందువల్లే యిలా జరిగింది" అని మీరే ఒక జడ్జిలాగా ఒక కామెంట్ పాస్ చెయ్యడమో, ఒక మర్డర్ స్వయాన చూసిన సాక్షిలాగా వివరించడమో చేస్తే, మీమీద వాళ్ళకి గౌరవం తగ్గిపోతుంది.

ఏదేనా పొరపాటు జరిగినపుడు వాళ్ళయొక్క వాదనని శాంతంగా వినడమే మనం వాళ్ళకిచ్చే గొప్ప గౌరవం, ఆప్యాయత. వాళ్ళు ఉత్సాహంగా అన్ని విషయాలు చెప్తారు. వాళ్ళను అన్ని విషయాలు చెప్పనిచ్చి అప్పుడు ఆ విషయంపట్ల మన ఎనాలిసిస్, మనం ఎందుకు ఆ విషయం తప్పనుకుంటున్నామో చెప్పగలిగితే వాడికి అర్థం అవుతుంది. పొరపాటు వేరే వ్యక్తులదైతే మనం వారిపట్ల సానుభూతి చూపిస్తాం. చూపించాలి. అదే పొరపాటు మన పిల్లలదైతే, వాళ్ళెందుకు పొరపాటో మనం వివరించి చెప్పగలగాలి. అలా అని చెప్పి ప్రతిదానికి వాళ్ళవి సపోర్ట్ చెయ్యమనికాదు. పక్కింటి పిల్లవాడిని మీ పిల్లవాడు కొడితే, వాళ్ళు మీ మీదకు దెబ్బలాటకొస్తే మీవాడిని సపోర్టు చెయ్యానవసరంలేదు. మీరు చెయ్యవలసిందల్లా, మీ పిల్లవాడు ముందు కొట్టాడా, అవతల పిల్లవాడు ముందు కొట్టాడా అనేది నిర్ధారణ చెయ్యటమే.

సమస్యనించి బైటపడే విషయంలో మీ పిల్లవాడు చేసే ప్రయత్నంలో, వాడికి అర్థం అయ్యే భాషలో చెప్పాలిగానీ, మీ తర్కాన్నంతా వాడిముందు ప్రదర్శించనవసరంలేదు. మీ జ్ఞానాన్నంతా వాడిమీద రుద్దనవసరంలేదు. అగ్నిప్రమాదం జరిగితే లోపలున్న వాళ్ళకి మంటలు ఎలా ఆర్పాలో నేర్పాలని ఆలోచించకూడదు. వాళ్ళని ఎలా బైటకితీసుకురావాలో చూడాలి. సమస్యల్లో చిక్కుకున్న పిల్లలతో సానుభూతిగా మాట్లాడి, వాళ్ళకా సమస్య నుండి ఎంత తొందరగా బైటపడాలో చెప్పండి.

సమస్యకి కర్త, కర్మ, క్రియలు విశ్లేషణలు చేర్చకండి.

పిల్లలే మన బహుమతి :

మనం ఏదైనా వస్తువు కొనుక్కొన్నప్పుడు, ఆ వస్తువుబాగోలేకపోతే

దాన్ని తిరిగి షాపు వాడికి ఇచ్చేయచ్చు. అలాగే మన కారు బాగా పడకపోతే మనం అమ్మేసుకోవచ్చు. మనకి పిల్లలు దేముడిచ్చిన ఒక బహుమతి. పిల్లలని మాత్రం నచ్చకపోతే ట్రాన్స్‌ఫర్ చెయ్యలేం.

జపాన్‌లో తరచూ భూకంపం వస్తూ వుంటుంది. మన దేశంలో కూడా ఒకప్పుడు ఉత్తరకాశీ జిల్లాలో పెద్ద భూకంపం వచ్చింది. ఎంతో మంది చనిపోయారు. మిగిలినవాళ్ళు బ్రతికే వున్నారు. ఒకసారి భూకంపాన్ని ప్రత్యక్షంగా చూసిన వ్యక్తి ఆ ప్రాంతాన్ని శాశ్వతంగా వదిలేసి వేరే చోటికి పారిపోగలడా? పోయి బ్రతకగలడా? లేదు. తనవాళ్ళ మధ్యే బ్రతకాలనుకొని తన నిర్ణయాన్ని మార్చుకొంటాడు. మన పిల్లలు ఎంత పెద్దవాళ్ళయినా వాళ్లు మన పిల్లలు. భార్యనైనా విడిచిపెట్టి వుండగలమేమోగాని, మనం మన పిల్లలని విడిచి వుండలేము.

పిల్లలకి కష్టాలొచ్చినప్పుడు వాళ్ళకి వేదాంతాన్ని బోధించకండి. వాళ్ళకి చాలా బోరుగా వుంటుంది. అలాగే పిల్లలకి ఒక సమస్యని వివరించవలసివచ్చినపుడు మీ అనుభవం,మీరా వయసులో ఆ సమస్యని ఎంత తెలివితేటలతో ఆ సమస్యలని ఎదుర్కొన్నారు మొదలగు విషయాలన్నీ చెప్పి ఊదరగొట్టకండి. నిజంగా మీకా సమస్య వచ్చినపుడు ఏడుస్తూ మీరో మూలన పడుకొని వుంటారు. లేదా తల్లిదండ్రులమీద తిరగబడి వుంటారు. అంతేగాని మీ పిల్లలంత స్పష్టతగా మీరా సమస్యను చెప్పలేదు.

చిన్నపిల్లలకి, జీవితంలో ఎన్నో సమస్యలను ధైర్యంగా ఎదుర్కొని పైకొచ్చిన వ్యక్తుల కథలు చెపుతూ వుండాలి. అది అటు పిల్లలకు మనకు కూడా చాలా స్ఫూర్తినిస్తుంది. ఇండియా, పాకిస్తాన్ సరిహద్దు ప్రాంతాల్లో బోర్డర్ సెక్యూరిటీ ఫోర్స్ కంటే ఎక్కువ కష్టపడి పనిచేసే వాళ్ళెవరుంటారు? ఎన్ని సమస్యలున్నా అవన్నీ మరచిపోయి వాళ్లు దేశం కోసం పోరాడడం లేదా? వీళ్ళకింత ధైర్యం ఎలా వచ్చింది? ఏ దేశానికి సంబంధించిన సైనికులైనా సరే వాళ్ళెంత గొప్పగా సమస్యల నెదు

ర్కొంటున్నారు? కాళ్ళు, చేతులూ పోయినాసరే విశ్వాసాన్ని పెంచుకొని ఎలా జీవిస్తున్నారు? ఇవన్నీ మనం మన పిల్లలకి చెప్పాలి. పెద్దగీతముందు చిన్నగీత చిన్నగానే కనపడుతుంది. మనం చెయ్యవలసిందల్లా వాళ్ళ సమస్యల గీతల ముందు మరింత పెద్ద గీతలను చూపించడమే. కష్టపడ్డ వాళ్ళందరినీ చుట్టూ చూస్తూ వుంటే ఎంత హాయిగా బ్రతుకుతున్నామనే విషయం తెలుస్తుంది. నాలుగు తలుపులు మూసి తెరలుదించేస్తే గది ఇరుకై పోతుంది. పిల్లల మనసుని అలా ఇరుగ్గా ఎప్పుడూ చెయ్యకూడదు. మీ పిల్లవాడు ఐస్‌క్రీం కోసం ఏడుస్తూ వుంటే, పక్కపిల్లవాడు గంజి కోసం ఏడుస్తాడనే విషయం చెప్పి చూపించాల్సిన బాధ్యత మీదే.

సమస్యలు కేవలం మన పొరపాటువల్లే వస్తాయనుకోవడం పొర పాటు. మన గ్రహపాటు బాగులేకపోయినా మన ప్రమేయం లేకుండానే సమస్యలు వస్తాయి. రాజీవ్‌గాంధీ అంటే పడనివాళ్ళు అతన్ని దారు ణంగా హత్య చేశారు. అయితే ఈ హత్యా ప్రయత్నంలో రాజీవ్‌గాంధీ బాడీగార్డు అయిన ఒక పోలీసాఫీసర్ కూడా మరణించాడు. అతనికి ఈ రాజకీయాలతో, కక్షలతో, ఏ సంబంధమూలేదు కదా! దుఃఖానికి పరాకాష్ట చెప్పుకోవాలంటే యింతకన్నా పెద్ద ఉదాహరణ ఏముంటుంది. మరణిం చాక యిచ్చే అవార్డులవల్ల ప్రాణం వెనక్కిరాదు. వాళ్ళ ప్రయత్నాలు, వాళ్ళ నిజాయితీ మాత్రం మిగిలిపోతాయి. ఇలాంటివాళ్ళ జీవిత చరిత్రలు పిల్లలకి ఎంతో స్ఫూర్తినిస్తాయి. ఒక అభిమన్యుడు, ఒక బాలచంద్రుడు, ఇలాంటివాళ్ళు ఎప్పుడూ పిల్లలకి స్ఫూర్తినిస్తారు. వియత్నాం యుద్ధంలో డేవిడ్ అనే సైనికుడి వాస్తవగాథ కంటనీరు పెట్టించింది. ఆ సినిమా కథ చెపుతాను.

వియత్నాం యుద్ధం జరుగుతోంది. నౌకాదళం నిర్వహించే అల్ట్రాలైట్ స్పెషల్ ఫోర్సెస్ టీములలో డేవిడ్ శిక్షణ పొందు తున్నాడు. ఈ టీమ్ శత్రు స్థావరాలను వెదికి నాశనం చెయ్యాల్సి

వస్తుంది. ఈ పని చాలా ప్రమాదంతో కూడుకొన్నది. శిక్షణ పొందిన డేవిడ్ శత్రు స్థావరాలమీద రాత్రివేళ దాడి చేయాల్సి వచ్చింది. శత్రువులు మిషిన్‌గన్స్‌తో డేవిడ్‌మీద, అతని దళంమీద కాల్పులు జరిపారు. డేవిడ్ తన బెల్ట్‌నుండి ఫాస్పరస్ గ్రైనేడ్‌ను తీసుకొని దాన్ని శత్రువులమీద విసరాలని లేచి నిలబడ్డాడు. విసరే ప్రయత్నంలో అతను తన చేతిని వెనక్కి తీసుకోగానే శత్రువులు పేల్చిన బులెట్ ఆ గ్రైనేడ్‌కు తగిలి, అతని చెవి పక్కనే పేలడం జరిగింది.

నది ఒడ్డున వున్న బురదనీళ్ళలో పడివున్న డేవిడ్‌కు తన మొహంలోని కొంతభాగం వూడిపోవడం కనిపించింది. అతని శరీరానికి అంటుకొని వున్న ఫాస్పరస్ గ్రైనేడ్ భాస్వరం గాలిలోని ఆక్సిజన్‌తో కలవడంవల్ల అతని భుజం, మొహం పూర్తిగా కాలిపోయి లోపల్లోపలే ఉడికినట్లుగా అయ్యాయి.

తన మరణం చాలా సమీపంలోనే వుందని డేవిడ్‌కి తెలిసిపోయింది. అతను తన ఆఖరిక్షణాలకోసం నిరీక్షించే సమయంలో అతనితో వచ్చిన సైనికులు అతన్ని వెంటనే విమానంలో వూరికి తరలించారు. డేవిడ్‌ని హాస్పటల్‌లో చేర్పించారు.

డేవిడ్‌ని ఆపరేషన్ థియేటర్‌కి తీసుకువెళ్ళిన సర్జెన్లకు ఓ పెద్ద సమస్య ఎదురైంది. ఏ గ్రైనేడ్ భాస్వరంవల్ల మొహం కాలిందో, ఆ చర్మాన్ని కోసేటప్పుడు ఆ చర్మానికి అంటుకొని వున్న భాస్వరం థియేటర్‌లో వున్న ఆక్సిజన్‌తో కలిసి మండటం మొదలుపెట్టింది. అలా జరిగినప్పుడల్లా, ఆక్సిజన్ సిలిండర్ ఎక్కడ పేలుతుందో అనే భయంతో డాక్టర్లు, నర్సులు ఎన్నోసార్లు ఆపరేషన్ ఆపేసి, అతన్ని అలాగే వంటరిగా వదిలేసి రూమ్ బైటికి వెళ్ళిపోయేవారు. ఎలాగో ఈ ఆపరేషన్ సక్సెస్ అయింది.

యుద్ధంలో తీవ్రంగా గాయపడ్డ, కాలిపోయిన సైనికుల వుండే వార్డులో డేవిడ్‌ను వుంచారు.

బెడ్ మీద వున్న డేవిడ్‌కు తన తల బాగా ఉబ్బిపోయిందని తెలుసు. తన మొహం ఎంతో వికారంగా తయారైందని తెలుసు. ఒకప్పుడు అందంగా వున్న తనకు ఈ పరిస్థితి ఒక అగ్ని పరీక్ష లాంటిదని గ్రహించిన డేవిడ్ హఠాత్తుగా తను ఒంటరివాడయి నట్లుగా బాధపడ్డాడు. అంత భయంకరమైన రూపంతో తన భార్యను తన వాళ్ళను ఎలా చూడాలో అతనికి అర్థం కాలేదు. ఎందుకూ, ఎవ్వరికీ పనికిరాని తాను ఎందుకోసం జీవించాలని మధనపడ్డాడు.

ఆ రూమ్‌లో కేవలం డేవిడ్ మాత్రమే అలాలేడు. మరో వ్యక్తికూడా దాదాపు అలాగే గాయపడి చూసేందుకు భయంకరంగా వున్నాడు. అతనికో కాలు, చెయ్యి పోయాయి. మొహం చాలా వరకూ చీలిపోయి గాయాలతో నిండి వుంది. అతన్ని చూసినప్పు డల్లా డేవిడ్‌కు తన రూపంకూడా అలాగే వుందికదా అన్న దిగులు రెట్టింపయ్యేది.

ఒకరోజు వేరే సైనికుడి భార్య అతన్ని చూసేందుకు వచ్చింది. రూమ్‌లో అడుగుపెట్టిన ఆమె ఒక్కసారి భర్తవైపు చూసి భయపడింది. కడుపులో వికారం పెట్టినట్లు కావడంతో అతన్ని మరోసారి చూసే ధైర్యం చెయ్యలేకపోయింది. తమ పెళ్ళినాడు భర్త తొడిగిన ఉంగరాన్ని తీసి పక్కనే వున్న టేబిల్ మీద పెట్టి "ఐయాం సారీ, ఇలా వున్న మీతో కలిసి నేను బ్రతక లేను" అని చెప్పి వెళ్ళిపోయింది. భార్యను చూసిన ఆనందం క్షణాల్లో విషాదంగా మారడంతో అతని నోటినుంచి మాటరాలేదు. ఆమె వెళ్ళిన తరువాత కుమిలి కుమిలి ఏడ్చాడు. అందవిహీనంగా తయారయిన తనను చూసి ప్రపంచం అసహ్యించుకుంటుందని

అతనికి తెలుసు. కానీ, ఎవరో ఎక్కడో తనకోసం బాధపడేవ్యక్తి ఒకరుంటారని తన రూపాన్ని కాకుండా- హృదయాన్ని, పరిస్థితిని చూసి ఓదార్చే వ్యక్తి కావాలని, ఆ వ్యక్తి తన భార్యే కావాలని అతను ఎంతగానో కోరుకున్నాడు కానీ జరిగింది మాత్రంవేరొకటి. అతనికి వున్న ఆ ఒక్క ఆశకూడా పోయింది. శరీరానికి తగిలిన గాయంకన్నా మనసుకి తగిలిన ఆ గాయం మరింత బాధపెట్టడంతో రెండ్రోజుల తర్వాత అతను మరణించాడు.

ఇవన్నీ చూసిన డేవిడ్ చాలా బాధపడ్డాడు. భవిష్యత్తులో తన కెలాంటి పరిస్థితి ఎదురౌతుందోనని భయపడ్డాడు. మూడు రోజుల తర్వాత డేవిడ్ భార్య వచ్చింది. అతనికి దగ్గరగా వచ్చి మొహంమీద ఎక్కడైతే బాండేజ్ లేదో అక్కడ ముద్దుపెట్టు కొంది. "ఐ లవ్ యూ! ఇప్పుడే కాదు. ఎప్పటికీ మిమ్మల్ని ప్రేమి స్తాను. ఎలాంటి పరిస్థితులొచ్చినా, ఎటువంటి కష్టాలొచ్చినా మని ద్దరం కలిసి వాటిని ఎదుర్కొందాం" అంటూ ప్రేమగా కౌగిలించు కున్న భార్యవైపు డేవిడ్ ఆశ్చర్యంగా చూశాడు. ఇది కలా! నిజమా! అన్న విషయం అతనికి అర్థం కాలేదు.

తన పరిస్థితుల్లోనే వున్న మరో వ్యక్తితో . అతని భార్య ఎలా మాట్లాడిందో ప్రత్యక్షంగా చూసిన డేవిడ్‌కు తన భార్య చూపిన ప్రేమ, ఆదరణ గొప్ప మానసిక బలాన్ని యిచ్చాయి. ఎంతో దైవభక్తివున్న భార్య తనను అలా ఆదరించేసరికి డేవిడ్‌కు జీవితంమీద, దైవంమీద విశ్వాసం పెరిగింది. ఆ తర్వాత డేవిడ్ గాయాలు మెల్లగా మానడం మొదలుపెట్టాయి. ఎన్నో ఆపరేషన్లు, కొన్ని నెలలపాటు శారీరక హింస అనుభవించిన తర్వాత డేవిడ్ మెల్లగా కోలుకున్నాడు. అతను తన దృష్టినీ, వినికిడి శక్తినీ కోల్పోలేదు.

ఇంత బాధ అనుభవించిన డేవిడ్‌ను టెలివిజన్‌ద్వారా ఆ దేశ ప్రజలకు పరిచయం చేశారు. డేవిడ్ తన అద్భుతమైన సందేశాన్ని ప్రజలకు ఈ విధంగా చెప్పాడు.

"నేను వియత్నాంకు వెళ్ళిన తర్వాత నాలో శారీరకంగా మానసికంగా చాలా మార్పులొచ్చాయి. ఒకప్పటికంటే ఇప్పుడు పరిపూర్ణమైన వ్యక్తినయ్యాను. నా జీవితంలో నాకు ఎదురయిన దుర్ఘటన, నాకు కలిగిన వేదనద్వారా భగవంతుడు నాకో పెద్ద సహాయం చేశాడు. ఈ వేదనవల్లే నేను మనుషులకు దగ్గరయ్యాను. నా జీవితంలోని విషాదంతో పోరాడిన నేను ఇతరులకు స్ఫూర్తి కలిగించే అవకాశాన్ని భగవంతుడు ఈ ఏక్సిడెంట్‌ద్వారా నాకు కలిగించాడు."

డేవిడ్ మాటలకు ప్రజలు ఆశ్చర్యపోయారు. అతన్ని చూసి ఎంతగానో స్ఫూర్తిని పొందారు. డేవిడ్‌కు వచ్చిన కష్టం తమ పిల్లలకు రాకూడదని ఎవరైనా అనుకుంటారు. అంత విషాదం అతన్ని చుట్టుముట్టినా దేవుడు అతని కష్టాన్ని చాలా ఫలవంతంగా, ఎంతో విలువైనదిగా మార్చాడు.

....అదీ కథ.

అన్నీ సక్రమంగా జరుగుతూ, ఆనందంగా వుండేవాళ్ళకు 'ఓదార్పు' అవసరం వుండదు. ఒక వ్యక్తి నిరాశా నిస్పృహలతో పోరాడేటప్పుడు, ఆత్మవిశ్వాసానికి దెబ్బతగిలినప్పుడు, ఆత్మన్యూనతా భావం వేధించేటప్పుడు, అపజయాలు ఎదురైనప్పుడు మాత్రమే ఓదార్పు, ప్రోత్సాహం అవసరం అవుతాయి. ముఖ్యంగా పిల్లలు శారీరకంగా, ఆర్థికంగా, మానసికంగా తల్లిదండ్రులమీద ఆధారపడి వుంటారు. కాబట్టి వాళ్ళ దగ్గరనుండి ప్రోత్సాహాన్ని, ఓదార్పుని కోరుకుంటారు. అందువల్ల మన పిల్లలకి ఏ సమస్య వచ్చినా, వాళ్ళను ఓదార్చి, వాళ్ళ కష్టమే వాళ్ళ మంచి వ్యక్తిత్వానికి

పునాది! అనే విషయాన్ని చెబుతూ, వాళ్ళు నిర్మాణాత్మకంగా ఆలోచించేలా చేసే బాధ్యత తల్లిదండ్రులదే.

ఒకే వీధిలో వుండే ఇద్దరు పిల్లల్లో ఒకరు ఏ.సి.కారులో వెళుతుంటే వేరొకరు ఎండలో నడిచి వెళ్తుండవచ్చు. ఎండలో నడిచి వెళ్ళేవాళ్ళను ఎండ అంతగా బాధపెట్టదు. అదే ఏ. సి. కారులో వెళ్ళేవాడికి ఎండలో నడవడమంటే యాతనగా అనిపిస్తుంది. శరీరమైనా, మనసైనా కష్టానికి అల వాటు పడటం జరిగితే ఆ కష్టం అంతగా బాధించదు. నిజంగా కష్టపడ్డ వ్యక్తికి ఎదుట వ్యక్తి కష్టాన్ని అర్థం చేసుకోగలిగే శక్తి వుంటుంది.

'ఆకలి' అంటే ఏమిటో తెలిసినవాళ్ళకు మరో వ్యక్తి ఆకలి అర్థం ఔతుంది. ఏక్సిడెంట్‌లో బాగా దెబ్బలు తగిలిన వ్యక్తి, అదే పరిస్థితి ఇంకొకరికి ఎదురైతే ఆ బాధ అర్థం చేసుకోగలుగుతాడు. ఒక నవల రాసిన రచయితకు మరో వ్యక్తి రచన చేస్తుంటే ఆ కష్టం ఎలాంటిదో అర్థం చేసుకోగలుగుతాడు. అదే రాయకుండా నలుగురితో నాలుగురాళ్లు రువ్వేవాళ్ళకు ఆ బాధ, కృషి ఎలా అర్థం అవుతాయి? అందువల్ల ఎవరైతే కష్టపడతారో వాళ్ళకు ఎదుటివాళ్ళ బాధ, దుఃఖం అర్థం ఔతాయి.

కష్టపడటంవల్ల మరో లాభం వుంది. మన అనుభవం అహంకారాన్ని తగ్గిస్తుంది. వినయాన్ని, నమ్రతను పెంచుతుంది. అందువల్ల ఇతరులకు సహాయం చేసే గుణం అలవడుతుంది. మూడు రకాల అంగవైకల్యాలతో బాధపడ్డ హేలెన్ కెల్లర్ తాను పూర్తిగా నిస్సహాయురాలినని దిగులుపడకుండా, తనలాగా అంగవైకల్యంతో బాధపడేవాళ్ళకు సేవ చేయటం అనేది ప్రపంచంలోని వింతల్లో ఒకటిగా చెప్పుకోవచ్చు. కష్టపడడం అనేది మనల్ని మానవత్వంవైపు, సేవాగుణంవైపు నడిపితే అంతకంటే కావలసినదేముంది?

చిన్నతనంలోనే కష్టపడ్డ వాళ్ళలో మానసికమైన ఎదుగుదల ఎక్కువగా వుంటుంది. బడిలో, కాలేజీలో మనం చదివే అక్షరాలకన్నా అనుభ

వాలే మనిషిలో జ్ఞానాన్ని కలిగిస్తాయి. మంచినీ, చెడునూ విశ్లేషించగలిగే గుణం, సహనం ఒకరిమీద ఆధారపడకుండా తన స్వశక్తితో బతకడం– ఇవన్నీ కష్టపడడంవల్లే అలవడతాయి. తినడానికి తిండిలేని ఎందరో యువకులు ఎంతో కష్టపడి పారిశ్రామికవేత్తలు అయితే అందులో ఆశ్చర్యము ఏమీలేదు. ఇంత అభివృద్ధికి కారణం కేవలం కష్టపడటమే.

కష్టం ఎదురైనప్పుడు మనుషుల్లో ఐకమత్యం పెరుగుతుంది. గోదావరికి వరదలొచ్చినప్పుడు ముంపునకు గురయ్యే ప్రాంతాల్లో వున్న వారు అన్ని భేదాలు, దెబ్బలాటలు మరచిపోయి ఒకటవుతారు. జాతులు, కులాలు,ద్వేషాలు తాత్కాలికంగానైనా నశిస్తాయి. ఆపదల్లో ఆత్మీయతలు, ఆదరణలు పెరుగుతాయి. పెద్దవాళ్ళమాట వినని పిల్లలు కూడా తమకు దెబ్బ తగిలినపుడు, జ్వరం వచ్చినప్పుడో బుద్ధిగా, ప్రేమగా వుంటారు.

మనం ఓ విషయం జ్ఞాపకం వుంచుకోవాలి. పిల్లలు శారీరక, మానసిక సమస్యలతో బాధపడుతుండే మనం ఎంతో ఓర్పుగా, నేర్పుగా వ్యవహరించవలసి వుంటుంది. సమస్యలవల్ల పిల్లల్లో మానసిక వికాసం తప్పకుండా వస్తుంది. కానీ, ఆ మార్పు క్షణాల్లో మనకు కనబడాలని మనం అనుకుంటే అది పొరపాటు. ఒక కాయ పండుగా మారేందుకు కొంత వ్యవధి తీసుకున్నట్లే కష్టాలను ఎదుర్కొన్నవారిలో మానసిక పరిపక్వత వచ్చేందుకు కొంత సమయం పడుతుంది. ఆ విషయం మనం మరచిపోకూడదు.

పిల్లలకు ఏ విషయంలోనైనా మనం సలహా ఇవ్వదలచుకుంటే ముందు మనల్ని మనం సరిదిద్దుకోవల్సిన అవసరం ఎంతైనా వుంది. పిల్లలకు ఆస్తి, అంతస్తు, కార్లు, నగలు ఇవ్వగలిగే తల్లిదండ్రులు ఎందరో వుంటారు. కానీ, వాళ్ళకు మానసిక వికాసాన్ని, మంచి వ్యక్తిత్వాన్ని ఇవ్వగలిగే తల్లిదండ్రులు కొందరే వుంటారు. పిల్లలు ఏ విషయములోనైనా ఓటమి ఎదుర్కొన్నప్పుడు, ఆ విషయంలో వాళ్ళకు ఓదార్పు

నిస్తూ ఆ ఓటమిని నిజమైన విజయానికి సోపానమనే విషయాన్ని వాళ్ళకు అర్థమయ్యేలా చెప్పగలగాలి. ఓటమివల్ల కలిగిన పరాజయాన్ని పట్టుదలగా మార్చుకొనే శక్తి మనం పిల్లలకి ఇవ్వాలి.

ఒలింపిక్స్‌లో ఆడేందుకు, మనదేశ ఖ్యాతికోసం నిజంగా తపన పడేవాడు రాత్రి, పగలు కష్టపడి తన ఆటను ప్రాక్టీస్ చేసేవాడిలో నిజాయితీ కనిపిస్తుంది. అలా కాకుండా ప్రభుత్వం ఖర్చుతో విదేశాలు చూడాలని, కాసేపు వార్తల్లో తన పేరు వినబడాలని కోరుకుంటూ ప్రాక్టీస్ చేసే వాడిలో చిత్తశుద్ధి ఏముంటుంది? మనం ఆడినా, ఆడకపోయినా మన డబ్బులు మనకి వస్తాయి అనే ధీమాతో మన ఇండియన్ క్రికెట్ టీం రాణించకుండా వుంది. పాకిస్తాన్ ఆటగాళ్ళలో అలాంటి నిర్లక్ష్యం కన్నా నిజాయితీ ఎక్కువ కనిపిస్తుంది.

ఆటల్లోలాగే జీవితంలో కూడా గెలుపూ, ఓటమీ వుంటాయి. గెలిచినపుడు, అనుకున్నవి అనుకున్నట్లు జరిగినపుడు అందరూ నవ్వుతారు. అదే అపసవ్యంగా జరిగినపుడు నిరాశపడ్డ వాళ్ళే ఎక్కువ. ఇలాంటి భావాలను మనం వుండే పరిసరాలు మరింత ప్రభావితం చేస్తాయి. ఏదైనా పరీక్షలో ఫెయిలయిన పిల్లాడిని 'నువ్వు నా కడుపున చెడపుట్టావు' అని తిడితే, ఆ పిల్లాడి నిరాశ ఎక్కువై ఆత్మహత్య చేసుకున్నా ఆశ్చర్యంలేదు. అదే అర్థం చేసుకొనే తల్లిదండ్రులు "నువ్వు తెలివితక్కువ వాడివి కావు. ఈసారి మరింత కష్టపడి రాస్తే, ఇంకా మంచి మార్కులొస్తాయి" అని ప్రోత్సహిస్తే—అతనే ఒక గొప్ప వ్యక్తి అవుతాడు.

**పిల్లలని పెంచే విధానాలు—రకాలు :**

ఒక మనిషి సహనానికి ఉన్నతస్థాయి పరీక్ష ఏదయినా వుందంటే అది 'పిల్లలని పెంచడం' అనొచ్చు. తల్లీ, తండ్రీ పుత్రోత్సాహంతో పరవశించాక, ఆ మగత నుండి బయట పడ్డాక ఓ పెద్ద ప్రశ్నార్థకం వాళ్ళ మనసు ముంగిట నిలుస్తుంది. అది 'పిల్లలని ఎలా పెంచాలి?' అనే ప్రశ్న.

ఈ ప్రశ్న అందరూ వేసుకోరు. సాధారణంగా పిల్లలు పుట్టడం అనేది ఎంత రొటీన్‌గా జరిగిపోతుందో, వాళ్ళు పెరగడంకూడా అంతే రొటీన్‌గా జరిగిపోతుంది. ఈ విషయంలో ఆవేశాల ప్రాధాన్యత తప్ప, ఆలోచనల ప్రాధాన్యత వుండదు.

ఇంటికి పెద్దగావున్న తండ్రి తన ఇష్టా-ఇష్టాలకు తగ్గట్టు అందరూ ప్రవర్తించాలని కోరుకుంటాడు. తన అభిరుచులు, అలవాట్లు చాలా గొప్పవని అనుకుంటాడు, నమ్ముతాడు. తన రక్షణలో పెరుగుతున్న పిల్లలు తనలాగే ఆలోచించాలని ఆదేశించడం జరుగుతుంది. ఇంతవరకూ బాగానే వుంది. వచ్చే చిక్కల్లా ఆ తండ్రి అభిరుచులూ, అలవాట్లు, ఆలోచనలూ ఎలాంటివి? అన్న ప్రశ్న దగ్గరే ఉత్పన్నం అవుతుంది. తండ్రి తాగుబోతై ఆ పంథాలోనే పిల్లలని పెంచాలి అనుకుంటే ఇల్లు నరకమౌతుంది. అలా కాకుండా ఆ తండ్రికి ఉన్నతమైన వ్యక్తిత్వం వుండి, మంచి అలవాట్లు వుంటే ఆ ఇంటి పరిస్థితి మరోలా వుంటుంది.

కేవలం తండ్రి ప్రవర్తన బాగుంటే చాలా! అనకండి. తల్లి ప్రవర్తన, వ్యక్తిత్వం కూడా పిల్లలమీద ఎంతో ప్రభావాన్ని చూపిస్తుంది. అందుకే ఒక ఇంట్లో పిల్లలు సక్రమంగా పెరగాలంటే తల్లిదండ్రులిద్దరూ సమాన బాధ్యత వహించాలి. వాళ్ళు పరస్పరం వ్యతిరేక ధృవాలయితే పిల్లలు చాలా బాధపడతారు.

ప్రతి వ్యక్తి వ్యక్తిత్వానికి, స్వభావానికి బహుముఖాలుంటాయి. మన ప్రవర్తన ఒక్కరితో ఒక్కోవిధంగా వుంటుంది. ఎదుటి వ్యక్తికి తగ్గట్లు మన ప్రవర్తన మారుతుంది. ఒకే వ్యక్తి తనపై అధికారితో ఓలాగ, సాటి ఉద్యోగస్తులతో ఒకలాగ, తన మిత్రులతో వో విధంగా, తల్లిదండ్రులతోనూ, భార్యతోనూ మరో విధంగా ప్రవర్తిస్తాడు. పిల్లల విషయానికి వచ్చేసరికి వేరేగా పొంతన లేకుండా ప్రవర్తించవచ్చు. ఈ

విషయం పిల్లలకి అర్థంకాదు. కనుకే అందరితో బాగావుండే తమ తండ్రి, తమ విషయంలోనే కర్కశంగా వున్నాడనుకుంటారు.

ప్రతి ఇంట్లోను తల్లిదండ్రుల వ్యక్తిత్వంపట్ల వారి ప్రవర్తనవల్ల ఏర్పడే వాతావరణమే పిల్లల్లోని వ్యక్తిత్వానికి మూలకారణం అవుతుంది. ఇంట్లో వాతావరణంలో భయం, కఠోరత్వం నిండి వుంటే పిల్లలు అభద్రతా భావంతో కుంగిపోతారు. కొన్ని యిళ్ళల్లో ఆహ్లాదం, స్నేహపూరితమైన వాతావరణం వుంటుంది. అటువంటి పరిసరాలలో పెరిగే పిల్లలు ధైర్యస్థులుగా, ఆశాజీవులుగా తయారవుతారు.

తల్లిదండ్రుల ప్రవర్తనలోని లోపాలు అంటే ఆ లిస్టులోకి చాలా వస్తాయి. వారు పూర్తిగా క్రూరులో, రాక్షసులో కాకపోవచ్చు. కానీ, కొన్ని దురలవాట్లు కూడా యింటి వాతావరణాన్ని పాడుచేస్తాయి. దురలవాట్లంటే కేవలం తాగటం, రేసుల కెళ్ళడం, పేకాడటం మాత్రమే కాదు. బలహీనతలకు ఖచ్చితమైన స్వరూపం అంటూ వుండదు.

అలవాటుకూ, దురలవాటుకూ మధ్య వో సరిహద్దు యెప్పుడూ వుంటుంది. ఆ హద్దు దాటితే మంచికూడా చెడుగా మారుతుంది. బాలింతరాలికి బ్రాందీ ఇస్తారు. బావుంది కదా అని తాగుబోతులు కాకూడదు కదా. అలాగే ఏదైనా సరే వో అలవాటు మితిమీరితే అది దురలవాటు ఔతుంది.

ప్రతి మనిషి శరీరానికి విటమిన్లు యెంతో అవసరం. అలాగని మోతాదుకు మించి మల్టీ విటమిన్ మాత్రలు మింగితే తెలియని రోగం మనల్ని పట్టి పీడిస్తుంది. ప్రశాంతతను, నిద్రనూ కలిగించే 'కాంపోజ్' మాత్రలు ఒకటికి బదులు ముప్పయి తీసుకుంటే మనిషి మళ్ళీ నిద్రలేవడు. ఏదో సరదాగా పేకాట ఆడుకుంటే ఆనందాన్నీ, టైంపాస్‌నీ కలిగిస్తుంది. దాన్నే వ్రతంలా ఆచరించి, ఇంట్లో వస్తువులనూ, ఇంటినీ తాకట్టుపెడితే కొంప మునుగుతుంది. ఇలా యెన్నో విషయాలు వో హద్దుదాటితే చెడుగా పరిణమిస్తాయి. వో అబ్బాయి ఎవరేనా అమ్మాయిని చూసి "మీరు చాలా

అందంగా వున్నారని, సౌందర్యానికి ప్రతీకనీ, మనుచరిత్రలోని వరూధినికి మీకూ బాగా పోలికలున్నాయనీ" పొగిడితే, ఏ మాత్రం సెన్స్ వున్న అమ్మాయైనా, 'ఏమిటి కథ?' అని మనసులో అనుకొంటుంది. 'వాగితే వాగాడులే' అని పట్టించుకోకుండా వెళ్ళిపోతుంది. ఆ హద్దు దాటి చెయ్యి పట్టుకోవడం లాంటివి మొదలుపెడితే వార్నింగులూ, చెంపదెబ్బలూ మొదలౌతాయి. ముద్దుగా మాట్లాడుతున్న చిన్నపిల్ల అధికప్రసంగం చేస్తూ పెద్దవాళ్ళ కబుర్లు చెప్పారనుకోండి, మనకు చిరాకువేస్తుంది. ఏ విషయానికైనా వో 'లిమిట్' వుంటుంది.

మనలోని మంచి అలవాట్లే శ్రుతి మించితే బలహీనతలుగా మారిపోతాయి. మీ ఆవిడ ఇంటిని చాలా శుభ్రంగా వుంచుతుందని, మీరు చాలా సంతోషిస్తూ వుంటారు. ఆ గుణం మీకు ఎంతగానో నచ్చుతుంది. కానీ, ఆ శుభ్రత అతిగా మారి ఒక వ్యసనంలా ఇరవై నాలుగ్గంటలూ యింటి శుభ్రతకే ప్రాధాన్యతనిస్తే బాగుండదు. అలాగే పిల్లలను 'అతి' శుభ్రతతో పెంచుతూ ఎప్పుడూ కేకలువేస్తుంటే మీ సంతోషం ఆవిరైపోయి విసుగు, చిరాకు చోటు చేసుకుంటాయి.

మీరు ఏ పనయినా పట్టుదలగా చేస్తారు. వో నిర్ణయం తీసుకుంటే తిరుగుండనంత దృఢమైన వ్యక్తిత్వం అనుకోండి. అది మంచిదే. కానీ ఈ అలవాటు మోతాదు ఎక్కువయితే అది మొండితనం, మంకుపట్టు అవుతుంది.

ఈ విధంగా మంచి లక్షణాలు మితిమీరితే చెడు లక్షణాలుగా మార్తాయి.

పిల్లలని పెంచే పెద్దల మనస్తత్వాలు ఎన్ని రకాలో మనం తెలుసుకుంటే, ఏ రకం వ్యక్తులు పిల్లలతో యెలా వ్యవహరిస్తారో, వీటిలో ఏ విధానం మంచిదో, ఎవరి ప్రవర్తనలో లోపాలున్నాయో, ఎలా సవరించుకోవాలో తెలుస్తుంది. ఇన్ని రకాల ప్రవర్తనలలో పెద్దలమైన మనం ఏ వర్గానికి చెందిన వాళ్ళమో నిజాయితీగా ప్రశ్నించుకుని, తెలుసుకొని, ఆ లోపాలను సవరించుకుంటేనే సత్ఫలితం వుంటుంది.

అధ్యాయం - 2

# అంతరంగ మధనం

పిల్లల అంతరంగంలో ఏముందో తెలుసుకోవడం చాలా సులభం. కానీ మనం చేసేదల్లా అలా తెలుసుకోవడానికి కావలసిన ప్రయత్నాలు చెయ్యకపోవడమే వాళ్ళని కొంచెం లాలించో, బుజ్జగించో లేకపోతే వాళ్ళతో సరియైన కమ్యూనికేషన్ ఏర్పరుచుకునో కొంత మాట్లాడగలిగితే వాళ్లు తమ మనసులో భావాలు, పెద్దవాళ్ళకన్నా క్లియర్‌గా నిర్దుష్టంగా చెప్పగలుగుతారు. ఒక్కోసారి వాళ్ళ భావాలు, వింటూ వుంటే మనకే ఆశ్చర్యం కలుగుతుంది.

నిశ్చయంగా ఒక జనరేషన్ కన్నా మరొక జనరేషన్‌లో తెలివి తేటలు, ఐ.క్యూ. అర్థం చేసుకొనే శక్తి పెరుగుతున్నాయి. నలభై సంవత్సరాల క్రితం పదో తరగతి చదివే కుర్రాడికి లెక్కలంటే కూడికలు, తీసివేతలు, భాగాహారాలు, కాలము – దూరము, వడ్డీలు, శాతాలు వగైరా మాత్రమే. కానీ ఇప్పుడు పదో తరగతి వాళ్ళు ఆల్జీబ్రా, కంప్యూటర్స్, ట్రిగ్నోమెట్రీ, స్టాటిస్టిక్స్, లాగరిధమ్స్ వరకూకూడా చదవవలసివస్తోంది. ఈ విధమైన సంక్లిష్టత మనుషుల్లో పెరిగేకొద్దీ పిల్లలకి, పెద్దలకి 'గ్యాప్' పెరిగిపోతోంది. 'పెద్దలు తమకన్నా తెలివైనవాళ్ళు కాదు' అనే భావం కూడా చిన్న పిల్లలలో బాగా పెరుగుతోంది. అన్నిటికన్నా ముఖ్యంగా 'పెద్దలు తమని అర్థం చేసుకోవడం లేదు' అన్న ఫిర్యాదు కూడా వాళ్ళ నుంచి ఎక్కువవుతోంది. నిజమే, పెద్దలెప్పుడూ పిల్లలని అర్థం చేసుకోరు. అలా అర్థం చేసుకోవడం తమ గౌరవానికి భంగంగా పెద్దలు ఫీలవుతుంటారు. కొన్ని రోజుల క్రితం నేనొక మిత్రుడి ఇంటికి డిన్నర్‌కి

వెళ్ళడం సంభవించింది. ఆ మిత్రుడి కూతురు ఇంటర్మీడియెట్ చదువు తోంది. మాటల సందర్భంలో నేనీ పుస్తకం పిల్లలమీద వ్రాస్తున్నానని తెలిసి, ఆ పాపకూడా ఉత్సాహంగా చర్చలో పాల్గొంది. ఆ పాప ఉత్సాహన్ని చూసి నేను 'నువ్వు నీ పెద్దల గురించి ఏమని ఫీలవుతున్నావో రాయి. అది నేను చాలా రహస్యంగా తీసికెళ్తాను' అని చెప్పినప్పుడు ఆ పాప రాసిచ్చిన అభిప్రాయాన్ని యధాతథంగా ప్రచురిస్తున్నాను.

"Most Parents like to think that they are always right and they never admit their mistakes to their children. They hate learning from their children and always snub the children with remarks like 'I knew it' You don't have to teach me' or How dare you correct your father'. The general attitude of most parents is that they feel it demeaning to learn from their children when actually they are supposed to teach them (the children) They think that once children starts correcting them, they are beginning to go out-of-hands and are not giving due respect to them.

Learning is always two ways The parents should realise that by correcting their mistakes and listening to what their children have to say, they can learn a lot in the process and widen their horizons

By snubbing the children too often, after a while parents are unable to communicate well with them. The children became reluctent and generally keep everything to themselves while the communication gap widenzs."

("చాలామంది తల్లిదండ్రులు తాము ఎప్పుడూ రైట్ అని తమ తప్పుల్ని పిల్లల దగ్గర ఒప్పుకోరు. పిల్లలనుంచి ఏమన్నా తాము తెలుసుకోవాలి. తెలుసుకోగలం అన్న అభిప్రాయాన్ని వాళ్ళు అసలు ఒప్పుకోరు. ఏమైనా మాట్లాడితే 'నీకేం తెలీదు', 'నువ్వు నాకేం చెప్పనక్కరలేదు.' 'నాకే చెప్పేటంత గొప్పదానివై పోయావా'—ఇలాంటి చివాట్లతో పిల్లల నోళ్ళు నొక్కేస్తారు. ఒకసారి ఎప్పుడైనా ధైర్యంగా తమ తల్లిదండ్రులు చేసే తప్పులను పిల్లలు సరిదిద్దబోతే, 'పిల్లలు తమ కట్టడినుంచి బైటకి వెళ్ళిపోతున్నారు' అనే భయం తల్లిదండ్రులలో ప్రవేశిస్తుంది.

నేర్చుకోవడమనేది రెండు రకాలుగా వుంటుంది. పిల్లలు చెప్పేది పిల్లలు దృష్టితో ఆలోచించి అందులో ఏదన్నా నిజముందేమో తెలుసుకోవడంద్వారా తల్లిదండ్రుల దృక్పథం విశాలమౌతుంది. రెండో కోణంలో పిల్లలు చెప్పేదాన్నే బలవంతంగా నోరు నొక్కడంవల్ల పిల్లలకీ, తల్లిదండ్రులకీ మధ్య అసలు 'ప్రసారం' అనేదే వుండదు. అటువంటప్పుడు పిల్లలు 'రిలెక్టంట్'గా గాని, 'ఇంట్రావర్ట్'గా గాని మారే ప్రమాదముంది."

* * *

ఒక ఇంటర్మీడియెట్ చదివే పాప ఇంత క్లియర్‌గా తన భావాలని, ఇంత స్పష్టంగా తన అభిప్రాయాలని చెప్పగలగడం విశేషం. కావలసిందల్లా మనం వాళ్ళని అర్థం చేసుకోవడం మాత్రమే. ఇలా తల్లిదండ్రుల నుంచి మానసికంగా దూరమైన దురదృష్టవంతులైన పిల్లలు, ఏ మాత్రం చిన్న ప్రేమాభిమానాలు బయట దొరికినా అటువైపు మొగ్గుతారు. ఇదే ఆడపిల్లయితే యే కుర్రవాడో కాస్త చెయ్యి వూపినా అదే ప్రేమనుకొని, ఆప్యాయతనుకొని ప్రమాదంలో పడే అవకాశం వుంది. ఈ టాపిక్‌ని మరో ఛాప్టర్‌లో చర్చిద్దాం.

పిల్లలు తమ మనసులో ఏమనుకుంటున్నారో, ఆ భావాన్ని మనం

తప్పుగా అర్థం చేసుకోవడమనేది పిల్లల బాల్యం నుండే ప్రారంభమవుతుంది.

ఒక ఏడాదిలోపు పాపని గాలిలోకి ఎగిరేసి పట్టుకొంటే ఆ పాప భయం భయంగా చూసి, పేలవంగా నవ్వుతుంది. ఆ పాప చిరునవ్వుని మనం వేరే విధంగా అర్థం చేసుకుంటాం. పాప ఆనందిస్తున్నదనుకొని మళ్ళీ రెండు మూడుసార్లు గాల్లోకి ఎగరేస్తాం. ఒక ప్రముఖ మానసిక శాస్త్రవేత్త, ఆ సమయంలో ఆ పాప మానసిక స్థితిని ఈ విధంగా విశ్లేషిస్తాడు. మీకన్నా ఆరు రెట్లు పెద్దగా వున్న ఒక రాక్షసుడు మిమ్మల్ని గాల్లోకి రెండడుగుల పైకెగరేసి మళ్ళీ పట్టుకొంటే మీకెంత భయంగా వుంటుందో,సంవత్సరంలోపు పాపని ఆరడుగులు ఎత్తున్న మీద పైకెగరేసి పట్టుకొంటే అలాగే వుంటుంది.

పాప భయాన్ని మనం ఆనందం అని ఎలా అనుకుంటున్నామో, అదే పాప పెద్దయ్యాక మనం చేస్తున్న పనికి ఎదురు చెప్పలేక మనల్ని అసహ్యించుకుంటూ వుంటే, అదే మనం గౌరవం అనుకొని భ్రమపడుతూ వుంటాం.

కొంతమంది తల్లిదండ్రులు పిల్లలని మధ్యలో కూర్చోబెట్టుకొని, యిద్దరూ చెరోవేపు పడుకొని అమ్మ మంచిదా, నాన్న మంచివాడా చెప్పు అని అడుగుతుంటారు. ఆ పాప ఎటూ చెప్పలేక ఇద్దరూ మంచే అంటుంది. అలాక్కాదు, ఎవరెక్కువ మంచో చెప్పు అని ఒత్తిడి చేస్తుంటారు. ఈ విధంగా అడగటంవల్ల పాపకి ఒక విధమైన వేర్పాటు ధోరణిని అలవాటు చేస్తున్నారన్నమాట. తమ తల్లిదండ్రులు యిద్దరూ అవతలి వ్యక్తికన్నా తను 'మంచి' అనిపించుకోవాలనే స్వార్థంతో వున్నారనే విషయం ఆ పాప తెలుసుకునేలా చేస్తున్నాం. ఇదంతా మనం నవ్వులాటగా అనుకున్నా, చిన్న పిల్లల మనసుల్లో మాత్రం చాలా బలంగా నాటుకుపోతుంది. కొంతమంది తల్లిదండ్రులు పాపల ముందు బ్రేక్‌డాన్స్ చేయడం, ఎవరైనా బంధువు

లొచ్చినపుడు మా అబ్బాయి బ్రేక్‌డాన్స్ బాగా చేస్తాడని చెప్పడం, వాళ్ళ ముందు డాన్స్‌చేసి చూపించమని బలంగా వత్తిడి చేయడం, ఆ కుర్రవాడు చెయ్యలేకపోతే సదరు బంధువులు వెళ్ళిపోయిన తర్వాత చివాట్లు పెట్టడం చేస్తారు. ఇవన్నీ పిల్లవాడిని మానసికంగా వత్తిడిపెట్టే సంఘటనలు. పిల్లల ముందు తల్లిదండ్రులు బ్రేక్‌డాన్స్ చేస్తుంటే, అప్పుడు పిల్లలుకూడా ఆ వయసు ఉషారులో ఆనందించవచ్చేమో గాని, వాళ్ళే పెద్దవాళ్ళయ్యాక ఒకప్పుడు తన తండ్రి తన ముందు బ్రేక్‌డాన్స్ చేసే విధానాన్ని, సంగతిని గుర్తుగా వుంచుకొని, తల్లిపట్ల గాని, తండ్రిపట్లగాని గౌరవాన్ని కోల్పోయే ప్రమాదముంది. కాబట్టి ప్రస్తుత పరిస్థితిలో తను చేసే బ్రేక్‌డాన్స్‌ని ఎలా ఆనందిస్తున్నాడా అనేదానికన్నా, భవిష్యత్‌లో దీని పరిమాణం పిల్లలపట్ల ఎలా వుంటుందనేది తల్లిదండ్రులు గుర్తుంచుకోవలసి వుంటుంది.

ఇంకొంతమంది-ఏ స్నేహితులు ఇంటికొచ్చినా పిల్లలని "రైమ్స్ చెప్పు, రైమ్స్ చెప్పు" అని బలవంతం చేస్తూ వుంటారు. ఇది వినేవాళ్ళకి ఎంత బోర్‌గా వుంటుందో, చిన్నపిల్లలకి కూడా ఒక యాంత్రికత్వాన్ని అలవాటు చేస్తుంది. 'మా పిల్లలు బాగా అల్లరి చేస్తారు' అని చెప్పుకోవడం కూడా కొందరి ఫ్యాషన్. ఇంతకన్నా దారుణమైన విషయం ఏంటంటే, చిన్నపిల్లవాడు ఏం చేసినా అదో గొప్ప విషయంగా బయటవాళ్ళకి చెప్పుకోవడం చాలామందికి అలవాటు. ఉదాహరణకి ఒక మూడేళ్ళ కుర్రవాడు బాత్‌రూమ్‌లో పైప్‌నుంచి వాటర్ పడుతుంటే, తనకై తానుగా వెళ్ళికట్టేస్తే మావాడు చాలా పొదుపరి, బాత్‌రూమ్‌లో నీళ్ళుపడుతున్నా కూడా తనకు తనే వెళ్ళి కట్టేస్తాడు అని అదేదో గొప్ప విషయంలాగ బయటవాళ్ళకి చెబుతుంటారు. పొగడ్త అవసరమేగాని, అది అనవసరమైన పొగడ్త ఐతే పిల్లల్లో ఆత్మవిశ్వాసానికి బదులు అహంభావాన్ని కలుగజేస్తుంది.

ఆమె అత్తగారి గురించి (అంటే తన నాయనమ్మ గురించి) పని మనిషితో తన తల్లి చర్చించడం కొడుకువింటే, తమ మధ్యవున్న సున్నిత మైన బంధాన్ని స్వయానా తన తల్లే బయట చెప్పతూన్నట్లు భావిస్తాడు. ఇలాంటి విషయాలు మనకెంతో చిన్నవిగా కనబడినా పిల్లల మనస్తత్వం దృష్ట్యా ఆలోచిస్తే అవి పెద్ద పరిణామాన్ని ఏర్పరుస్తాయి. చాలామంది తల్లులు ఇంట్లో వంట చేసేటప్పుడు రేడియోలో పాటొస్తూ వుంటే కొందరు గొంతు బాగా హెచ్చించి ఆ పాటతో కలిపి పాడుతుంటారు. పిల్లలకి సుతారాము ఇటువంటివి యిష్టముండవు. తమ తల్లి ఒక తల్లిలా వుండాలని కోరుకుంటారే తప్ప, చౌకబారు సినిమా పాటలు పాడుకుంటూ ఇల్లంతా తిరగడం వారికిష్టముండదు.

అలాగే పిల్లలు తమ తల్లిదండ్రుల్ని 'హీ-మాన్'గా ఊహిస్తారు. ఈ పిల్లలు పెద్ద అయిన తర్వాత కూడా అదే 'హీ-మాన్' స్థానంలో తండ్రి వుండటాన్ని ఆశిస్తారు. నాకు తెలిసిన ఒక ఉదాహరణలో ఒక 22 ఏళ్ళ అమ్మాయి సిటీబస్‌లో వెళుతూ వుండగా ఒక అబ్బాయి ఆ అమ్మాయి నడుంమీద చెయ్యివేసి చిన్నగా గిల్లాడుట. ఆ అమ్మాయి బస్ ఆపుచేసి పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి ఆ అబ్బాయి మీద రిపోర్టిచ్చింది. ఆ కుర్రవాడిని పోలీసులు ఇంటరాగేట్ చేస్తున్న సమయంలో, ఆ అమ్మాయి యింటికి ఫోన్ చేసింది. తండ్రివచ్చి ఆ అమ్మాయిని అభినందించి తీసుకువెళ్ళాడు. చూడ్డానికి యిది చాలా చిన్న విషయంలాగే కనిపించవచ్చుగానీ, చాలామంది తండ్రులు ఈ విధంగా ప్రవర్తించరు. "ఇదంతా మనకెందుకు....ఏదో చూసీ చూడనట్లు పోతే సరిగదా...." అని తమ చేతకానితనాన్ని సమర్థించుకుంటారు. ఇటువంటి తండ్రుల్ని, కూతుళ్ళూ కొడుకులూ నిజమైన తండ్రులుగా గుర్తించలేరు.

చాలామంది పిల్లలకి తమ తండ్రులు తల్లులమీద అజమాయిషీ చేస్తూండటంకానీ, కత్తిపీట ముందేసుకునో, మూకుళ్ళో ముక్కలు కలు

వుతూ పైపై పంటలు చేయటంగానీ యిష్టముండదు. దాన్ని వాళ్లు 'ఫెమి నైన్‌గా' వున్నట్లు భావిస్తారు. అలాగని ఏ పనీ చెయ్యకుండా వున్నా, తండ్రుల్ని క్షమించలేరు. ఎలక్ట్రిసిటీ రిపేర్స్, విరిగిన సామాన్లని అతికించడం, పైపులు బాగుచెయ్యడం-ఇలాంటివన్నీ తమ తండ్రులు చేయవలసిన పనులుగా పిల్లలు గుర్తిస్తారు.

కూతుర్లని తండ్రులు వెనకేసుకురావడం, తల్లులు తిట్టడం; అలాగే తప్పు చేసినప్పుడు కొడుకులని తల్లులు వెనకేసుకురావడం, తండ్రులు తిట్టడం మంచి పద్ధతి. ఎప్పుడేనా చిన్నపిల్లలు ఏదేనా తప్పుచేస్తే ఒకరు వారి పక్షాన, మరొకరు వారికి వ్యతిరేకంగానూ వాదించి, చివరికి తప్పుచేసిన వారి పక్షాన వాదించినవారు ఓడిపోయినట్లుగా చూపిస్తే, పిల్లలు తమకు న్యాయం జరిగినట్టుగా భావిస్తారు. అంతేగాని, చిన్నపిల్లలేదైనా తప్పుచేస్తే తల్లిదండ్రులిద్దరూ 'కలిసి' తిట్టడం ప్రారంభిస్తే తాము ఒక్కరూ ఒకవైపున్నట్లూ, తల్లిదండ్రులిద్దరూ మరో వైపున్నట్టు వారు అనుకొనే ప్రమాదం వుంది. ముందే చెప్పినట్లు ఈ విషయాలన్నీ పైకి చిన్నవిగానే కనబడ్డా పిల్లల మనసులమీద పెద్ద ప్రభావాన్ని చూపిస్తాయి.

చిత్రం ఏంటంటే పిల్లలు తమతండ్రులని హీరోగా ఊహించుకోరు. హీరో అంటే నా ఉద్దేశ్యం చిరంజీవి, బాలకృష్ణ చివరికి నాగేశ్వరరావు— ఆ పద్ధతిలో ఊహించుకోవడానికి ఇష్టపడరు. ఒక సంజీవ్‌కుమార్ లేక శరత్‌బాబు-అలా డిగ్నిఫైడ్‌గా వుండాలని కోరుకుంటారు. ఎప్పుడైతే తల్లిదండ్రులు వాళ్ళ పిల్లల ముందు కొంచెం లేకిగా ప్రవర్తించడం ప్రారంభిస్తారో, అప్పుడు వాళ్ళమీద గౌరవం తగ్గడం ప్రారంభమౌతుంది. గట్టిగా నవ్వడం, తల్లులు లిప్‌స్టిక్ వేసుకోవడం, స్లీవ్‌లెస్ జాకెట్లు వేసుకొని బజార్లలో తిరగటం- ఇవన్నీ పిల్లలకు అంతగా రుచించవు. ఈ విషయాలన్నీ వారు బైటికి చెప్పకపోవచ్చుగాని, మనసులో ఆ ఫీలింగ్ మాత్రం కలుగుతూనే వుంటుంది. అదే విధంగా ఒక పన్నెండేళ్ళ కొడుకు

గానీ, కూతురుగానీ తల్లితో కలిసి 'మార్నింగ్‌షో'కి వెళ్ళినప్పుడు, చుట్టూ వున్న యువకులు తల్లివైపు చూస్తూ కామెంట్ చెయ్యటాన్ని కూడా సహించలేరు. అందుకే ఒక వయసొచ్చాక పిల్లలు తమ తల్లులతో ఒంటరిగా బైట తిరగడాన్ని ఇష్టపడరు. అదే విధంగా తమ తండ్రులతో కలిసి వెళ్ళినపుడు, తండ్రి పరాయి స్త్రీల వంక ఆశగాగాని, ఓరగాగాని, కాంక్షగా గాని చూడడాన్ని పిల్లలు గమనిస్తూనే వుంటారు. ఇది వారికి ఏమాత్రం నచ్చని విషయం. తండ్రి పనిమనిషితో మాట్లాడడంగాని, పక్కింటి ఆడ వాళ్ళతో కాలక్షేపంగా కబుర్లు చెప్పడంగాని పిల్లలు గమనించినా వారి మనసు బాధపడుతూ వుంటుంది. అందువల్ల నిజ జీవితంలో ఎంత లేకిగా ప్రవర్తించినా, తల్లిదండ్రులు కనీసం పిల్లలముందు ఒక బాధ్యతాయుతమైన, గౌరవప్రదమైన వ్యక్తిగా వుండడం తప్పనిసరి.

## నేర్చుకోవడం :

తల్లి గర్భం నుంచి బైటపడ్డ పిల్లవాడు మొట్టమొదటిసారి పాలు తాగుతాడు. ఏ గురువూ చెప్పని ప్రథమ విద్య ఇది. శ్వాసకోసం బంధింప జేసి నోటి ద్వారా గాలి పీల్చడం అనే ప్రక్రియ పాలు త్రాగడానికి ఉప యోగపడుతుంది. ప్రకృతి గురువై బోధిస్తుంది.

నాలుక్కాళ్ళమీద జంతువులా ప్రాకే పిల్లవాడు తనచుట్టూ వున్న మనుషులను చూసి రెండు కాళ్ళమీద నిలబడడానికి ప్రయత్నిస్తాడు. తనకి ఆకర్షణీయమైన వస్తువుల పట్ల తొందరగా ప్రభావితుడవుతాడు. అందుకే పెద్దవాళ్లు ఎత్తుకున్నప్పుడు జేబులో కలం తీస్తాడు. అన్నప్రాశన రోజున పిల్లవాడు బంగారు వస్తువు పట్టుకొంటే 'మా బాబు కోటీశ్వరుడౌతాడని, సంబరపడిపోతారు తల్లిదండ్రులు. అక్కడున్న వస్తువులలో కెల్లా బంగారం, పొదిగిన రాళ్ళు మెరుస్తూ వుంటాయి. కాబట్టి దానిపట్ల ఆకర్షితుడవ డంలో అసహజం ఏమీలేదు. మీ పిల్లవాడు పుస్తకం పట్టుకొని మేధావి

అవాలనుకుంటే, దానికి ఎర్ర అట్ట వేయండి. పెద్ద 'గూండా'అయి తర్వాత రాజకీయనాయకుడు అవదల్చుకుంటే, బొమ్మకత్తికి ఎర్రరంగు పూయండి.

మనం మన ఇష్టంవచ్చిన మార్గంలో పిల్లవాడి బాల్యాన్ని నిర్దేశించవచ్చు అనే దానికి ఇది మంచి ఉదాహరణ. మీ పిల్లవాడు ఒక మంచి వైలన్ విద్వాంసుడు అవ్వాలని మీకుంటే రెండో సంవత్సరం నుంచే వాడి చుట్టూ ఆ వాతావరణాన్ని కల్పించండి. (పుస్తకానికి ఎర్ర అట్ట వెయ్యడం లాటిదన్నమాట) తెలిసీ తెలియని వయస్సులో, వాడిచుట్టూ, తల్లిదండ్రుల మధ్య పోట్లాటలు, చిరాకులు, వైతరణీనది అవతలివైపు వాతావరణం వుంటే వాడి లేలేతప్రాయపు సున్నిత హృదయం ఆ వయసులోనే రాటుదేలి జీవితంపట్ల నమ్మకాన్ని పోగొట్టుకుంటాడు. (కత్తికి ఎర్రరంగు పూయడం అన్నమాట.)

2-12 ఏళ్ళ మధ్య మెదడు సస్యశ్యామల క్షేత్రంలా సారవంతంగా వుంటుంది. ఏ విత్తనం వేస్తే అదే మహావృక్షమౌతుంది. మంచి విత్తనాలను ఎన్నుకోవలసిన బాధ్యత తల్లిదండ్రులదే.

**మాట్లాడడం :**

తల్లిదండ్రులతో సహా పెద్దవాళ్ళేమీ నేర్పకపోయినా పిల్లలు ఏదో ఒకటి మాట్లాడదామనే తాపత్రయంలో వుంటారు. చాలామంది పెద్దవాళ్ళు పిల్లలతో మాట్లాడేటప్పుడు పిల్లలలాగ మాట్లాడాలని ప్రయత్నిస్తూ వుంటారు. ఇది హాస్యాస్పదంగా వుంటుంది.

అప్పుడే ఈ ప్రపంచంలోకి వచ్చిన బిడ్డకూడా స్వభావసిద్ధంగా పాలు తాగడం నేర్చుకున్నట్లే, కొంత వయసొచ్చేసరికి మాటలు, భావాలని 'ఎక్స్‌ప్రెస్' చెయ్యడం అనేవి పిల్లలకి తెలుస్తూ వుంటాయి. పెదిమలు, నాలుక, పళ్ళు, బుగ్గలు, అంగుడు వీటన్నిటి మధ్య సంఘీభావం స్వభావసిద్ధంగానే కలుగుతుంది.

ఒక వ్యక్తి తను వున్న ప్రదేశం నుంచి వేరే రాష్ట్రానికి వెళ్ళి,

వేరే భాష మాట్లాడవలసి వచ్చినప్పుడు ఎంత కష్టపడతాడో, అలాగే కొత్తగా భాష నేర్చుకోడానికి పసిపిల్లవాడు కూడా అంతే కష్టపడతాడు. దాన్ని సులభతరం చెయ్యడానికి తల్లిదండ్రులు ప్రయత్నిస్తూ వుండాలి. పిల్లలలో నేర్చుకోవాలనే ఆసక్తి ఎక్కువ వున్నప్పుడే వాళ్ళకి ఆ యా విషయాలు నేర్పడం చాలా మంచిది. కొంతమంది తల్లులు, పిల్లలు ఎనిమిదో క్లాసు చదువుతున్నా వాళ్ళే సాక్స్ తొడగడం, షూ వెయ్యడం లాంటివి చేస్తూ వుంటారు. ఈ విధంగా పిల్లల్ని తమమీద ఆధారపడేలాచేసుకోవడం ద్వారా వాళ్ళొక విధమైన గర్వాన్ని పొందుతూ వుంటారు పిల్లవాడు తమ మీద ఆధారపడుతున్నాడు అనే భావాన్ని తల్లిదండ్రులు ఎంత తొందరగా వదులుకొంటే అంత తొందరగా పిల్లలు తమ స్వయంప్రతిపత్తిని ఆపాదించుకుంటారు. 'నేను లేకపోతే మావాడొక్క పనీ చేసుకోలేడండీ' అని గర్వంగా చెప్పుకొనే తల్లులున్నారు. అంటే ఆ తల్లి ఇండైరెక్టుగా తన కొడుకుని ఒక నిర్వీర్యుణ్ణిగా తయారుచేస్తోందన్నమాట. పది, పన్నెండేళ్ళ వయసులో పిల్లలని ఓ పదిరోజులపాటు దూరంగా వుంచటంద్వారా కూడా తల్లిదండ్రులు అతని యొక్క వ్యక్తిత్వం బయటి ప్రపంచంలో తెలుసుకొనేలా చెయ్యడానికి దోహదపడుతుంది.

టూరిజం :

పిల్లల్ని ఎంత చిన్నవయసులో వీలైతే అంత చిన్న వయసులో యింటినుంచి ఎక్స్కర్షన్స్ రూపేణా, టూర్స్ రూపేణా బయటకి పంపించడమనేది చాలా ఆశ్చర్యకరమైన విషయం. తల్లిదండ్రులనుంచి దూరంగా వుండటంవల్ల వాళ్ళకి తల్లిదండ్రుల యొక్క విలువ తెలిసే అవకాశం వుంది. అదీకాక, కొత్త పరిస్థితుల్లో కొత్త వ్యక్తులతో ఎలా మెలగాలనేది కూడా పిల్లలకి అలవాటవుతుంది. ప్రతి ఏడాదీ వేసవి శలవుల్లో పిల్లల్ని తాతయ్య ఇంటికో, నాయనమ్మ ఇంటికో పంపించడం కాకుండా, ఏదేనా దూరప్రాంతాలకి పంపినట్లయితే, ఆ ప్రాంతాల సంస్కృతి, భాషా, పరిస్థి

తులు అన్నీ అవగతమౌతాయి. ఏదేనా కష్టమొచ్చినప్పుడు తమ కాళ్ళమీద తాము నిలబడి స్వంత నిర్ణయాలద్వారా ఆ కష్టాన్ని అధిగమించడం యెలా అనే విషయం కూడా తెలుస్తుంది. ఇది ఎంతో ముఖ్యమైన విషయమైనా చాలామంది తల్లిదండ్రులు దీన్ని గుర్తించరు. పిల్లవాణ్ని వదిలేస్తే వాడెక్కడ తప్పిపోతాడో, లేకపోతే తిరిగి రాడేమో అన్న భయాలు చాలా వుంటాయి. ముందు తల్లిదండ్రులు తమ భయాల్ని అధిగమించాలి. నేను సినిమాల్లో స్క్రీన్‌ప్లే వ్రాసే రోజుల్లో తమిళం నేర్చుకుందామని పుస్తకాలు కొనుక్కొని మూడు నెలలు కష్టపడ్డాను. నాకేమీ రాలేదు కానీ, మద్రాస్‌లో రెండు నెలలు వుండవలసి వచ్చినపుడు, అక్కడ నా సహమిత్రులతోనైతే నేమి, అక్కడున్న వ్యక్తులతో అయితేనేమి తప్పనిసరిగా తమిళంలో మాట్లాడవలసిన అవసరం వచ్చింది, ఆ అవసరమే నాకు కొద్దిగా తమిళాన్ని నేర్పింది.

ఎప్పుడైనాసరే మనిషికి అవసరంకన్నా మించిన గురువేమీ లేదు. నా పదిహేడేళ్ళ వయసులో, కాకినాడ పి. ఆర్. కాలేజీలో చదువుతూ వున్నప్పుడు నేను కన్యాకుమారినుంచి కాశ్మీర్ వరకూ టూర్ వెళ్ళేను. ఒక స్పెషల్ ట్రెయిన్‌లో ఆంధ్రప్రదేశ్‌కి సంబంధించిన మూడు వందల మంది విద్యార్థులతో కలిసి అలా టూర్ వెళ్ళడం నా జీవితంలో అది గొప్ప ముఖ్యమైన సంఘటన. అది నామీద నాకు నమ్మకాన్ని పెంచింది. అక్కడ మనని టైమ్ ఆయ్యేసరికి భోజనానికి ఎవరూ పిలవరు. నువ్వు వెంటనే స్నానం చెయ్యి లేకపోతే నీళ్ళుండవు అని ఎవ్వరూ హెచ్చరించరు. జేబులో డబ్బులేమో చాల తక్కువగా వుంటాయి. చుట్టూ వున్న పరిస్థితులు మాకేమాత్రం సంబంధం లేనివి, అర్థం కానివి. ఇటువంటి పరిస్థితుల్లో మా అవసరాలు మేము పూర్తిచేసుకుంటూ, ప్రయాణం సాగించడం నాలో ఒక చారిత్రాత్మకమైన వ్యక్తిత్వపు మార్పుకి దోహదపడింది. ఇల్లూ, స్కూలు, మళ్ళీ ఇల్లూ అనే కాకుండా యీ విధంగా

తోటి వ్యక్తులతో కలిసి ప్రయాణం చేస్తుంటే మిగతా ప్రయాణీకుల వ్యక్తిత్వం వాళ్ళ ఊహలు, భావాలు అన్నీ తెలుసుకొనే అవకాశం కూడా చిన్నపిల్లలకి లభిస్తుంది.

ఒక పిల్లవాడు సంపూర్ణమైన వ్యక్తిత్వం సంపాదించుకోవాలంటే తల్లిదండ్రులు అతనిపట్ల తమకున్న ప్రేమని కొంచెం తగ్గించుకోవలసి వుంటుంది. అలాగే అతడు తనమీద ఆధారపడడాన్ని కూడా తగ్గించుకునేలా చేయవలసి వుంటుంది. అయితే, మరికొన్ని పెద్ద యిళ్ళలో క్రమశిక్షణ పేరుతో ఆ పిల్లల్ని గిరిగీసి అందులో వుంచుతారు. అతనికొక సపరేట్ గది, విడిగా ఒక బాత్రూమ్ యిలా అన్నీ విడివిడిగా కేటాయిస్తారు. కేవలం భోజనం చేసే సమయంలోనో, రాత్రిపూట టీ. వీ. చూసే టైమ్‌లోనో మాత్రమే కుటుంబ సభ్యులందరూ కలుసుకుంటారు. ఈవిధంగా చెయ్యడం వలన అతడు ప్రేమరాహిత్యంలోకి దిగవచ్చు. ఇలాంటి విపరీత ధోరణి కూడా అనుసరణీయం కాదు.

స్కూల్ :

పిల్లల స్వాతంత్ర్యంమీద సరియైన అవగాహనలేని స్కూల్‌టీచర్ చాలా దారుణంగా ప్రవర్తిస్తూ వుంటాడు. ఖాళీగా పీరియడ్స్ వున్న టైమ్‌లో నోటిమీద వేలువేసుకొని కూచోమనడం, పదే-పదే 'సైలెన్స్', 'సైలెన్స్' అని అరవడం యివన్నీ మానసికంగా పిల్లల్ని దెబ్బతీసి వాళ్ళని 'ఇంట్రావర్ట్స్'ని చేస్తాయి. పిల్లలని తరచూ కొట్టడం ద్వారా వాళ్ళలోని సున్నితత్వాన్ని టీచర్లు చంపేస్తూ వుంటారు. ఒక దెబ్బకన్నా, ఒక మాటద్వారా పిల్లలని మార్చడం చాలా సులభం. పిల్లల్లో లేని 'కులం' అనే భావాన్ని కొంతమంది టీచర్లే ఎత్తిచూపడం శోచనీయం. ఇదే విధంగా డబ్బున్న పిల్లల్ని ఒకలాగ, డబ్బులేని పిల్లల్ని ఒకలాగ చూడటం కూడా మంచిది కాదు. తమ స్కూల్‌నుంచి ఎక్కువమంది పాసవాలన్న ఉద్దేశ్యంతో పరీక్షలలో తామే పుస్తకాలు అందజెయ్యడం, కాపీకొట్టినా చూసీ-చూడనట్లు

ఊరుకోవడం-ఇవన్నీ పిల్లల్లో సమాజంపట్ల ఒక అగౌరవమైన భావం రావడానికి తోడ్పడతాయి. అందరూ చెడు చేస్తున్నారు, చెడుగా వుంటేనే జీవితంలో పైకి రాగలం అనే భావం పిల్లల మనసులో రాకుండా చెయ్యడానికి టీచర్లే చాలా కష్టపడవలసి వుంటుంది.

దురదృష్టవశాత్తూ మన సమాజంలో స్కూల్స్ కేవలం చదువు మాత్రమే బోధిస్తున్నాయి. బిహేవియర్ సైన్స్, మనిషి ప్రవర్తన, అతనిలో వుండే బలహీనతలు పోయేలా చెయ్యటం—అలాంటి పనులేవీ చేపట్టవు. ఉదాహరణకి ఒక కుర్రవాడు విపరీతమైన ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడుతూ వుంటే, ఆ బాధని పోగొట్టడానికి ఏ విధమయిన ప్రయత్నం చెయ్యరు. వారి బాధ్యతల్లా ఆ సంవత్సరం సిలబస్‌ని పూర్తిచెయ్యడం మాత్రమే. అందుకని తల్లిదండ్రులు పిల్లలని కేవలం స్కూల్‌కి పంపడంతోనే తమ బాధ్యత తీరిపోయిందనుకోకుండా, వారిలో నిబిడీకృతమై వున్న బలహీనతలను గుర్తించి, వాటిని పారద్రోలే ప్రయత్నం చెయ్యాలి.

మంచి పాఠకుడయితే, రచయిత వాక్యాన్ని, సొగసుని, పదాల గారడీని అర్థం చేసుకొని ఆస్వాదించగలడు. రచయిత చెప్పే భావాన్ని అర్థం చేసుకొని, తన మెదడుపొరల్లో నిక్షిప్తం చేసుకోగలడు. అలాగే మంచి పాఠకుడు కానివాడు రచయిత ఎంతగొప్పగా రాసిన పుస్తకాన్నైనా సరే యథాలాపంగానే చదువుతాడు. ఈ టైమ్‌పాస్‌కు చదివే చదువు మనసుకీ, మెదడుకీ ఎక్కదు. ఒకవేళ మనసుకి ఎక్కినా అది కేవలం రసానుభూతిని మాత్రమే కలిగిస్తుంది. అదే విధంగా విద్యార్థులు చిన్న వయసులో స్కూలు పుస్తకాలని కేవలం బట్టీపట్టడం ద్వారా ఏమీ సాధించలేరు. దానివలన ప్రయోజనం వుండదు కూడా. ముఖ్యంగా లెక్కలు, ఫిజిక్స్ మొదలగు సబ్జక్ట్స్‌లో తక్కువ మార్కులు వచ్చేవారు ఈ కోవకు చెందుతారు. వారు ఒక లెక్క ఆన్సర్ సంపాదించడానికి దానిని ఏవైపు నుండి ఎదుర్కోవాలా అని ఆలోచించటం చెయ్యలేరు. ఈ బట్టీపట్టడం

అనేవి చిన్న చిన్న క్లాసులలో సాధ్యమవుతుందేమోగాని, గ్రాడ్యుయేషన్ స్థాయికొచ్చేసరికి సబ్జక్టు చాలా విస్తృతంగా వుండటంవల్ల, అప్పటికి వయసు పెరిగి మెదడుయొక్క 'స్టోర్' చేసుకునే శక్తి తగ్గిపోవడం వల్ల చాలా యిబ్బందులకు గురవుతారు. పెద్ద పాఠాన్ని, పాఠ్యాంశాన్ని గుర్తు పెట్టుకోవలసి వచ్చినపుడు, దాన్ని ముక్కలు ముక్కలుగా చేసి ఒక ఆర్డర్‌లో పేర్చుకొని, కేవలం పాయింట్స్ మాత్రమే గుర్తు పెట్టుకొని పరీక్ష హాల్లో వాటిని విశ్లేషించి రాయటం అన్నది అన్నింటికన్నా ఉత్తమమైన పద్ధతి. ఇలా చిన్న చిన్న పాయింట్లుగా గుర్తుంచుకోవటం వల్ల, అది మన జీవితకాలం మొత్తం గుర్తుండే అవకాశముంటుంది.

ఎప్పుడైనా సరే ఒక మనిషి తన నిజజీవితంలో పైకి రావాలంటే, తర్కం చాలా అవసరం. ఈ సత్యాన్ని లెక్కలు, ఫిజిక్స్ బోధిస్తాయి. ఉదాహరణకి బోటనీ, జువాలజీ చదివిన అమ్మాయి, తర్వాత బ్యాంక్‌లో క్యాషియర్ అయి అకౌంట్స్ రాస్తుంది. 18–20 ఏళ్ళ మధ్యలో సైన్సు చదువుతున్న అమ్మాయిలనీ, అబ్బాయిలనీ పరిశీలించినట్లయితే ఆకుల్ని స్వీకరిస్తూ రేదా కప్పలని కోస్తూ బి.ఎస్సీ. పూర్తిచేస్తారు. నిజ జీవితంలో చాలామందికి అవి ఏ విధంగానూ ఉపయోగపడవు. చెక్కుకి, డ్రాఫ్ట్‌కి తేడా తెలియని గ్రాడ్యుయేట్లూ, ఎలక్ట్రిసిటీ బిల్లు ఎలా కట్టాలో తెలియని విద్యార్థినీ, విద్యార్థులూ పదిమంది ముందు మాట్లాడవలసివస్తే తడబడే కుర్రవాళ్ళు మనకి చాలాచోట్ల కనిపిస్తూ వుంటారు. స్కూల్‌లో చెప్పని ఇటువంటి విషయాలన్నీ తల్లిదండ్రులకే బాధ్యతగా నేర్పాల్సి వుంటుంది.

చాలామంది తండ్రులు అసలు పిల్లలు ఏం చదువుతున్నారనేది పట్టించుకోరు. రాత్రెప్పుడో పది గంటలకి ఇంటికొచ్చి పడుకోవడం, పొద్దున్న ఆఫీస్‌కి వెళ్ళటం, మళ్ళీ సాయంత్రం క్లబ్‌కి వెళ్ళడం వీళ్ళ దినచర్య. తల్లులుకూడా ఏ ఆరోతరగతివరకో, ఎనిమిదో తరగతివరకో శ్రద్ధగా చదివించి, ఆ తర్వాత ఓపిక లేక విడిచి పెట్టేస్తారు. సరిగ్గా ఈ

వయసులో పిల్లలు, ఒక్కసారి ఇంటిపరిధినుంచి బయటపడి తిరగడమే స్వేచ్ఛ అనుకొనే మనస్తత్వంలో వుంటారు. అప్పటినుండి చదువుమీద వారికి ఇంట్రెస్టు తగ్గిపోతుంది. పిల్లల చదువు బాధ్యతలో తండ్రులే ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి. కనీసం నాలుగురోజుల కొకసారైనా పిల్లలని దగ్గిర కూర్చోబెట్టుకుని, ఆ నాలుగురోజులు ఏం చదివారో ప్రశ్నలు వేస్తే అతను ఒక విధమైన భయం తో చదువుపట్ల శ్రద్ధ చూపుతాడు. ఎలక్యూషన్ కాంపిటీషన్స్, వ్యాసరచన పోటీలు మొదలగునవి పిల్లల్లో వుండే అంతర్గత భయాన్ని పోగొడ్తాయి. టీచర్లు పిల్లలని యిటువంటి పోటీలలో ఎవరికి ఇంట్రెస్టు అయితే వారు పేర్లివ్వండి అనకుండా కనీసం మిగతా పిల్లలకి వేదిక మీదకొచ్చి రెండు మూడు నిముషాలు మాట్లాడే అవకాశం కల్పించాలి.

చిన్న పిల్లలకి గ్రూప్ డిస్కషన్స్ ఏర్పరచటం ద్వారా కూడా వాళ్ళలో వుండే కాంప్లెక్స్‌ని పోగొట్టవచ్చు. చాలామంది వ్యక్తుల్ని మనం గమనించినట్లయితే, వాళ్ళు 30 ఏళ్ళు గడిచినా కూడా తమ మనసులో వున్న భావాన్ని నిర్భయంగా అవతలివాళ్ళకి అర్ధం అయే రీతిలో చెప్ప లేరు. ఇలాంటి కాంప్లెక్స్‌లు వుండడానికి కారణం, చిన్నపిల్లలుగా వున్న ప్పుడు వాళ్ళకి ఉత్తమమైన శిక్షణ లేకపోవడమే.

## పిల్లల వైపునుంచి ఆలోచించటం :

పిల్లలు ఏమైనా పదాలు బాగా మాట్లాడకపోతే వాటిని సరిదిద్దవచ్చు తప్ప, భావాలు సరిగ్గా లేకపోతే వాటిని వెంటనే సరిదిద్దకుండా వారివైపు నుంచి ఆలోచించి, అవి కరెక్ట్ అయినవో కావో మనం నిర్ణయించు కోవాలి.

మనం ఎప్పుడేనా పేక ముక్కలతో పిల్లలదగ్గర మేడకట్టి చూపిస్తే ఆ పాప దగ్గరకొచ్చి ఆ మేడను కూల్చి మీవైపు చూసి నవ్వుతుంది. మళ్ళీ మీరు మేడ కట్టినా ఆ పాప తిరిగి దానిని కూలగొడుతుంది. అంటే మీకు

మేడ కట్టటంలో వున్న ఆనందం ఆ పాపకి చిన్నాభిన్నం చెయ్యటంలో వుంది. ఈ విధంగా చిన్న పిల్లలలో మన యొక్క భావాన్ని తొందరగా స్వీకరించకపోవడం అనే గుణం వుంటుంది. పిల్లల మనస్తత్వ శాస్త్రవేత్తలు చెప్తున్న ప్రకారం, చిన్నపిల్లలు ఏ పనైనా తాము చెయ్యగలం అనుకుంటారు. కానీ వయసు పెరిగేకొద్దీ తాము తెలుసుకున్నది చాలా తక్కువ అని తెలుసుకుంటారు. అయితే కొంతమంది వయసు పెరిగినాకూడా, ఏ పనైనా తాము చేయగలం అనే (భ్రమ) మానసిక స్థాయిలోనే వుంటారు. తమ అభిప్రాయం తప్పని, తమకన్నా తెలిసిన వాళ్ళుంటారనే జీవిత సత్యాలని తెలుసుకోవడానికి ఒక మనిషికి చాలా. ఉన్నతమైన మానసిక స్థాయి వుండాలి. తాము చేసింది చాలా కరెక్ట్ అని మనుషులు అనుకోడానికి ఒక మంచి ఉదాహరణ మా రైటర్స్ వర్క్‌షాప్.

వర్ధమాన రచయిత (త్రి) లలో సృజనాత్మకశక్తిని పెంపొందించి, వారిని రచయితలుగా తీర్చిదిద్దుదామని మే మొక వర్క్‌షాప్ పెట్టాం. అక్కడకొచ్చిన చాలామంది కుర్రవాళ్ళు, అమ్మాయిలు తాము వ్రాసింది మాకు చూపిస్తే దాన్ని మేము మెచ్చుకుంటే సరేసరి........ఒకవేళ దాన్ని మేము దిద్దితే....మేమేదో పెద్ద పొరపాటు చేశామని మావైపు జాలిగానో, కోపంగానో చూస్తూ వుంటారు. వాళ్ళు రాసింది పత్రికల స్థాయిలో లేదని గాని లేదా వాళ్ళ భావాలని పాఠకులు అర్థం చేసుకోలేరనిగాని మేం చెప్తే వాళ్ళ స్థాయికి మేము ఎదగలేదన్నట్లుగా భావిస్తారు.

ఈ విధంగా తమ మీద తమకి ఎక్కువ నమ్మకం వుండటం అనేది చిన్న పిల్లలలో చాలా ఎక్కువగా కనపడుతుంది. మనం ఆ నమ్మకానికి ఎటువంటి దెబ్బకొట్టకుండా వాళ్ళని సరియైన పంథాలోకి మార్చుకోవలసి వుంటుంది. అలాకాకుండా అసలు మీకేమీ చేతకాదు. మీరేమీ రాయలేరు అని మేం అంటే ఇక ఆ వర్క్‌షాపుకి వాళ్ళు రావటం మానేస్తారు. అలాగే చిన్నపిల్లలకి కూడా నీకేం చేతకాదు, నువ్వు చేస్తున్నది తప్పు

అని తరచూ అంటూ ఒక "డీగ్రేట్ ఆటిట్యూడ్"ని డెవలప్ చేస్తూ ఇంజెక్ట్ చేస్తే, కొంతకాలానికి వాళ్ళు పూర్తిగా మనమాట వినడం మానేయడమో, వాళ్ళలో వాళ్ళు కుంచించుకుపోవడమో జరుగుతుంది.

తల్లిదండ్రులు ఎంత జాగ్రత్తగా మంచిగా తీర్చిదిద్దినా సరే, పిల్లలు వాళ్ళనే మార్గదర్శకులుగా ఎన్నుకుంటారని చెప్పడానికి వీలులేదు. సాధారణంగా చిన్నపిల్లలు తమ బాబాయిలనో, మామయ్యలనో మార్గదర్శకులుగా ఎన్నుకుంటారు. అందులో తప్పేం లేదు కూడా. ఎందుకంటే తమకన్నా వయసులో చాల పెద్దవాళ్ళయిన తల్లిదండ్రులతో కమ్యూనికేషన్ ఏర్పరచుకోడానికి, పిల్లలు సాధారణంగా అంత ఉత్సాహం చూపించరు.

పిల్లలు మొదట ఎనిమిది, పది సంవత్సరాలవరకూ తమ తల్లిదండ్రులని ఈ ప్రపంచంలోకెల్లా అత్యంత మేధావులుగా, గొప్పవాళ్ళుగా త్యాగమూర్తులుగా భావిస్తూ వుంటారు. కానీ, ఆ వయసు దాటిన తర్వాత తల్లిదండ్రులు కూడా సామాన్య మనుషులేనని వాళ్ళూ అందరిలాగే అబద్ధాలాడుతూ వుంటారని, తండ్రులు లంచాలు తీసుకుంటూ వుంటారని, తల్లి మిగతా స్త్రీలలాగే ప్రవర్తిస్తూ ఉంటుందని గుర్తించడం మొదలుపెడతారు. అందువలన పిల్లల 8-11 మధ్య వయస్సులో తల్లిదండ్రులు చాల జాగ్రత్తగా ప్రవర్తించవలసి వుంటుంది. పిల్లలకి 14 ఏళ్ళు వచ్చేసరికి ప్రపంచం అంతా బాగుంది, నాలోనే ఏదో డిఫెక్టు వుంది అన్న భావన స్థాయిలో వుంటారు. అప్పుడు వాళ్ళలో ఒక మానసిక బలాన్ని పెంచడానికి తల్లిదండ్రులు ప్రయత్నించాలి. పదిహేను, పదహారేళ్ళు దాటిన తర్వాత పిల్లలకి ప్రపంచం అంతా బాగులేదు నేనొక్కణ్నే (నేనొక్కదాన్నే)గొప్పవాణ్ని, నాలో చాలా తెలివితేటలున్నాయి అనే భావం ఏర్పడుతుంది ఇటువంటి పరిస్థితుల్లో వాళ్ళ అహానికి ఎటువంటి దెబ్బ తగలకుండా వాళ్ళని జాగ్రత్తగా మళ్ళీ దారిలోకి తీసుకురావాలని వుంటుంది.

వయసు పెరిగేకొద్దీ పిల్లలలో వచ్చే మార్పులు కూడా గమ్మత్తుగా

వుంటాయి. పన్నెండేళ్ళ కుర్రవాడు, పదహారునుంచి ఇరవై యేళ్ళ కుర్ర వాళ్ళతో కలిసి తిరగడానికి ఉత్సాహపడతాడు. అతడు తనకన్నా చిన్న వాళ్ళయిన ఎనిమిది, పది సంవత్సరాల పిల్లలతో ఆడుకోడానికిగాని, తిరగ డానికిగాని ఇష్టపడడు. ఇలాంటప్పుడే తనకన్నా పెద్దవాళ్ళయిన స్నేహి తులను గాని, మామయ్యలను లేదా బాబాయ్‌లనుగాని ఆశ్రయిస్తాడు. అదే మనస్తత్వం ముసలివాళ్ళలోకూడా కనిపిస్తుంది.

ఉదాహరణకి నలభై యేళ్ళు దాటిన వ్యక్తి పాతికేళ్ళ యువకుడితో కలిసి కాలం గడపడానికి ఉత్సాహం చూపిస్తాడు. అరవై యేళ్ళ ముసలివాడు పదిలోపు బాలబాలికలతో ఆడుకోవడానికి ఉత్సాహం చూపిస్తాడు. ఇలాగ వయసులో వచ్చే మార్పులు తమ సహచరుల వయస్సుమీద చాలా ఆధార పడి వుంటాయి. తల్లిదండ్రులు పిల్లలలోవచ్చే ఈ మార్పుని గుర్తించవలసి వుంటుంది. ఇటువంటి పరిస్థితుల్లోనే పిల్లల స్నేహితులు ఎవరు అనే విష యాన్ని కూడా తల్లిదండ్రులు పరిగణనలోకి తీసుకోవలసి వుంటుంది. చెడ్డ కంపెనీలో తిరుగుతున్న కొడుకుని వెంటనే సరిదిద్దుకోవలసి వుంటుంది. ఎందుకంటే ఈ వయసు పిల్లలు ఒక వ్యసనాన్ని 'థ్రిల్'గా భావిస్తారే తప్ప, అది భవిష్యత్తులో తమని పాడుచేస్తుందని ఊహించలేరు.

ఉదాహరణకి నలుగురు స్నేహితులలో ఒక కుర్రవాడు సిగరెట్ తాగకుండా,మిగతా ముగ్గురూ సిగరెట్లు, మత్తుపదార్థాలు తీసుకొనేవ్యక్తులైతే ఈ కుర్రవాణ్ని వాళ్లు చాలా తేలిగ్గా చులకనగా చూస్తారు. 'సిగరెట్ కూడా తాగలేవు ఇంకెందుకు పనికొస్తావురా' అంటూ తరచూ దెప్పి పొడుస్తూ వుంటారు. అప్పుడు తల్లిదండ్రులే ఆ కుర్రవాడితో మంచి కమ్యూనికేషన్ ఏర్పరచుకొని 'సిగరెట్ తాగేవాడికన్నా, తాగనివాడే గొప్పవాడు. నీకు క్లాసులో ఫస్టు వస్తున్నది కాబట్టి నిన్ను చెడగొట్టడానికి, వాళ్ళలోకి నిన్ను లాక్కోవడానికి ప్రయత్నం చేస్తున్నారు' అని చెప్పగలిగితే ఆ కుర్రవాడు తప్పకుండా అర్థం చేసుకుంటాడు. పదహారేళ్ళ కుర్రవాడి మనసు అద్దం లాంటిది. ఎదురుగా ఏ వస్తువు పెడితే అదే ప్రతిబింబిస్తుంది.

అలాగే అమ్మాయిల్లో కూడా, ఆ అమ్మాయి చుట్టూ వున్న అమ్మాయిలందరికీ బోయ్‌ఫ్రెండ్స్ వుంటే, తనకి ఒక బోయ్‌ఫ్రెండ్ లేక పోవటమే తన అవలక్షణంగా భ్రమించే అవకాశం వుంది. అదే విధంగా స్నేహితుల్లో బాగా డబ్బున్నవాడు, ఒక కారుని కాని, స్కూటర్ గాని మెయింటైన్ చేస్తే, మీ కుర్రవాడు తనకవి లేకపోవడాన్ని తన తండ్రి చేత కానితనంగా భావించే ప్రమాదముంది. అందువల్ల నిరంతరం మీ పిల్లల యొక్క స్నేహబృందాన్ని మీరు గమనించవలసి వుంటుంది.

చదువు :

చదువు అంటే స్కూలుకెళ్ళడం, పాఠాలు చదవడం కాదని ముందే చెప్పడం జరిగింది. చిన్నపిల్లల్లో ఐ.క్యూ. పెంచడానికి చదరంగం ఒక మంచి ఆట. అదే విధంగా వర్డ్స్ బిల్డింగ్, డిక్షనరీ చదవడం- ఇలాంటివి కూడా చిన్నపిల్లల తెలివితేటలని పెంచడానికి సహాయపడతాయి. పొద్దున్నే లేచిన తర్వాత తమ పక్కబట్టలు నీటుగా సర్దిపెట్టుకోవడం, గదిని శుభ్రంగా వుంచుకోవడం, తన నీళ్ళు తనే బాత్‌రూమ్‌లో పెట్టుకోవడం, పుస్తకాలు సర్దుకోవడం—ఇవన్నీకూడా చదువులోకే వస్తాయి. చదువు జీవితానికి ఆధారమయితే, ఇలాంటి చదువు చదువుకే ఆభరణమౌతుంది. ఒక రకంగా చూస్తే ఆటలుకూడా చదువులో భాగమే. క్రీడలు, సంగీతం,డాన్స్, డ్రామా ఇవన్నీ పిల్లలు రిలాక్సవడానికి సహాయపడతాయి మీరు గమనించి చూడండి. ఏదేనా ఒక కళపట్ల ఉత్సాహం వున్న పిల్లవాడు మిగతా పిల్ల వాళ్ళలాగా, రోడ్ల కూడలిలో నిలబడి మాట్లాడడం, గేట్లు పట్టుకొని స్నేహితులతో మాట్లాడడం యిలాంటివి చేయడు. చదువైన తర్వాత తన కళలో నిమగ్నమౌతాడు. అంతేకాక, ఏదైనా ఒక కళలో ప్రావీణ్యం ఉన్న ఒక కుర్రవాడు, ఏ కళలోనూ ప్రవేశంలేని వాళ్ళకంటే స్కూల్లో ఎక్కువ మార్కులు సంపాదిస్తాడు. కాబట్టి ఏదేనా ఒక ఆర్ట్‌లో మీ పిల్లవాడిని ప్రవేశపెడితే వాడు చదవడానికి టైముండదేమో, అందు

వల్ల మార్కులు సరిగా రావేమోనన్న భయం అనవసరం. ఏ పిల్లవాళ్ళ యినా చదివేవి, మనసుకి ఎక్కించుకునేది కేవలం రెండు మూడు గంటలు మాత్రమే. మిగతా టైమంతా ఖాళీగా వుండేకన్నా ఒక అద్దులో ప్రవేశ పెడితే ఎక్కువ ప్రయోజనం వుంటుంది.

చదువుకు సంబంధించిన విషయాలే కాకుండా పిల్లలకి చాలా ప్రాపం చిక విషయాల్లో అనుమానాలొస్తుంటాయి. వాటికి ఓర్పుగా సమాధానం యివ్వవలసిన బాధ్యత తల్లిదండ్రులదే. ఇక్కడొక గమ్మత్తయిన విషయం ఏంటంటే, పిల్లలేదైనా ప్రశ్నిస్తే, దానికి సమాధానం తల్లిదండ్రులకు తెలియకపోతే, వెంటనే వాళ్ళు అది తెలుసుకోవలసినంత ప్రాముఖ్యం లేనిదన్నట్లుగా 'సీ కెలుకురా పోయి చదువుకో' అనో లేదా 'ఇలాంటి అనవసర విషయాలెందుకురా' అనిగానీ తోసిపుచ్చడానికి ప్రయత్నిస్తా వుంటారు. ఇది చాలా దారుణమైన విషయం. తమకి తెలియకపోతే పిల్ల లతో కలిసి ఏ పుస్తకాలో వెతికి చూసి తెలుసుకోవడానికి ప్రయత్నించాలి. అంతేకాని, కేవలం తమకు తెలియకపోవడంవల్ల ఆ విషయాన్ని ప్రాము ఖ్యత లేనిదిగా తోసిపడేయకూడదు.

చాలామంది పిల్లలు కొన్ని కేటగిరీస్‌లోకి వెళ్ళరు. గర్వం గల వాళ్ళు, సున్నిత హృదయులూ, తమమీద తమకి ఎక్కువ నమ్మకం వున్నవాళ్ళు, తమమీద తమకి అసలు నమ్మకం లేనివాళ్ళు, ప్రతి చిన్న విషయాన్ని పెద్దదిగా చూసేవాళ్ళు, పెద్ద విషయాన్ని కూడా చాలా తేలి కగా చూసేవాళ్ళు–ఇలా పిల్లలు రకరకాలుగా వుంటారు.

దురదృష్టకరమైన విషయం ఏంటంటే చాలామంది తల్లిదండ్రులకి తమ పిల్లలు ఏ కేటగిరిలోకి వెళ్తారో తెలీదు. తెలుసుకోవడానికి ప్రయ త్నించరు కూడా. అలా కాకుండా తమ పిల్లలపట్ల తమ రియాక్షన్ ఏ విధంగా వుండాలి అనేది ప్రతీ తండ్రీ ఆలోచించుకోవలసి వుంది. ఒక పిల్లవాడు తానెలాంటివాడో తెలుసుకొనే అవకాశం ఏమాత్రం లేదు.

కానీ, ఎంతో వయస్సుండి, ఎంతో అనుభవమున్న తల్లిదండ్రులు కూడా తమ పిల్లలెలాంటివాళ్లు, వాళ్ళపట్ల తామెలా ప్రవర్తించాలి అన్నది తెలుసుకోకపోవడం చాలా దారుణమైన పరిస్థితి. చాలా సున్నితమయిన కుర్రవాడుంటే, వాడు స్కూల్‌నుంచి అరగంట ఆలస్యంగా వస్తే కారణం కూడా తెలుసుకోకుండా ఆ పిల్లవాడిని తంతే వాడు ఆత్మహత్య చేసుకొనే ప్రమాదం కూడా వుంది. మీ పిల్లవాడు యెలాంటివాడో తెలుసుకోవాలనే బాధ్యత మీదే తప్ప, తెలియచెప్పాల్సిన బాధ్యత మీ పిల్లవాడిది కాదు. ఒక లాలిత్యమైన పిల్లవాడిని యివ్వడం ద్వారా మీకు దేవుడెంతో సహాయం చేశాడు. అతని హృదయాన్ని బండబారినట్లు చేస్తే మీరతనికి ద్రోహం చేస్తారు. ఈ విషయం మీరు సదా గుర్తుంచుకోవాలి.

ఇంకొందరు పిల్లలకి, తమకు తామే బోధించుకుని చదువుకొనే గుణం వుంటుంది. ఇది చాలా గొప్ప లక్షణం. దాన్ని చంపేయడానికి మీరు ప్రయత్నించకూడదు. ఉదాహరణకి, ఒక సైన్స్‌పాఠాన్ని కుర్రవాడు చదివి, అర్థంచేసుకొని, దానిని తిరిగి తనదైన రీతిలో రాస్తే–పుస్తకంలో ఉన్నదున్నట్లుగా యెందుకు రాయలేదని దండించకూడదు. ఈ దుర్గుణం తల్లిదండ్రులలోనే కాకుండా టీచర్లలో కూడా కనపడుతుంది. ఎప్పుడైనా వరే ఒక కుర్రవాడు, ఒక విషయాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తే అది "కంఠతాపెట్టి గుర్తువుంచుకునే దానికన్నా" యెక్కువ కాలం గుర్తుంటుంది.

మీ పిల్లలని మీరు అప్పుడప్పుడు లైబ్రరీకి తీసుకువెళుతుండాలి. పుస్తక ప్రపంచం సముద్రమంత గొప్పది అన్న విషయం చిన్నపిల్లల మనసుల్లో నాటితే, అది పెద్దయ్యాక వాళ్ళకి చాలా సహాయం చేస్తుంది. ఈ విధంగా మీకున్న అభిరుచుల్లోకి మీ పిల్లవాళ్ళను తీసికెళ్ళగలిగితే, అంటే మీతోపాటు లైబ్రరీకి, గుడికి, పార్కుకీ, సినిమాకి తీసుకువెళ్తూ మీ కార్యక్రమాల్లో మీ పిల్లవాణ్ని కూడా భాగస్వామిని చేస్తే, మీపట్ల మీ పిల్లవాడు ఆప్యాయతని పెంచుకుంటాడు.

చాలామంది తల్లిదండ్రులు సినిమాలకి వెళ్తున్నప్పుడు గాని, లేదా ఫ్రెండ్స్ యింటికి డిన్నర్ కి వెళ్తున్నప్పుడు గాని పిల్లలని తమ అత్త మామల దగ్గరో, తల్లిదండ్రుల దగ్గరో వదిలేస్తూ వుంటారు. ఇలా చెయ్యడంవలన పిల్లలకి 'మేనర్స్' నేర్పడం అనేది జరగకపోగా, మీ మంచి వాళ్లు వేరనే భావాన్ని వాళ్ళలో కలుగజేస్తున్నారన్నమాట. మీరు యవ్వనంలో వుండి, మీ పిల్లలు చిన్నవాళ్లుగా వున్నప్పుడు, మీ మంచి వేరు అనే భావం మీరీ విధంగా క్రియేట్ చేస్తే, మీ పిల్లవాళ్ళు యువకులై మీరు వృద్ధులయాక, వాళ్ళ ప్రపంచంలోకి మిమ్మల్ని రానివ్వరు. అప్పుడు కేవలం మీ అనారోగ్యానికి మీ పిల్లలిచ్చే డబ్బులతో సంతృప్తిపడి మీరు గడపవలసి వుంటుంది.

ఇప్పుడు మీ పిల్లలకోసం మీరు తవ్వే పునాది 'ప్రేమ' అయితే, ఆ తర్వాత మీ పిల్లలు మీకిచ్చే భవంతి 'ఆప్యాయత'.

పిల్లల్లో వున్న ఉత్సాహాన్ని పనిగట్టుకొని చంపెయ్యడం బాధ్యతగా కొంతమంది భావిస్తూ వుంటారు. పాఠ్యపుస్తకాలు కాకుండా మిగతా పుస్తకాలు చదివే అలవాటున్న పిల్లల్ని 'ఎందుకురా ఆ పాడు పుస్తకాలు చదవడం' అని అనడం ద్వారా వాళ్ళలో ఉత్సాహాన్ని చంపేస్తూ వుంటారు. మా ఫ్రెండ్ కూతురికి ఐదేళ్ళుంటాయి. నేను వారానికోసారి వాళ్ళింటికి వెళ్తుంటాను. ఆ పాప 'అంకుల్' 'అంకుల్' అంటూ నా దగ్గరకొస్తుంది. ఆ మధ్య తరచుగా ఆ పాప చేతిలో ఏదో ఒక పుస్తకం వుండేది. చదవడానికి నన్ను హెల్ప్ చెయ్యమని అడిగేది. ఇద్దరం సోఫాలో కూర్చుని చదివేవాళ్ళం. అందులో బొమ్మలతో సహా పేర్లుండేవి. చదువునూ మాట్లాడడం నేర్చుకోడానికి ఆ పుస్తకం బాగా ఉపయోగపడేది. అది ఇంగ్లీషు చందమామ. మొదట్లో ఆ పాపకి దాన్ని ఎలా చదవాలో, ఎలా అర్థంచేసుకోవాలో తెలిసేదికాదు. నేను కొద్దికొద్దిగా హింట్స్ యిచ్చేవాడిని. ఆ పాప

నెమ్మదిగా అర్థం చేసుకొని, చాలా ఆశ్చర్యకరంగా ఒక సంవత్సరం తిరిగే సరికల్లా ఆ అమ్మాయి స్వంతంగా ఆ ఇంగ్లీషు చందమామని చదవడం నేర్చుకొంది.

ఇతరులకి ఏదేనా నేర్పించేటప్పుడు వాళ్ళ స్థాయిని మనం గుర్తు పెట్టుకోవాలి. ముఖ్యంగా పిల్లల విషయంలో వాళ్ళు ఏ దృష్టితో ఆ పుస్త కాన్ని చదువుతున్నారో గ్రహించి, ఆ దృష్టిని మరింత విస్తృతపరిచేలా చెయ్యాలి. పిల్లలకి పాఠాలు చెప్పేటప్పుడు కూడా మన లెవల్‌లో ఆలో చించి చెప్పకూడదు. ఉదాహరణకి; ఒక ఎల్కేజి చదువుతున్న పిల్లవాడు '2×2=4' అన్న విషయాన్ని కూడా చాలా పెద్ద విషయంగానే భావి స్తాడు. వాళ్ళు చదువుతున్న పుస్తకంలోని విషయాలు, పదాలు మనకు బాగా తెలిసి వుండడంవల్ల, అవి చాలా సులభంగానే వున్నట్లు మనకి కని పిస్తుంది. కానీ, పిల్లల దృష్టిలో మాత్రం అది చాలా కష్టమైనది.

పిల్లలు పుస్తకాలు చదువుతున్నప్పుడు కొంతమంది పైపైన తిర గేస్తూ వుంటారు. లోతుగా చదవరు. దీనిని గుర్తించవలసిన బాధ్యతకూడా తల్లిదండ్రులదే.

పిల్లలు సామాన్యంగా ఆరో పేజీ చదువుతున్నప్పుడు ఐదో పేజీ వరకూ చదివినది మర్చిపోతుంటారు. దీనిని మనం పెద్ద విషయంగా తీసు కొని, వాళ్ళకి జ్ఞాపకశక్తి లేదని అనుకోకూడదు. ఇది చాలా సర్వసాధారణ మైన విషయం.

పిల్లలు తమ గదిలో కూర్చొని తాము చదువుకొంటూ వుంటే, పెద్దవాళ్ళు పక్కగదిలో కూర్చొని టీ.వీ. చూసుకుంటున్నా, టేప్‌రికార్డర్ పెట్టుకొని కబుర్లు చెప్పుకుంటున్నా అప్పటివరకు చదివినది పిల్లలు మరిచి పోయి ఆ పక్కగదిమీదే వాళ్ళ ధ్యాస పెట్టుకోవడం సాధారణమైన విష యం. ఇలాంటి చిన్న చిన్న పొరపాట్లు చేయకూడదు. అలాగే వాళ్ళు ఓ గదిలో చదువుకుంటున్నపుడు మిగిలిన పెద్దవాళ్ళందరూ పేకాడుకుంటూనో,

కలుష్లో చెప్పుకుంటూనే వుంటే 'మిగతా ప్రపంచం అంతా ఆనందంగా వుంది. తాము మాత్రం ఈ చదువు అనే నరకంలో వున్నాం' అన్న భావం పిల్లలకి కలుగుతుంది. ఇలాంటి భావాన్ని ఎటువంటి పరిస్థితుల్లోనూ పిల్లలకి కలుగచెయ్యకూడదు.

ప్రతి మనిషిలోనూ కొన్ని అభినందింపదగ్గ విషయాలు, కొన్ని లోపాలు వుంటాయి. మీ పిల్లలలో అభినందింపదగ్గ విషయాలుంటే వాటిని ఎక్కువగా గుర్తించండి. లోపాలని ఎత్తిచూపకుండా వీలైనంతవరకూ సరిదిద్దడానికి ప్రయత్నించండి. మాటిమాటికి 'నువ్వు ఎందుకూ పనికి రావురా వెధవా, నీలాంటి వాణ్ణెందుకు కన్నానో' – ఇలాంటి మాటలతో వాళ్ళని బాధపెడితే దానివల్ల నష్టపోయేది వాళ్ళతోపాటు మీరుకూడా.

## హిప్నటిస్టులూ-చదువు :

చాలామంది ఇంటర్మీడియెట్ చదివే కుర్రవాళ్ళు లేక డిగ్రీ చదువుతున్న అమ్మాయిలు, కొంతమంది తల్లిదండ్రులూ, చదువుమీద ఏకాగ్రత పెరగడానికి చదివిన విషయం జ్ఞాపకం వుంచుకోవడానికి హిప్నటిజం బాగా ఉపయోగపడుతుందని భావిస్తూ వుంటారు. ఒక విషయం బాగా గుర్తుండాలంటే దాన్ని బాగా చదవాలి. దాన్ని బాగా గుర్తుపెట్టుకొనేలా శాయశక్తులా ప్రయత్నించాలి. అంతేగాని మూడు వందల రూపాయలు ఫీజివ్వడం ద్వారా ఓ వారంరోజులు 'రిలాక్స్' 'రిలాక్స్' అంటే నిద్రపోవడం ద్వారా చదువొస్తుందని, విషయాలు గుర్తుపెట్టుకుంటామని అనుకొంటే అది కేవలం భ్రమ మాత్రమే. నిజంగా ఒక మనిషి జ్ఞాపకశక్తి పెరగడానికి యింత చిన్న ట్రైనింగ్ సరిపోతే ఈ పాటికి ప్రపంచంలో ఎంతోమంది మేధావులు తయారై వుండేవారు. మూడు వందల రూపాయలిచ్చి ఓ హిప్నటిస్టు దగ్గర జ్ఞాపకశక్తిని 'కొనుక్కోడానికి' ముందు మీరు ఆ హిప్నటిస్టు దగ్గర వున్న పేషెంట్లని ఇంటర్వ్యూ చెయ్యండి. మీలాగే జ్ఞాపకశక్తిని పెంపొందించుకోవచ్చనే భ్రమతో వచ్చిన స్టూడెంట్స్‌లో

ఎంతమంది ఏ విధంగా 'రిలాక్స్' అయి తమ జ్ఞాపకశక్తిని పెంచుకొని, డాక్టర్లు ఇంజనీర్లు అయ్యారో, స్టాటిస్టిక్స్ యిమ్మని ఆ హిప్నాటిస్టుని అడగండి. మీలాంటి తలనొప్పి వ్యవహారాన్ని వీలయినంత తొందరగా వదిలించుకోడానికి ఆ హిప్నటిస్ట్ ప్రయత్నిస్తాడు.

హిప్నాటిజంవల్ల ఎంగ్జయిటీ న్యూరోసిస్ తగ్గొచ్చు. జ్ఞాపకశక్తి పెరిగిన సూచన్లు లేవు. హిప్నటిస్టుల కొడుకులు, కూతుర్లు, స్టేటురాంకులు వచ్చిన దాఖలాలు లేవు.

ఒక మనిషి మానసిక బలహీనతమీద ఆడుకోవడం తెలివైనవాడి పని అన్న విషయాన్ని గుర్తించండి. అలాగే మీ పిల్లలకి తలనొప్పి వచ్చినా, కడుపునొప్పి వచ్చినా హిప్నటిస్టుల దగ్గరకి తీసుకువెళ్ళడం మానేయండి.

ఇలాంటి హిప్నటిస్టులకన్నా, మీరు వీలయినంతవరకూ మానసిక శాస్త్రవేత్తల దగ్గరికి మీ పిల్లలని అప్పుడప్పుడూ తీసుకువెళుతూ వుండడం చాలా మంచిది. ఒక సైకియాట్రిస్ట్ దగ్గర మీరూ మీ పిల్లలు సరదాగా, అదేదో రోగం నయంచేసే పద్ధతిలో కాకుండా కూర్చొని కొంతసేపు కబుర్లు చెప్పుకుంటూ వుంటే మీ పిల్లవాడి సైకాలజీ బలహీనతలు,మానసిక స్థితి గురించి ఆ సైకియాట్రిస్టు మీకు విశదీకరించి చెప్తాడు. పదిహేనేళ్ళ వయస్సులో కనీసం ఒక్కసారైనా మీరు ఆ విధంగా సైకియాట్రిస్టుని కలుసుకోవడం ఎప్పుడూ మంచిది. కేవలం పిచ్చివాళ్ళు మాత్రమే సైకియాట్రిస్టుల దగ్గరకి వెళతారనుకోవటం తప్పు.

పిల్లలకు కొన్ని వింత అలవాట్లుంటాయి. అవి అపాయకరమైనవి కాని పక్షంలో, వాటిని కొనసాగించటంలో ఏ ప్రమాదమూ లేదు. ఉదాహరణకి, ఓ పిల్లవాడికి టేప్‌రికార్డర్ వింటూ పుస్తకం చదవడం అలవాటైతే, అతడి చదువు ఏ విధంగానూ ఆ టేప్‌రికార్డర్‌వల్ల భంగం కలగడం లేదన్న విషయం రుజువైతే అతన్ని ఆ అలవాటునే కొనసాగించనివ్వండి. ఏదో ఆలోచిస్తూ పుస్తకం చదివేకన్నా, ఓవేపు టేప్‌రికార్డర్‌లో మంచి మంద్రమైన మ్యూజిక్ వస్తుండగా, అతడు పాఠం చదవడంలో

బాగా లీనమైతే అందులో నష్టం ఏముంది? అదే విధంగా టైంటేబుల్ ప్రకారం రోజూ తంచన్‌గా ఏడయ్యేసరికి పుస్తకాలు ముందేసుకొని కూర్చోవాలి అన్న రూల్ మీ పిల్లవాడికి యిష్టం లేకపోతే, అందులో తప్పేంలేదు. ఒకటి రెండ్రోజులు అతను ఏమీ చదవకుండా రిలాక్స్ అవదల్చుకుంటే తప్పకుండా అవనివ్వండి. అలా అని ఎప్పుడేనా రిలాక్సేషన్లోనే అతడు ఆనందం ఆరంభిస్తే మాత్రం, తప్పనిసరిగా మీరా వ్యవహారంలో జోక్యం చేసుకోండి.

ఈ ఛాప్టర్లో ఒకసారి నేను పిల్లల్తో కలిసి మీరు జీవితాన్ని ఆస్వాదించటం గురించి చెప్పడం జరిగింది. పిల్లలని ఒక స్విమ్మింగ్‌పూల్‌కో, పార్క్‌కో, జూలాజికల్ పార్క్‌కో తీసుకువెళ్ళడం ద్వారా వారిలో వున్న చురుకుదనాన్ని, మీరు ఎక్కువజేసే వీలు కలుగుతుంది. పిల్లల్లో ధైర్యం భయం యివన్నీ రకరకాల పాళ్ళలో వుంటాయి. వీళ్ళతో కలిసి బయట ప్రపంచంలో తిరగడంద్వారా వీటిని మీరు గుర్తించగలుగుతారు. ప్రస్తుత కాస్మోపాలిటన్ నగరాల్లోవున్న పిల్లల్లో ఎనభై శాతం మంది పిల్లలు ఇంత వరకూ కనీసం నదిమీద పడవలో షికారు చెయ్యలేదంటే మీరు నమ్మగలరా? దీనికి బాధ్యత కేవలం తల్లిదండ్రులదే. తమ రొటీన్ జీవితంలో కనీసం నాలుగురోజులు వెచ్చించి, తమ కుర్రవాడికి నది యెలా వుంటుందో, పడవెలా వుంటుందో, పడవలో ప్రయాణం ఎలా వుంటుందో చెప్పలేకపోతే; పిల్లల్నికని ఆ తల్లిదండ్రులు పెంచి పెద్దచేసే కర్తవ్యాన్ని మాత్రమే తీసుకున్నారు తప్ప, వాళ్ళకి ఒక గొప్ప అనుభూతి నివ్వాలనే బాధ్యతని తీసుకోలేదన్నమాట.

ధైర్యం అనేది ఒక పెద్ద పదార్థంకాదు. అది మనం చేసే పనుల వల్లే మనకొస్తూ వుంటుంది. ఉదాహరణకి మీ ఆరేళ్ళ పిల్లవాణ్ని ఓ స్విమ్మింగ్‌పూల్లో అయిదారు నెలలపాటు ఈత నేర్పిస్తే, వాడికి చిన్నతనం లోనే నీళ్ళపట్ల భయం పోతుంది. నీళ్ళపట్లే కాదు, జీవితంపట్ల కూడా చాలావరకూ భయం పోతుంది. స్విమ్మింగ్ అనేది మానసిక శాస్త్రవేత్తల థియరీ ప్రకారం జీవితాన్ని ఎదుర్కొనే పెద్ద చర్యకు చిన్న ప్రారంభం.

# అధ్యాయం - 3

# రకరకాల తల్లిదండ్రులు

ఒక పదమూడేళ్ళ అమ్మాయి స్కూల్‌నుంచి ఓ రెండు గంటలు ఆలస్యంగా యింటికి వచ్చిందనుకోండి. ఆ ఆలస్యంపట్ల రకరకాల తల్లి దండ్రుల ప్రతిస్పందన వేరు వేరు విధాలుగా వుండవచ్చు.

తండ్రి ముందు రూమ్‌లో భీకరంగా పచార్లు చేస్తూ, కూతురు యింట్లోకి అడుగు పెట్టగానే రెక్క పట్టుకుని ముందుకు లాగి "ఎందు కాలస్యం అయిందే" అని అడుగుతాడు. ఆ అమ్మాయి జవాబు చెప్పే లోగానే చెంపమీద టపటపాకొట్టి "వళ్లు చీరేస్తాను. ఎప్పుడయినా ఇలా ఆలస్యంగా వస్తే రక్తం కళ్ళజూస్తాను. పోవే....పో....అడుక్కుతిను—" అంటూ రౌద్రంగా అరిచాడు. మధ్యలో తల్లి అడ్డుపడకపోతే "దాన్నీ, నిన్నూ కిరసనాయిలుపోసి తగలబెడతాను. నాకడ్డురాకు. పో....వంటింట్లో తగలడు" అని భార్యని గదమాయించవచ్చు.

మరో కుటుంబంలో....ఆ పాప ఇంటికి ఆలస్యంగా వచ్చినపుడు తల్లి మెట్లమీద కూర్చుని గుడ్లనీరు కక్కుకుంటూ పాప రాగానే "వచ్చావా ఇంత ఆలస్యం అయ్యిందే. వెయ్యిదేవుళ్ళకి మొక్కుకున్నాను. నీకే ఆక్సిడెంట్ అవుతుందేమోనని....ఏమందీ పాపొచ్చింది," అంటూ ఇంట్లోకి పరిగెడితే ఆ భర్త సోఫాలో కూర్చుని పేపర్ చదువుకుంటూ "వచ్చిందా....అనవసరంగా రెండుగంటలు ఇల్లంతా నానాయాగీ చేశావు" అని పేపరు పక్కన పడేసి అటు తిరిగి పడుకోవచ్చు.

మరో కుటుంబంలో....పాప స్కూల్‌నుంచి ఆలస్యంగా వస్తుంది. తల్లి వంటింట్లో కూర్చుని పనిచేసుకుంటూ వుంటుంది. తండ్రి రూంలో

ఫైల్స్ చదువుకుంటూ వుంటాడు. ఎవరి పనుల్లో వాళ్ళుంటారు. ఈ పాప తన గదిలోకెళ్ళి పుస్తకాలు పడేసి, పెరట్లోకి వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కుని భోంచేసి తన రూంలోకి వెళ్ళిపోతుంది. ఆ పాప వచ్చి యెంతసేపైనా అక్కడ పట్టించుకునే వాళ్ళెవరూ వుండరు. రోజూ కరెక్టు టైంకి వచ్చే పాప ఒకరోజు ఆలస్యంగా వస్తే 'ఎందు కాలస్యం అయింది?' అని అడిగేవాళ్ళు వుండకపోవడం ఎంతో బాధాకరమయిన విషయం. ఎవరూ అజమాయిషీ చెయ్యని స్వేచ్ఛా ప్రపంచాన్ని ఒకవేపు ఆనందంగా అనుభవిస్తున్నా, మనసులో ఏదో ఒక మూల 'నన్ను పట్టించుకునే వాళ్ళెవరూ లేరు' అన్న బాధకూడా ఆ పాపకి వుంటుంది.

ఇంకో ఇంట్లో తండ్రి ఎప్పుడూ గంభీరంగా వుంటాడు. ఆలస్యంగా వచ్చిన పాపను తల్లి ప్రశ్నలు వేస్తుంది. ఈ తండ్రి జడ్జిలా అన్నీ వింటాడు తప్ప ఏ ప్రశ్నా అడగడు. తను ఏ విషయంలో కల్పించుకున్నా తనపట్ల వారికి గౌరవం పోతుందని, ఎప్పుడూ మౌనంగా, గంభీరంగా వుంటుంటాడు. తల్లి అడిగిన ప్రశ్నలకి సంతృప్తికరమైన సమాధానాలు రాకపోతే గంభీరంగా తన రూంలోకి వెళ్ళిపోతాడు. తల్లి ఆ పాపని బాగా తిడుతుంది.

ఇంకొక యింట్లో చాలా చిత్రంగా వుంటుంది తల్లిదండ్రుల ప్రవర్తన. అమ్మాయి ఆలస్యంగా ఇంటికి వస్తుంది. తల్లి 'ఎందుకే ఇంత ఆలస్యం అయింది' అని ఆ అమ్మాయిని అడగ్గానే ఆ అమ్మాయి తండ్రి బయటకొచ్చి 'ఎక్కడికి పోతయ్ అన్నీ తల్లి బుద్ధులు' అంటూ తన భార్యని వెక్కిరిస్తాడు. ఆమె వెంటనే, నావేం కాదు, ఇంట్లో శ్రీరామచంద్రుడు, బయట శ్రీకృష్ణుడు అవతారమెత్తే మీవే. కాకపోతే ఆడపిల్లకి ఇటువంటి బుద్ధులొచ్చాయే అని నా బాధ అంటుంది. 'ఆ బోడి మీవాళ్ళిచ్చిన అయిదువేలు కట్నానికి శ్రీకృష్ణుడు రాక అపర శ్రీరామ చంద్రుడొస్తాడా' అంటూ రెచ్చిపోతాడు. ఆమె వెంటనే 'మీకు ఆ అయిదువేలు

ఇవ్వడమే దండగ' అంటూ మాట తిప్పికొడుతుంది. రెచ్చిపోయిన అతడు ఆమెని నాలుగు బాదుతాడు. ముందు కొట్లాట, తరువాత తల్లి ఏడుపు ఆ పాపకి విన్పిస్తాయి. ఎక్కడ ప్రారంభమైన సంభాషణ, ఎటు తిరిగి, ఎక్కడ ముగిసిందో చూసిన ఆ పాప కంగారు పడిపోతుంది.

ఒక సంఘటనకి రకరకాల ఇళ్ళల్లో రకరకాల పరిణామాలు సంభవించడం జరిగింది. ఇలా ఒక సంఘటనకి రకరకాలుగా ప్రతిస్పందించే తల్లిదండ్రులని నాలుగు రకాలుగా విడగొట్టవచ్చు.

1. మిలటరీ నియంతలు
2. సంబరాల రాంబాబులు
3. మర్యాదరామన్నలు
4. భూతద్దం తల్లిదండ్రులు.

మిలటరీ నియంతలు :

"నేను నిన్ను గెంతమన్నప్పుడు 'ఎందుకు?' అని అడగకు. 'ఎంత ఎత్తు?' అని మాత్రమే అడగాలి"—ఇదీ వీరి మనస్తత్వం!

ఈ రకం తల్లిదండ్రులు ఎప్పుడు, ఏ మూడ్‌లో వుంటారో అర్థం చేసుకోవడం కష్టం. పిల్లలమీద తాము పెట్టుబడిగా పెట్టే డబ్బు, సమయం వృథాకాకుండా, చాలా త్వరగా ప్రతిఫలం రావాలని కోరుకుంటారు. తమ పిల్లవాడు ఒక సబ్జక్టులో మరీ 'వీక్' అని తెలిసినపుడు వెంటనే ఇంటిదగ్గర ఒక ట్యూషన్ మాస్టార్ని పెట్టిస్తారు. పెట్టించిన మరుసటి నెలలో ఏదైనా 'మంత్లీ టెస్ట్'లో తమ పిల్లవాడికి అవే సబ్జక్టులో పదిలోపు మార్కులు వచ్చాయనుకోండి. ఆ విషయం తెలియగానే వెనకాముందు ఆలోచించకుండా "ఎవడా ట్యూషన్ మాస్టారు? ఏం చెబుతున్నాడు వాడు? పిల్లవాడికి పది మార్కులు కూడ రాలేదు. వాడ్ని తీసేస్తాను" అంటూ గంతులేస్తాడు. వీళ్ళకి ఇమ్మీడియట్‌గా, 'ఓవర్‌నైట్'తో తమ పిల్లవాడు గొప్పవాడు కావాలని వుంటుంది. అంతేకాని 'తమ పిల్లవాడు ఆ సబ్జక్టులో ఎంత వీక్ ?

అతను ఇంప్రూవ్ కావాలంటే ఎంత టైం పడుతుంది' ఇలాంటివేమీ వీళ్ళు ఆలోచించరు.

పిల్లలకు ఒక పని చెబితే వాళ్ళు దానిని ఎదురు ప్రశ్న వేయకుండా క్షణాల్లో చేసేయాలని కోరుకుంటారు. తమ పిల్లవాడికి "పెన్సిల్ తీసుకురా" అని చెబితే వాళ్ళు ఎందుకు? ఏమిటి? అని అడగకూడదు. వెళ్ళి పెన్సిల్ తీసుకువస్తే అది వేళ్ళ మధ్యపెట్టి రూళ్ళకర్రతో బాదుతారు. ఇటువంటి తల్లిదండ్రులు పిల్లల దృష్టిలో నియంతలుగా మిగిలిపోతారు. అందుకు కారణం వీళ్ళు అనుసరించే పద్ధతులే.

పిల్లలను కూడ ఎంత మాటంటే అంతమాట వెనకాముందు ఆలోచించకుండా అనేస్తారు. అలా మాట్లాడినందువల్ల ఆ పిల్లలు ఎంత 'హర్ట్' అయ్యారు అనేది వీళ్ళకి అనవసరం. తమ జీవితంలో ఒక్కరోజు కూడ పిల్లల్ని ప్రేమగా ప్రక్కన కూర్చోబెట్టుకొని వాళ్ళ సమస్యల గురించి అడగరు. అలా కూర్చోపెట్టుకొని మాట్లాడితే తమ మీద వాళ్ళకి గౌరవం తగ్గిపోతుందని భయం. అందుకే పిల్లలు పెరిగేకొద్దీ వీళ్ళకి మానసికంగా దూరమవుతారు. బయటినుంచి ఏమాత్రం ప్రేమానురాగాలు ఎవరివైపు నుంచి వచ్చినా అటువైపు ఆకర్షింపబడతారు.

ఈ రకం తల్లిదండ్రులకి పిల్లలు చిన్న వయస్సులో భయపడ్డా, పెరిగేకొద్దీ తిరగబడతారు. ఈ పిల్లలు ఎదిగిన తరువాత ఆ ఇంట్లో నిత్యం ఘర్షణలు తప్పవు.

అలాగని ఈ రకం తల్లిదండ్రులకి తమ పిల్లలమీద ప్రేమలేదని, వీళ్ళు చెడ్డవాళ్ళని చెప్పలేము. వీళ్ళకున్న మంచి గుణం క్షణాల్లో నిర్ణయాలు తీసుకోవడం, అంతే వేగంగా వాటిని అమలుపరచడం పక్కింటి పాపాయికి చాలా మంచి ఫ్రాకులున్నాయని, ఆ పిల్లముందు తమ పాపాయి తీసికట్టుగా వుందని అనిపిస్తే, క్షణాల్లో బజారుకెళ్ళి మంచి బట్టలు తీసుకువస్తారు. తమ పిల్లలు గుంపులో గోవిందా అన్నట్లుగా వుండకుండా ఏ

కరాటేనో, డాన్సో నేర్చుకుంటామంటే – క్షణాల్లో తీసుకెళ్ళి అక్కడ చేర్పిస్తారు.

ఈ రకం తల్లిదండ్రులు, తమ పిల్లలు తమని ప్రేమించాలంటే వాళ్ళకి మానసికంగా దగ్గర కావాలంటే, కొన్ని అలవాట్లను, వ్యక్తిగత లోపాలను సరిదిద్దుకోవాలి. ఈ క్రింది విషయాలను అనుసరించాలి.

1. తమ పిల్లల అవసరాలు, సమస్యలపట్ల త్వరగా ప్రతిస్పందించి, వారికి కావలసినవి సమకూర్చే ముందు దానియొక్క పరిణామాలను కూడా ముందే ఆలోచించి వుంచుకోవాలి. నిర్ణయాలను త్వరత్వరగా తీసుకోకూడదు.

2. కోపం వచ్చినపుడు, ఆవేశం వచ్చినపుడు ఏ మాటంటే ఆ మాట అనేయకుండా ఎదుటివారు ఆ మాటలకు ఎంత బాధపడతారో ఆలోచించాలి. తమని తాము నిగ్రహించుకోవాలి.

3. తమకి, తమ పిల్లలకి మధ్య అవగాహన పెంచుకోవాలి. రోజూ ఓ గంటపాటు వాళ్ళతో మాట్లాడే అలవాటు పెంచుకోవాలి.

4. తమ కుటుంబం పట్ల తమకున్నది ప్రేమానురాగాలేకాని, వాటిని బరువు, బాధ్యతలుగా ఫీల్‌కావటం లేదని తెలియజేయాలి. తమ పెద్దరికాన్ని నిర్దాక్షిణ్యంగా అమలుచేయకుండా, ఆప్యాయతతో వారిని ఆకట్టుకోవాలి.

5. ఏ విషయంలోనైనా తమ మాటే నెగ్గాలని మొండిపట్టు పట్టకుండా కుటుంబ సభ్యులు చెప్పే విషయాలను కూడ పరిగణలోకి తీసుకోవాలి.

ఈ కైపు తండ్రులు ప్రవర్తించే విధానానికి ఒక మంచి ఉదాహరణ చెబుతాను. రెండు మూడురోజుల్లో అతను ఇల్లు మారుతున్నామనిచెప్పాడు. భార్యాపిల్లలకి ఇల్లు ఎందుకు మారుతున్నారో అర్థం కాదు. లారీ తీసుకు వచ్చి, సామాను ఎక్కించి వేరేఇంటికి తీసుకువెళ్ళినప్పుడు అర్థమైంది-పాత

ఇల్లు ఎవరికో అమ్మేశాడని. తమ తండ్రి డబ్బుకు అంత ఇబ్బంది పడు తున్నాడని ఆ పిల్లలకు చివరివరకు తెలియకపోవడం వాళ్ళ అదృష్టం కాదు దురదృష్టం. ఈ వైపు తల్లిదండ్రులు ముఖ్యంగా తమ సుపీరి యారిటీని వదులుకోవాలి. అది వదులుకుంటే తప్ప పిల్లలతో సాన్నిహిత్యం పెరగదు.

6. నిర్ణయాలు తీసుకునేశక్తి తమకుమాత్రమే వుందని,ఇంట్లోమరెవ రికీ ఆ శక్తిలేదని అనుకోవడము పొరపాటు. అన్ని విషయాలలోను తమ నిర్ణయమే సరైంది అనుకోవడం భ్రమ. ఆఫీసులో ఎంత పెద్ద పొజి షన్‌లో వున్నా, ఎన్ని నిర్ణయాలు తీసుకున్నా, ఇంట్లో మాత్రం తనకన్నా మంచి నిర్ణయాలు తీసుకునేవారు కనీసం ఇద్దరుంటారు. భార్య, కొడుకు, కూతురు.

ఉదాహరణకి ఇంటికి సోఫాసెట్టు తీసుకురావడం మంచి ఆలోచన. కానీ మీకు నచ్చింది తీసుకువస్తే తక్కిన వారికి ఆ చర్య అంత సంతోష కరంగా ఉండదు. ఇంట్లో నలుగురూ కూర్చుని గోడకున్న కలర్‌కి ఏ కలర్ సోఫాసెట్టు మ్యాచ్ అవుతుందో ఆలోచించి తీసుకువస్తే ఆ చర్చలో తమకీ భాగముందని ఇంట్లో అందరూ సంతృప్తి పడతారు. వాళ్ళు చెప్పినది మీకు నచ్చకపోతే, మీ నిర్ణయమే సరియైనదనిపిస్తే ఆ విధంగా చెయ్యొచ్చు కానీ చెప్పి ఆచరించటం వేరు, అసలు చెప్పకపోవటం వేరు.

7. మీకు నచ్చిన కూరలే మీ భార్య తరచూ వండుతుంటే, అది మీ నియంతృత్వానికి ఒక నిదర్శనం. ఈ పుస్తకం చదువుతున్న వైంకి మీ భార్యకి ఏయే కూరలు ఇష్టమో తెలియకపోతే అది కూడ నియంతృ త్వానికి ఒక ఉదాహరణ.

సంబరాల రాంబాబులు :

మీరెప్పుడైనా జంతు ప్రదర్శనశాలకి వెళితే అక్కడ 'ఓటర్' అనే జంతువు వుంటుంది. అది ఎప్పుడూ సరిగా ఒకచోట కూర్చోదు.

ఆఖరికి తిండి తినడం, గుట్టలమీద నుంచి గెంతడం లాంటివి కూడా ఒక జోక్‌గా తీసుకుని, సత్యం సరదాగా అరుస్తూ వుంటుంది. జోవియల్ తల్లి దండ్రులు శాపవశాత్తు జంతువులుగా మారటం సంభవిస్తే ఈ ఓటర్లుగా మారతారు.

సామూహిక జీవితమంటే వాళ్ళకి యిష్టం. ఎప్పుడూ వాళ్ళింట్లో పార్టీలు జరుగుతూ వుంటాయి. నలుగురైదుగురుతో కలిసి వుండకపోతే వాళ్ళకి తోచదు. వీరు తమ పిల్లలతో చాలా క్లోజ్‌గా వుంటారు. సరదా లెక్కువ. 'రోజంతా తిండి లేకపోయినా ఫర్లేదుకానీ గంటసేపు సరదాగా గడిపితే చాలు' అనుకునే రకం వీళ్ళు. పిల్లలతో స్కూల్ విషయంలో, పిల్లల పక్కన ఆ బెంచీలో ఎంతమంది కూర్చుంటారు ? టీచర్ ఏ రకం ప్రశ్నలు వేసుకొస్తాడు? స్కూల్ లంచ్ అవర్ ఎన్ని గంటలకి ? మంచి నీళ్ళు ఎక్కడ తాగుతారు?— ఇలాంటి వాటన్నింటినీ కూడ పిల్లల దగ్గిర నుంచి అడిగి తెలుసుకుంటారు. మాట్లాడుకోవటానికి వీళ్ళకి ఎప్పుడూ ఏదో ఒక టాపిక్ కావాలి. అది ఎంత నిరర్థకమైనదైనా సరే.

అందరితో మంచిగా వుండటం వీరి అలవాటు. అయితే ఈ అలవాటే వీళ్ళకి అన్ని సమస్యలనూ తెచ్చి పెడుతుంది. వీళ్ళు దేనినీ "కాదు" అన లేరు. ఆఫీసులో అయినా, స్నేహితులయినా, ఎవరు ఏ పని చెప్పినా ఆ బాధ్యత నెత్తిన వేసుకుంటూ వుంటారు. ఉన్న కాసేపు పిల్లలతో తీరికగా మాట్లాడేందుకు సమయం ఎక్కువ దొరకదు.

వీళ్ళల్లో వున్న ఇంకొక బలహీనత ఏమిటంటే అందరిచేత మంచి అనిపించుకోవాలని చాలా కోరికగా వుంటుంది. అవతలివాళ్ళు తమ నిష్ఠ పడాలని కోరుకోవడంవల్ల వాళ్ళు ఎంత పని చెప్పినా కాదనకుండా, రాత్రంతా మేలుకుని వాళ్ళప్పగించిన పని పూర్తిచేస్తారు. అందువల్ల వీళ్ళకి వీళ్ళ పిల్లలతో తీరికగా గడిపే 'టైం' వుండదు.

ఉదాహరణకి భార్య 'సాయంత్రం తొందరగా రండి. షాపింగ్

చేయాలి' అంటే అదే సాయంత్రం ఒక కొలీగ్ రెండు నెలల తరువాత జరగబోయే తన పెళ్ళికి బట్టలు సెలెక్ట్‌చేద్దాం రమ్మంటే భార్య కిచ్చిన మాట మర్చిపోయి, ఎప్పుడో జరగవలసిన కొలీగ్ పెళ్ళికి బట్టలు చూడటానికి షాప్‌కెడతారు. భార్య దగ్గిరకన్నా ఆ కొలీగ్ దగ్గర 'మంచి' అనిపించుకోవాలని వుండటమే దీనికి కారణం.

వీళ్ళ తాలూకు కుటుంబ సభ్యులెప్పుడూ తమకు వీళ్ళ నుంచి తగిన ప్రాధాన్యత లభించడం లేదని వాపోతూ వుంటారు. అసలు తమ వాళ్ళకి తప్ప, మిగతా వాళ్ళందరికీ వీళ్ళ మనసులో మొదటి స్థానం వుంటుంది. ఇటువంటి తల్లిదండ్రులు మారాలంటే ఈ క్రింది నియమాలు పాటించాలి.

1. తమకున్న మిత్రుల ఇన్ఫ్లుయెన్స్‌ను, చాలామందితో తమకున్న పరిచయాలను తమ పిల్లల ఉన్నతికోసం వాడుకుంటూ వుండాలి.

2. తమ పిల్లలు సాధించిన కార్యాలను ఎక్కువ మెచ్చుకుంటూ వుండాలి. తమ పిల్లలకన్నా అవతలి పిల్లవాళ్ళు ఎక్కువ విజయం సాధించినా కూడ దానిని గుర్తించనట్టే కనపడాలి. ఎప్పుడూ పక్కపిల్లవాడ్ని పొగడటం లాంటివి చేయకూడదు.

3. తమ పిల్లలముందే పక్కింటి పిల్లవాళ్ళతోనో, బంధుమిత్రుల పిల్లలతోనో అవసరమైనదానికన్నా ఎక్కువ చనువుగా వుంటే, మన పిల్లలలో ఈర్ష్య, అసూయలు పెరగడానికి ఆస్కారం వుంది. 'తామెంతో, బయటివాళ్ళు కూడ అంతే' అన్న ఫీలింగ్ పిల్లలలో కలగకుండా వుండటానికి వీళ్ళు ప్రయత్నించాలి.

4. సమయం యొక్క విలువ తెలుసుకోవాలి. చివరికి పిల్లలతో లోకాభిరామాయణం మాట్లాడాల్సి వచ్చినా సరే ఎంతవరకు ఉపయోగపడుతుంది అని ఆలోచించాలే తప్ప "స్కూల్లో ఎన్ని గంటలకు లంచ్? మీ బెంచీలో ఎంతమంది పిల్లలు కూర్చుంటారు?" లాంటి చవకబారు టాపిక్స్‌తో సమయం వృధా చేయకూడదు.

5. తమకి అవసరం లేకపోయినా, చేతకాకపోయినా అవతలి వాళ్ళతో ఆ విషయం ఖరాఖండిగా చెప్పి, ఆ సమయాన్ని తమ భార్యా పిల్లలకోసం వినియోగించుకోవాలి. ఇదే స్త్రీలయితే పక్కింటి వాళ్ళతో కబుర్లు చెప్పే 'టైం'ని కొంత తగ్గించుకుని, తమ పిల్లల కోసం వినియోగించవలసి వుంటుంది.

6. సాధారణంగా ఇటువంటి వాళ్ళని పక్కింటివాళ్ళు, వీధిలోవాళ్ళు ఎక్కువగా మెచ్చుకుంటుంటారు. కాబట్టి అటువైపు ఆకర్షితులయ్యే ప్రమాదం వుంది. 'మెచ్చుకోవటం' అనేది వాళ్ళకి సహాయం చేసినప్పుడో అందువల్ల అవతలివాళ్ళకి లాభమే తప్ప నష్టం లేదు కనుక మెచ్చుకుంటూనే వుంటారు. దానివల్ల తమకొచ్చే లాభమేమీ లేదు కనుక ఆ సమయాన్ని తమ పిల్లలకోసం వినియోగించుకోవాలని ఈ తరహా తల్లిదండ్రులు తెలుసుకోవాలి.

7. తమ పిల్లలు తమని ఎంతగానో ప్రేమించాలనే ఉద్దేశ్యంతో ప్రవర్తించకూడదు.

మర్యాద రామన్నలు :

చాలామంది తల్లిదండ్రులు 'మర్యాద రామన్న'ల్లాగా మంచిగా, ధర్మంగా, నిజాయితీగా వుంటారు. వీళ్ళకు సరదా అంటే అస్సలు గిట్టదు. స్నేహితుల చుట్టూ తిరిగే అలవాటు వుండదు. వీళ్ళకుండే స్నేహాలన్నీ 'గంగిగోవుపాలు గరిటెడైనా చాలు' అన్నట్లుగా వుంటాయి. వీరు అవసరమైన చోటకన్నా, అనవసరమైనచోట ఎక్కువ నిజాయితీగా వ్యవహరిస్తారు. చాలామంది మిత్రులతో తిరగడంకన్నా, కేవలం ఒకరిద్దరు మిత్రులతో ఎక్కువ క్లోజ్‌గా వుండిడం మంచిదనుకుంటారు.

వీరు మంచి శ్రోతలు. ఆఖరికి కూరగాయల వాడొచ్చి తమ సమస్యలు చెప్పినా, చాలా ఏకాగ్రతతో ఆ సమస్యని పరిష్కరించడానికి పూనుకుంటారు. కుటుంబ సభ్యుల, మిత్రుల, మిత్రుల భార్యల సమస్యలు విని సానుభూతితో స్పందిస్తారు.

నిజాయితీగా వుండటం మంచి లక్షణమే. కానీ అవసరమైన దాని కన్నా అతిగా వుండే నిజాయితీ ఎవరికీ లాభించదు. వీరు ఇతరుల గాథలు విని, వాటిని పరిష్కరించడంలో చూపే 'ఇన్వాల్వ్‌మెంట్', సొంత కుటుంబసభ్యుల పట్ల వుండదు. కొడుకు వచ్చి సమస్య చెప్పుకున్నా, రోడ్డుమీద పోయే ఐస్‌ఫ్రూట్ వాడొచ్చి సమస్య చెప్పుకున్నా ఒకే రకంగా స్పందించడంవల్ల, వీరి పిల్లలకి వీరిపై తగినంత ప్రేమానురాగాలు వుండవు. అదీకాక వీళ్లు కేవలం సమస్య వింటారేతప్ప, ఆ సమస్యలకి పరిష్కార మార్గాలు చెప్పరు. ఒకవేళ చెప్పినా అవతలివాడు ఆచరించ డానికి వీలుగా వుండవు.

దురదృష్టవశాత్తు మూర్తీభవించిన నిజాయితీతో వుండే భర్తలకి, సరదాగా వుండే భాగస్వాములొస్తే యిక వాళ్ళకి గృహం నరకప్రాయమే అవుతుంది. భార్యతో కలసి సరదాగా ఏ సినిమాకో, గుడికో వెళ్ళవలసిన టైములో అదే వీధిలో వున్న ఒకాయన భార్య పుట్టింటికి వెళ్ళిపోయిం దంటే, ఆవిడని తీసుకురావడానికి తోడు రమ్మంటే, పెద్దమనిషి లాగా ఆ విషయంలో సాయం చేసేందుకు అవతలి ఊటికి ప్రయాణమవుతాడు. ఇతరుల సమస్యల్ని పరిష్కరించడంలో వున్న ఆనందం తమ వాళ్ళకి ఆనందాన్ని పంచడంలో వుండదు. ఈ విషయంలో వీళ్ళకీ 'సంబరాల రాంబాబు'లకి కాస్త పోలిక వుంది.

వీళ్ళు పిల్లల విషయంలో ఏ కష్టమొచ్చినా చాలా తీవ్రంగా స్పంది స్తారు. ఇటువంటివాళ్ళ పిల్లలు, అన్ని వసతులూ అమరటంవల్ల స్వయంగా ఏ పనీ చేసుకోలేక, అన్నిటికీ అవతలవారిపై ఆధారపడేలాగ తయారవు తారు. ఇలాంటి తల్లిదండ్రులు పిల్లల్ని బాగా పెంచాలంటే ఈ క్రింది అలవాట్లు అలవరచుకోవాలి.

1. ఎవరి సమస్యైనా ఓపికగా వినే గుణం వుంది కాబట్టి, తమ పిల్లలు భార్య చెప్పే విషయాలకి మరింత ప్రాముఖ్యత యివ్వటం నేర్చు కోవాలి.

2. తమ కుటుంబంలోని సభ్యులకి, వీధిలో వాళ్ళకన్నా ఎక్కువ ప్రాముఖ్యత యిస్తున్నామన్న విషయం తమ కుటుంబ సభ్యులకి తెలిసేలాగ చేయాలి.

3. తమ జీవితం మరీ యాంత్రికంగా మారకుండా అప్పుడప్పుడు కొత్త మార్పుకి అవకాశం ఇవ్వాలి.

4. తమ సొంత బాధలకు, బాధ్యతలకు, సమస్యలకుకూడ ప్రాముఖ్యత ఇవ్వాలి.

5. ఇతరుల కోసం బ్రతికినట్లు కాకుండా తమకోసం తాము బ్రతకాలి. ఆ ఇతరుల సమస్యలు వినడమే కార్యక్రమంగా పెట్టుకోకుండా, తమ సమస్యలనికూడ భార్యాబిడ్డలతో కలిసి చర్చించాలి.

భూతద్దం తల్లిదండ్రులు :

ప్రతి చిన్న విషయాన్ని వీరు గోరంతలు కొండంతలు చేస్తారు. మనం సంతోషంగావున్నామా? మన కుటుంబం సంతోషంగా వుందా? ఇతర కుటుంబాలు సంతోషంగా వున్నాయా? ఇలాంటి భావాలు వీళ్ళకు ఎప్పుడూ కలుగుతుంటాయి. వీరు ప్రతి చిన్న విషయాన్నీ నమ్ముతుంటారు. ప్రతి విషయాన్ని ఒక పరిధిలో ఆలోచిస్తుంటారు. ఎప్పటికప్పుడు వీరు తమకి, తమ పిల్లలకీ సరిహద్దులు నిర్మిస్తుంటారు. ఉదాహరణకి స్కూల్ తరువాత పిల్లలు ట్యూషన్ కెళ్ళాల్సి వుంటే, ఆ ట్యూషన్ స్కూల్ కి చాలా దూర మయితే వాహనం కావాలి. ఈ రవాణా సమస్యని ఒక పెద్ద సమస్యగా చేసి, దాని గురించి నానాయాగిచేసి, తీవ్రంగా ఆలోచించి పరిష్కారాన్ని పొందుతారు. ఆ పరిష్కారం దొరికేవరకు వాళ్ళు మామూలుగా వుండరు, అవతలివాళ్ళని మామూలుగా వుండనివ్వరు.

వీరికుండే సున్నితమైన మనస్తత్వం మరెవరికీ వుండదు. వీరు ప్రతి పనీ క్రమబద్ధంగా జరగాలని అనుకుంటారు. వీళ్ళలో మళ్ళీ రెండు రకాలు. మొదటిరకం వాళ్ళతో పెద్ద చిక్కేమిటంటే వీళ్ళు గొప్ప

ఎస్కేపిస్టులు. సమస్యని ఎదుర్కోవడానికి బదులు అసలు సమస్యే లేదని భావిస్తుంటారు. రెండో రకం వాళ్ళు పై పేరాలో చెప్పినట్టుగా చిన్న విషయం కూడా పెద్దది చేస్తారు. ఉదాహరణకి 'ఈ రోజు సిటీబస్ స్ట్రయిక్ నాన్నా' అని పిల్లలు చెబితే, పిల్లల్ని స్కూల్‌కి ఎలా పంపాలా అని అర గంట ఆలోచిస్తారు. 'ఆటోలో పంపితే ఎలా? బంద్ రోజున ఆటోలపై రాళ్ళు రువ్వుతారేమో? తాము వెళ్ళి దింపితే వచ్చే నష్టమేమిటి?' ఇలా ఒక అరగంట ఆలోచనలు చేసి, చివరికి పిల్లల్ని ఆ పూట స్కూలు మానేయ మనే సలహాతో ఆ సమస్యకు పరిష్కారం చూపిస్తారు.

ఒక ఆర్కిటెక్ట్ తను గీచిన ప్లాన్ తూచా తప్పకుండా ఒక బిల్డింగ్‌ని కట్టడానికి ఎలా ప్రయత్నిస్తాడో, అలాగే వీళ్ళు కూడా తాము చేసే ప్రతి పనీ సక్రమంగా, క్రమశిక్షణతో, ఒక పద్ధతిలో చేయాలని కోరుకుంటారు. ఇలాంటి తల్లిదండ్రులు ఈ గ్రూపులోకి వస్తారు. వీరికి, నియంతల వైపు తల్లిదండ్రులకి తేడా ఏమిటంటే - నియంతలు తాము పట్టిన కుందేలుకు మూడేకాళ్ళని వాదిస్తే, వీళ్ళు తామసలు కుందేలునే పట్టలేదనే భావంతో పనిచేయటం ప్రారంభిస్తారు.

వీరెప్పుడూ 'మనం సరదాగా వున్నామా? మనమసలు ఎంజాయ్ చేస్తున్నామా?' అనే ప్రశ్నలు వేసుకోనే వేసుకోరు. ఈ పని సక్రమంగా చేస్తున్నామా, లేదా? అని మాత్రమే ప్రశ్నించుకుంటారు. ఉదాహరణకి వీళ్ళు ఒక కొత్తరకం వంట పుస్తకం చూసి నేర్చుకుంటే అందులో యేం వుంటే అదే చేస్తారు తప్ప కొద్దిగా స్వంత తెలివి ఉపయోగించడానికి గాని, కొత్త ప్రయోగం చేయడానికిగానీ ఉత్సాహం చూపించరు. ఈ వైపు స్త్రీలు గర్భవతులు అయితే డాక్టరు దగ్గరకు వెళ్ళడం దగ్గిర నుంచి ఏ టైంలో ఏ టాబ్లెట్ వేసుకోవాలనే విషయం వరకు సరిగ్గా నిమిషాలు, సెకన్లతోసహా కరెక్టుగా అమలుపరుస్తుంటారు. 'పిల్లల్ని యెలా పెంచాలి?

ఏం చదివించాలి? కట్నమెంత ఇవ్వాలి? అన్న విషయాలు కూడ గర్భవతులుగా వున్నపుడే ఆలోచిస్తారు.

ఇలా పర్ఫెక్ట్‌గా, పద్ధతిగా వుండే తల్లిదండ్రులతో పిల్లలకు సమయం క్రమశిక్షణ, వాటి విలువ తెలుస్తాయే తప్ప-జీవితంలో ఆనందం వుండదు. ఎక్కడికైనా పార్టీకిగాని, మీటింగ్‌కు గాని వెళ్ళాలనుకుంటే కరెక్టుగా ఆ టైంకే వెళతారు. ప్రతి శనివారం సినిమాకి వెళ్ళాలనే నియమం వుంటే శనివారమే వెళ్ళాలి తప్ప, ముందు రోజు చూడాలనిపించినా చూడటానికి వీళ్ళతో వీలుపడదు.

ఇలాంటి తల్లిదండ్రుల పిల్లలు, ఒక విధంగా అన్ని అవసరాలు సమయానికి అమరుతుండటం హాయిగానే వున్నా, ఆ తల్లిదండ్రులు మాత్రం ఎంతో భారాన్ని ఫీలవుతూ వుంటారు. ఏ మాత్రం పొరపాటు జరిగినా, ఆందోళన పెరిగి ఆరోగ్యం దెబ్బతినే పరిస్థితి ఏర్పడుతుంది. వీళ్ళకు ఒక్కొక్కసారి సమస్య ఎక్కువై భార్యా పిల్లలమీద కోపం వచ్చినా కూడా మౌనాన్ని ఆశ్రయిస్తారు తప్ప కోపాన్ని వెలిగక్కరు. ఇలాంటి తల్లిదండ్రుల్లో మంచి మార్పు తీసుకు రావాలంటే—

1. తాము నిర్మించే సరిహద్దులు ఎంతవరకు సమంజసమో వీరే ఆత్మవిమర్శ చేసుకోవాలి.
2. పిల్లల సమస్యలను పిల్లలు ఎలా ఎదుర్కోవాలో నేర్పాలి తప్ప, క్రమశిక్షణ పేరుతో సరిహద్దులు గీయకూడదు.
3. వంటింట్లోకి రాకూడదు....పగలు పక్క ఎక్కకూడదు....ఇలాంటి స్ట్రిక్టు ప్రిన్సిపుల్స్‌ని సాధ్యమైనంతవరకు వదులుకోవాలి.
4. వీళ్లు పిల్లల్ని పెంచడమనే పాఠాన్ని కిండర్‌గార్డన్ స్థాయినుంచి నేర్చుకోవాలి.
5. తమని పొగిడేవాళ్ళే స్నేహితులు, తమని విమర్శించేవాళ్ళు శత్రువులు అన్న భావాన్ని విడిచిపెట్టాలి.

6. విపరీతమైన శుభ్రతతో 'ఇల్లు యెప్పుడూ నీటుగా వుండాలి' అన్న ధోరణిని వదిలిపెట్టి, 'చిన్నపిల్లలున్నప్పుడు కొంత సర్దుబాటు తప్పదు' అన్న అలవాటు చేసుకోవాలి.

7. ఇతరుల్లో అన్నీ మంచి గుణాలేవుండి, ఒక్కటే చెడ్డగుణం వుంటే- ఆ ఒక్క గుణాన్నే భూతద్దంలో చూసి ద్వేషించకుండా, మంచి గుణాలు చూసి ప్రేమించే అలవాటు చేసుకోవాలి.

8. ఏదైనా ఒక సమస్య వచ్చినపుడు, ఇతరులతో విభేదించాల్సి వస్తే అలా విభేదించడం వివాదానికి దారి తీస్తుందని, మౌనాన్ని ఆశ్ర యించకూడదు. నిర్లిప్తంగా వుండడం మంచిదని అనుకోకూడదు.

* * *

ఇలా నాలుగు రకాల తల్లిదండ్రుల మనస్తత్వాల్ని మనం విశ్లేషించి చూపాం. ప్రతి తల్లీ - తండ్రీ ఏదో ఒక వర్గానికి చెందినవారై వుంటారు. కాంబినేషన్స్ ఒక్కోసారి విపరీతంగా వుంటే ఆ పిల్లలకి యిక నరకమే. మర్యాద రామన్న తండ్రి, నియంత తల్లి భార్యాభర్తలయితే ఆ యింట్లో తల్లే పిల్లల్ని కంట్రోల్ చేస్తుంది. సంబరాల రాంబాబు తండ్రి, భూతద్దం తల్లి భార్యాభర్తలయితే పొద్దున్నే తండ్రి చదివి పారేసిన పేపర్ తీయడం నుంచి, సాయంత్రం ఆయన కంచం తీయడం వరకు ఆవిడ సణుగుళ్ళే ఆ ఇల్లంతా ప్రతిధ్వనిస్తుంటాయి.

తల్లితండ్రుల్లో ప్రతివారూ యీ నాలుగు కేటగిరిల్లో ఏదో ఒకదానికి చెందుతారని కూడ అనుకోనక్కరలేదు. ఒక కేటగిరిలో కొన్ని గుణాలు, మరొక కేటగిరిలో మరికొన్ని గుణాలు వున్న మిక్స్‌డ్ క్వాలిటీస్ వ్యక్తులు కూడ వుండవచ్చు.

ఒక్కొక్కసారి కాలం గడిచేకొద్దీ మనలో యెన్నో మార్పులొచ్చి మన వ్యక్తిత్వం మారుతూ వుండవచ్చు. సంబరాల రాంబాబు వైపులో వున్న తండ్రి కొంతకాలానికి నియంత వైపులోకి మారవచ్చు. అదే

విధంగా ఎప్పుడూ తనమాటే నెగ్గాలనుకునే తండ్రి, అనారోగ్య దృష్ట్యా అందరిమీద ఆధారపడే వాడవ్వచ్చు.

ఒక్కొక్కసారి మన అభిప్రాయాన్ని, మన వ్యక్తిత్వాన్ని, మన మనస్తత్వాన్ని పక్కన పెట్టి పిల్లలకు సహాయపడవలసి వుంటుంది. తప్పటడుగులు వేసే పిల్లలు ఇంట్లో వున్నప్పుడు, వాళ్ళకు హాని కలిగించే వస్తువులు వాళ్ళకు దూరంగా వుంచాలి. మనం ప్రతిదీ క్రమశిక్షణలో, పద్ధతిలో వుంచాలనుకోవడం తప్పవుతుంది. పిల్లలు ఎదిగేకొద్దీ మన వ్యక్తిత్వాన్ని ఒక స్థాయినుంచి, మరొక స్థాయికి పెంచుకోవలసి వస్తుంది.

పిల్లలు చిన్నవయసులో వున్నప్పుడు సంబరాల రాంబాబులా వుండే తండ్రి పిల్లలు పెద్దయ్యాక కొంత మర్యాద రామన్న వైపుకి మారవలసి వుంటుంది. పిల్లలు మరీ చేతుల్లోంచి జారిపోతున్నారని తెలిసినపుడు ఒక నియంత తండ్రిగా మారవలసి వుంటుంది. పిల్లలయొక్క అస్వాభావికమైన చర్యలపట్ల (ఉదాహరణకి పిల్లల నోట్ బుక్‌లో ప్రేమలేఖలు కనిపించినపుడు) భూతద్దం తల్లిదండ్రులుగా మారవలసి వుంటుంది. ఈ నాలుగు రకాల తల్లిదండ్రుల్లోను ఇది మంచీ, ఇది చెడూ అని లేదు. ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క స్వభావాన్ని ఆపాదించుకోవలసి వుంటుంది.

పిల్లలకి పదహారేళ్ళ వయసొచ్చి కాలేజీలోకి అడుగుపెడుతున్నపుడు "ప్రపంచమంతా బాగులేదు. మనమొక్కరమే బాగున్నాం" అనే ధోరణి, ఆవేశం, తిరుగుబాటు తత్వంలో వుంటారు. ఈ ఆవేశం, తిరుగుబాటు తత్వం మరీ ఎక్కువగా వున్నప్పుడు మనం నియంతలుగా వ్యవహరించకుండా మర్యాద రామన్నలాగానో, సంబరాల రాంబాబులాగానో వ్యవహరించవలసి వుంటుంది.

అంతా తమకే తెలుసు, పిల్లలకేమీ తెలియదు అన్న ధోరణిని ఒక వయసులో తల్లిదండ్రులు వదిలిపెట్టవలసి వుంటుంది. ఇప్పుడు జనరేషన్ మారింది. ఈ మారుతున్న జనరేషన్‌లో మన పిల్లలు నిశ్చయంగా

మనకన్నా తెలివైనవాళ్ళు, కష్టపడే వాళ్ళు, విషయం పరిజ్ఞానమున్నవాళ్ళు. అందువల్ల నియంతృత్వం పనికిరాదు.

**సమతుల్యత :**

జీవితంలో ప్రతి విషయం సజావుగా సాగిపోతుందన్న గ్యారంటీ ఏమీలేదు. ఒక్కోసారి మనకు తెలియకుండానే మన కుటుంబసభ్యుల సంబంధాల్లో సమతుల్యత దెబ్బతినవచ్చు. ఇలా సమతుల్యత దెబ్బతినడానికి ముఖ్యంగా రెండు కారణాలుంటాయి.

1. పెద్దలు పిల్లలకు తగినంత గుర్తింపు నివ్వకపోవడం.
2. పిల్లలకు అవసరమైన దానికన్నా ఎక్కువ స్వేచ్ఛ నివ్వడం.

**1. గుర్తింపు :**

ప్రతి వ్యక్తీ తన ఉనికినీ, తను చేసిన పనినీ ఇతరులు గుర్తించాలనుకుంటాడు. రామ్‌గోపాల్‌వర్మ సినిమా తీసినా, లతామంగేష్కర్ పాట పాడినా, మైకేల్ జాక్సన్ టీ.వీ. స్క్రీన్‌మీద కనబడ్డా అది కేవలం డబ్బు కోసమే కాదు. కోట్లు కోట్లు డబ్బు సంపాదించిన వాళ్ళు కూడ క్రీడారంగంలోను, రాజకీయరంగంలోను, మిగతా రంగాల్లోను రేయింబవళ్ళు కష్టపడటానికి కారణం ఈ గుర్తింపే.

మనిషిలో ఈ గుణం బాల్యదశనుంచే వుంటుంది. ప్రతి పిల్లవాడు తన కుటుంబంలో తనో ముఖ్యమైన, ప్రత్యేకమైన వ్యక్తిగా గుర్తింపు పొందాలని బాల్యదశనుంచే అనుకుంటాడు. ప్రతి పిల్లవాడు తన తల్లి, తన తండ్రి, తన ఇల్లు లాంటి భావనలతోనే పెరుగుతాడు. ఈ భావనకు తల్లీ తండ్రి సక్రమంగా తోడ్పడాలి. అప్పుడు పిల్లలు ఒంటరితనంతో బాధపడే అవసరం రాదు.

ఇంట్లో పెద్దవాళ్ళు తమనొక వ్యక్తిగా గుర్తించకపోతే ఆ పిల్లలు ప్రేమ రాహిత్యంతో బాధపడతారు. ఇక్కడొక ఉదాహరణ చెబుతాను.

సుధ అనే ఒక అమ్మాయి తల్లిదండ్రులు ఇద్దరూ ఉద్యోగస్తులు.

ఆ అమ్మాయి అన్నయ్య, అక్కయ్య కూడ చదువులో ఫస్ట్ వస్తుంటారు. చదువు విషయంలో ఈ అమ్మాయి సగటు విద్యార్థిని. కుటుంబంలో నలుగురూ కలిసి ఆ అమ్మాయిని ఆటపట్టించేవారు. సుధను అనాథాశ్రమం నుంచి తీసుకువచ్చి పెంచుకున్నామని అంటుండేవారు. నలుగురూ కలిసి నవ్వుకునేవాళ్లు.

అయినా సుధ తనొక ప్రత్యేక వ్యక్తినని, తనకొక ప్రత్యేకమైన వ్యక్తిత్వం వుందనే ఆత్మవిశ్వాసంతోనే పెరిగింది. దానికి కారణం ఆమె బామ్మ, తాతయ్యలే. స్కూల్‌నుంచి రాగానే సుధ బామ్మ తాతయ్యలతో స్కూల్లో జరిగిన విషయాలన్నీ చెప్పేది. బామ్మ బాధపడితే ఓదార్చేది. ఆ అమ్మాయి ఏదైనా విషయం సాధిస్తే మెచ్చుకునేది. సుధ క్రమంగా ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని సంతరించుకుంది. తాతయ్య, బామ్మలు సుధకు వాళ్ళ అమ్మా, నాన్న, అన్నయ్య, అక్కయ్యల పట్ల మంచి అభిప్రాయాన్నే కలగజేశారు. వాళ్ళకు సుధంటే ఇష్టమేనని, కేవలం అది డాంబికంగా ప్రదర్శించటం ఇష్టం లేకనే వాళ్ళలా ప్రవర్తిస్తున్నారని చెప్పి సుధలో ఆత్మవిశ్వాసాన్ని కలగజేసింది వాళ్ళ బామ్మ.

సుధ ఆత్మీయతతో, ఆత్మవిశ్వాసంతో పెరగడంవల్ల వైవాహిక జీవితం కూడ సుఖంగానే సాగింది.

తన పిల్లలకు కూడా ఇప్పుడామె ప్రేమనీ, ఆప్యాయతనీ ఇస్తుంది. అసలెవరూ పట్టించుకోకుండా, అందరిచేత నిర్లక్ష్యంపబడి వుంటే సుధ పరిస్థితి మరోలా వుండేది. 'నేను, నా ఇల్లు, నా కుటుంబానికి చెందిన వాడిని' అన్న అభిప్రాయం పిల్లలకు చాలా బలాన్నిస్తుంది.

## 2. అవసరమైనదానికన్నా ఎక్కువ స్వేచ్ఛ నివ్వడం :

పిల్లలు తల్లిదండ్రులిచ్చిన స్వేచ్ఛ కన్నా ఎక్కువ కావాలి అని కోరుకుంటారు. ఇలాంటి పరిస్థితిలో అవసరమైనదానికన్నా స్వేచ్ఛ ఎక్కువిస్తే పిల్లలు చెడిపోవటానికి అవకాశం చాలా వుంది. అసలివ్వకపోవడం

పిల్ల బాధ్యత తెలియకుండా పోవడం, ఆత్మవిశ్వాసాన్ని కోల్పోవడం కూడ జరుగుతుంది. చిన్నప్పుడు సరైన స్వేచ్ఛలేని పిల్లలు, పెద్దయ్యాక సరైన నిర్ణయాల్ని తీసుకోలేక సలహాకోసం ఎదురు చూస్తారు. ఒంటరిగా వుండడానికి భయపడతారు. పన్నెండేళ్ల దాటిన పిల్లలు ఒంటరిగా బస్‌లో గాని, రైల్లోగాని తప్పనిసరిగా ప్రయాణం చేయవలసి వచ్చినపుడు, అలా చెయ్యలేకపోతే వాళ్ళ తల్లిదండ్రుల పెంపకంలో ఏదో లోటుందన్నమాట. చాలామంది తల్లిదండ్రులు పదిహేనేళ్ల దాటిన పిల్లల్ని కూడా ఒంటరిగా ఒక ఊరినుంచి వేరే ఊరికి పంపడానికి భయపడతారు. ఇందువల్ల పిల్లల్లో ఆత్మవిశ్వాసం పూర్తిగా దెబ్బతింటుంది. ఎప్పుడూ ఎదుటివాళ్ళ సానుభూతి కోసం చూడటం, వాళ్ళ ప్రేమకోసం తపించిపోవడం చేస్తూంటారు.

పిల్లల్లో అవసరమైన పనిపట్ల ఇష్టాన్ని, పనిచేసే గుణాన్ని పెద్దలే కల్పించాలి. పనంటే - చేతకాని వాళ్లు చేసేది, డబ్బులకోసం చేసేది, అవసరమైన వాళ్ళు మాత్రమే చేసేది, అన్న భావం పిల్లల్లో కలిగితే పెద్దయ్యాక కూడా వాళ్ళు సోమరిపోతులుగా తయారయ్యే అవకాశముంది.

ఇక్కడొక ఉదాహరణ చెబుతాను. రాధికా వాళ్ళింట్లో కుటుంబ సభ్యులందరూ ఐకమత్యంగా వుంటారు. కలిసి టీ.వీ. చూస్తారు. కలిసి భోజనం చేస్తారు. ఇతరులకు వాళ్ళ ఐకమత్యాన్ని చూస్తే ముచ్చటగా వుంటుంది. రాధికకి మాత్రం తన ఇల్లు ఒక సాలెగూడులా అనిపిస్తుంది. దానిలోంచి తను బయటకు రాలేకపోతున్నానని బాధపడుతూ వుంటుంది.

రాధికని తల్లిదండ్రులు మాత్రమే వేరే ఇంటికి పోనిచ్చేవారుకాదు. 'మనింట్లోనే మనకి ఎన్నో పనులున్నాయి. ఇంక వేరేవాళ్ళతో తిరగడానికి తీరికెక్కడుంది' అని ఆంక్షలు పెట్టేవారు. ఆమె ఎక్కడికెళ్ళినా ఇంట్లో వాళ్ళతోనే కలిసి వెళ్ళాలి, స్నేహితులతో కలిసి సరదాగా పార్క్‌కి కూడా వెళ్ళే అవకాశం లేదు. రాధికకి క్రమక్రమంగా తమతోటి పిల్లలంటే

భయం, బెరుకు ఏర్పడింది. తన కుటుంబ సభ్యులతో తప్ప ఇంకెవ్వరి తోనూ వుండలేకపోయేది. అలాగే పెరిగి పెద్దదైంది.

రాధిక ఉద్యోగంలో చేరాక ఎవరితో ఎలా మాట్లాడాలో తెలియక అందరితోను ముభావంగా వుండేది. రాధిక గర్విష్టి, 'అహంభావి' అనే టైటిల్స్ అందరూ ఆమెకి ఇచ్చేసారు. రెండు, మూడు నెలల్లోనే ఆమె ఉద్యోగానికి రాజీనామా చేయవలసి వచ్చింది.

తనకో వ్యక్తిత్వం, స్వతంత్రం లేదని, తననలా తయారుచేశారని ఆ అమ్మాయికి తెలియదు. చివరికి రాధికకి పెళ్ళయింది. ఆమె పూర్తిగా అన్ని విషయాల్లో భర్తమీదే ఆధారపడవలసి వచ్చింది.

దీనికి పూర్తిగా వ్యతిరేకమైన మరొక ఉదాహరణ చెబుతాను.

రమేష్ తల్లిదండ్రులు జీవితంలో కష్టపడి పైకొచ్చినవాళ్ళు. వాళ్ళకి 'విశ్రాంతి' అనే పదానికి అర్థం తెలియదు. పిల్లలతో కూడ అస్తమానం యేదో ఒక పని చేయిస్తూ వుండేవాళ్ళు. ఇప్పుడు రమేష్ నలభై ఏళ్ళనిండా యనుకుందాం. అయినాకూడా ఇన్నేళ్ళలో తను వాళ్ళతో ప్రేమగా మాట్లాడిన సందర్భాలుకాని, తను వాళ్ళని కాని, వాళ్ళు తననుకాని మెచ్చుకున్న సందర్భాలులేవు. తండ్రీ కొడుకుల మధ్య సంబంధం కేవలం పని, డబ్బు మాత్రమే.

రమేష్ స్కూల్ జీవితంలో ఒక సంఘటన జరిగింది. రమేష్‌కంటే సీనియర్స్ కొందరు అతనిని అటపట్టించేసరికి, సహజంగా ఆవేశపరుడైన రమేష్ అందులో ఒకణ్ని కొట్టాడు. వాళ్ళందరూ కలిసి రమేష్‌ను బాగా కొట్టి వీధిలో పడేసి వెళ్ళిపోయారు. తలకూ, మొఖానికీ బాగా దెబ్బలు తగిలిన రమేష్ ఊపిరాడక రోడ్డుమధ్యలో కూర్చొని వెక్కి వెక్కి ఏడవటం మొదలుపెట్టాడు. తల పక్కకి తిప్పిచూస్తే తన యింటి వరండాలో తనతండ్రి నుంచొని తనవైపే చూస్తుండడం కనపడింది. ఇన్ని దెబ్బలు తిని తను బాధపడుతుంటే, ఇదంతా చూస్తూ కూడా తండ్రి, తనకు

సహాయం చేయకపోవటంతో, తండ్రి దగ్గిరకు వెళ్ళి "నువ్వెందుకు నాకు సహాయానికి రాలేదు" అని అడిగాడు.

ఇంట్లోకి వెళుతున్న తండ్రి అతనితో "ఇది నీకు గుణపాఠంగా భావించు. నీ బాధను నువ్వే పడాలి. ఎవ్వరూ నీకు సహాయం చేయరు" అన్నాడు. తనకు సంబంధించిన అన్ని పనుల్లో తనే నిర్ణయాలు తీసుకోవలసి రావటం, అన్ని పనులూ తనే స్వయంగా చేసుకోవలసి రావటంతో అతనికి ఏ పనైనా స్వంతంగా చేయగల శక్తి వచ్చింది. కానీ రెండవవేపు నుంచి ఒక దురదృష్టకరమైన పరిణామం రమేష్‌కి ఏర్పడింది. చిన్నప్పటి నుంచి అన్ని బాధలను తనొక్కడే ఎదుర్కోవలసి రావడంతో అతనిలో ప్రేమరాహిత్యం మొదలైంది. ఎవర్నీ నమ్మేవాడు కాదు. 'ప్రేమ ఇవ్వడం తీసుకోవడం కూడ ఒక బిజినెస్' అన్న మనస్తత్వం అతనిలో డెవలప్ అయిన తరువాత ఒక 'ఇంట్రావర్ట్'గా మారిపోయాడు. అదృష్టవశాత్తు భార్య చాలా అనుకూలవతి అవడంతో ప్రేమ, ఆప్యాయతలు వంచి ఇవ్వడంతో అతనికి మానవతా విలువలు తెలిసి తండ్రియొక్క ప్రభావం నుండి క్రమక్రమంగా బయటపడ్డాడు. ఒకవేళ అతని భార్య కూడా అతని లాగా మెటీరియలిస్ట్ అయ్యుంటే ఆ సంసారం పూర్తిగా నాశనం అయ్యుండేది.

ఈ రెండు ఉదాహరణల్లో ఒకటి అవసరమైనదానికన్నా ఎక్కువ ఆప్యాయత నివ్వడం, రెండవది అవసరమయినంత ఆప్యాయత నివ్వక పోవడం. ఈ రెండూ తప్పే.

ఇదే ఉదాహరణలో తన భార్య మాటి మాటికీ పుట్టింటికి ఫోన్ చేయడం, మాట్లాడటం, రమేష్‌కి విచిత్రంగా అన్పించేది. తల్లిదండ్రులతో పిల్లలు అంత సన్నిహితంగా వుంటారనీ, అవతలి వాళ్ళకోసం యివతలి వాళ్ళు అంతగా తపించిపోతారనీ రమేష్‌కి ఇరవై అయిదేళ్ళ తరువాత మొట్టమొదటిసారి తెలిసింది. అతనికి యీ ప్రేమ చాలా గొప్పగా కనిపిం

చింది. తన తండ్రి పెంపకంలో అలవడిన వ్యక్తిత్వం ఒకవేపు, తన భార్య పంచిచ్చిన ప్రేమ మరొకవేపు—ఈ రెండింటితో మొదట్లో సమతుల్యం కాకపోయినా, తరవాత్తరువాత ఆ జీవితానికి అలవాటుపడి అందులో వుండే ఆనందాన్ని ఆస్వాదించసాగాడు.

ఇప్పుడు మరొక ఉదాహరణ చెబుతాను. లక్ష్మి, కమల ఇద్దరు స్నేహితురాళ్లు. లక్ష్మి చిన్నప్పటినుంచి తల్లిదండ్రుల పెంపకంలో ఒక వ్యక్తిత్వం వున్న అమ్మాయిగా రూపుదిద్దుకుంది. తనేంటో, తనేం చేయాలో, భర్తని ఎలా సుఖపెట్టాలో ఆ అమ్మాయికి కరెక్టుగా తెలుసు. గ్రాడ్యుయేట్ అయ్యింది. ఉద్యోగంలో జాయినయింది. తల్లిదండ్రులు చూపించిన సంబంధం చేసుకుంది. మొగుడు తాగుబోతు. పెళ్ళికి ముందే అతనికి ఒక ఎఫైర్ వుంది. అత్తవారింటికి వెళ్ళిన లక్ష్మిని అత్తమామలు బాగా హింసించసాగారు. మరింత కట్నం తెమ్మని బలవంతం చేయసాగారు. మరొకవేపు భర్త అనాదరణ. పూర్తి వ్యక్తిత్వమున్న లక్ష్మి ఆ యింట్లో ఇమడలేకపోయింది. వారితో దెబ్బలాడి బయటికొచ్చేసింది. అప్పటికే ఆమె గర్భవతి. మళ్ళీ కష్టపడి ఉద్యోగం సంపాదించుకొని పిల్లవాణ్ని కంది. భర్తనుండి విడాకులు తీసుకుంది. ప్రస్తుతం ఒంటరిగా వుంది.

ఆమె స్నేహితురాలైన కమల తల్లిదండ్రుల యొక్క పూర్తి రక్షణలో బొత్తిగ వ్యక్తిత్వం లేకుండా పెరిగింది; ఇంటర్మీడియెట్ ఫెయిలైంది. అప్పటికే ఆమెకి ఒకరిద్దరు బాయ్‌ఫ్రెండ్స్ వున్నారు. తరువాత మూడో వ్యక్తిని ప్రేమించి పెళ్ళిచేసుకుంది. ఆ భర్త ఆమెని చాలా అనురాగంగా చూసుకుంటాడు. అత్తా-మామలు కూడ బాగా చూసుకుంటారు. ఆమె యిప్పుడు ముగ్గురు పిల్లలతల్లి. పుట్టింటికొచ్చినా కూడా భర్తగురించే మాట్లాడుతుంటుంది. జీవితం సజావుగా సాగిపోతోంది.

ఈ రెండు ఉదాహరణల్లో, లక్ష్మి తన వ్యక్తిత్వంతో అష్టకష్టాలు

పడ్డట్టు, కమల ఏ వ్యక్తిత్వం లేకుండా పెరిగి, భర్త పీడన హాయిగా బ్రతికినట్లు కనబడుతుంది. కాని మీరు యింకొక రకం ప్రాబబిలిటీని ఆలోచించి చూడండి. లక్ష్మికి కమల భర్త, కమలకి లక్ష్మి భర్త వచ్చారనుకోండి. అప్పుడు లక్ష్మి యిప్పుడున్నంత ఆనందంగానే జీవితం గడుపుతుండేది. కమల మాత్రం భర్త తాగుబోతయి, అంతకుముందే ఒక ఎఫైర్ ఉన్నవాడై; అత్తమామలు హింసించేవారైతే ఆత్మహత్య చేసుకుని చనిపోయుండేది.

కాబట్టి అదృష్టం అనేది అన్నిటికన్నా చివరగా జీవితగమ్యాన్ని నిర్దేశించేది. అది బలమైంది. మనిషి తన వ్యక్తిత్వం ద్వారా అదృష్టాన్ని కూడా ఛాలెంజ్ చేయగలడు. లక్ష్మి అన్ని కష్టాలు వచ్చినా కూడా తన పిల్లవాణ్ని పెంచుకుంటూ, మరొకరెవరైనా మంచివాడ్ని తన జీవితంలోకి ఆహ్వానించడానికి ఎదురుచూస్తుంది. కమల ఆనందంగా వుండే వుండవచ్చు. కానీ ఆ ఆనందంలో ఆమె చేసిందేమీ లేదు. అంతా దేవుడు చేసింది మాత్రమే వుంది. దేవుడిమీద ఆధారపడి సుఖంగా బ్రతికే మనుషుల సంఖ్య రోజురోజుకి తగ్గిపోతుంది కాబట్టి మనం వ్యక్తిత్వాన్నే నమ్ముకోవాలి.

## అధ్యాయం - 4

# పిల్లలు - భవిష్యత్తు

రోజురోజుకీ మనిషి జీవితం సంక్లిష్టమౌతోంది. ఈ తరం పిల్లలు కాబోయే తరపు యువకులుగా మారే సమయానికి మనిషి తన మనుగడ కోసం, ఆనందంకోసం మరింత కష్టపడవలసి వస్తుంది. ధరల పెరుగుదల, టెర్రరిజం, సంకుచిత తత్వం మొదలైనవన్నీ రోజురోజుకీ పెరిగి పోతు న్నాయి. ఈ వాతావరణంలో ఆనందంగా బతకడం అన్న సంగతి పక్కన పెడితే, కనీసం బతకడంకూడా కష్టసాధ్యమవుతుంది. అటువంటి పరిస్థితుల్లో మన పిల్లలను ఈ ప్రపంచంమీదకి తెచ్చినందుకు, మిగతా వారికన్నా కొంతయినా ఆనందంగా బతికేలా చెయ్యడం తల్లిదండ్రులుగా మన కర్తవ్యం.

జీవితం అంటే పేపర్‌మీద దేన్నైనా కాపీ చేయడంకాదు. ఎన్నో ట్రిక్స్ కావాలి. లౌక్యం వుండాలి. ఆత్మవిశ్వాసం కావాలి. ఒక్కోసారి మనకి తగిలిన ఎదురు దెబ్బలనే మన విజయపు సోపానాలుగా మార్చు కోవాలి. పెరట్లో ఒక చెట్టు వేస్తేనే దానికి రోజూ నీరుపోసి, చిగురు వేసిందా లేదా, ఎదుగుతోందా అని పరిశీలిస్తాం. ఎరువులువేస్తాం. పురుగుల మందు చల్లుతాం. అటువంటిది పిల్లలని పెంచవలసి వచ్చినపుడు వాటినెలా పరిష్కరించుకోవాలో, సమస్యలని ఏ విధంగా ఎదుర్కోవాలో, జీవితంలో ఆనందాన్ని ఎలా అనుభవించాలో, తప్పలెందుకు చెయ్యకూడదో,మంచిలో వుండే ఆనందం ఏమిటో-ఇవన్నీ మనం చిన్నప్పుడే వాళ్ళకి తెలియ

జేయాలి. పిల్లలు మొక్కల్లాంటివాళ్ళు. మనం బాగా పోషిస్తే, బాగా పెరుగుతారు. లేకపోతే దుర్వ్యసనాల పురుగులుపట్టి పాడవుతారు.

ఏ యిద్దరు మనుషులకీ సమస్యలు ఒకేలా రావు. అలాగే ఒకే సమస్యపట్ల యిద్దరు వేర్వేరు వ్యక్తుల ప్రతిస్పందన యీ ప్రపంచంలో ఒకే విధంగా వుండదు.

మనిషి ప్రపంచంలో ఎన్నో సాధించగలిగాడు. సాంకేతికపరంగా, వైజ్ఞానికపరంగా కూడా. కానీ, బ్రెయిన్ కంప్యూటర్‌ని మాత్రం తయారు చేయలేకపోయాడు. దీనికి కారణం యేమిటంటే ఒక మనిషి స్వతహాగా ఆలోచించగలడు. తన సమస్యలను పరిష్కరించుకోగలడు. కొత్త కొత్త ఆలోచనలు చేయగలడు. ఎవరూ చెప్పనవసరం లేకుండానే స్వతహాగానే విషయాలు తెలుసుకోగలడు. కానీ, కంప్యూటర్ అలాకాదు. మనం ఏం చెప్తే అది చేస్తుంది. మనిషి మెదడుకీ, కంప్యూటర్‌కీ వున్న ఈ తేడాని తండ్రులు గ్రహించాలి. పిల్లల మెదళ్లు స్వతహాగా ఆలోచించగలిగే కంప్యూటర్ల లాంటివి. కొంత స్వభావసిద్ధమైన ఆలోచన వున్నా, మిగతా మాత్రం తల్లిదండ్రులు ఎలా నిర్దేశిస్తే ఆ విధంగా తయారవుతుంది.

ఉదాహరణకి, ఓ కుర్రవాడు సైకిల్‌మీద వెళ్తూ ఓ ముసలామెను ఢీకొన్నాడు. ఆ ముసలామె కిందపడి అక్కడికక్కడే వృద్ధాప్యం వల్ల వచ్చిన షాక్‌తో మరణించింది. అటువంటి పరిస్థితుల్లో ఆ కుర్రవాడు ఏం చెయ్యాలనేది తల్లిదండ్రుల పెంపకంమీద ఆధారపడి వుంటుంది. అక్కడనుంచి పారిపోవాలా, వెంటనే ముసలామె దగ్గరకెళ్ళి ఆమె పరిస్థితి గమనించాలా, నలుగురిని పిలవాలా, తను కూడా ఏడుస్తూ కూచోవాలా, ఇంటికి పరిగెత్తుకుంటూ వచ్చి తల్లిదండ్రులకు చెప్పాలా, లేక అక్కడే సైకిలొదిలేసి పరిగెత్తుకుంటూ వెళ్ళి ఏ ట్రెయినో ఎక్కి దూరప్రాంతాలకు పారిపోవాలా - ఇన్ని ఆలోచనలు ఒక కుర్రవాడి మనసులో కలుగుతాయి. ఇందులో యే నిర్ణయం తీసుకుంటాడనేది తప్పనిసరిగా తల్లిదండ్రుల

పెంపకంమీదే ఆధారపడి వుంటుంది. ఒకే సమస్యకి వేర్వేరు వ్యక్తులు వేర్వేరుగా స్పందించడం అంటే ఇదే.

పిల్లల్లో స్వభావసిద్ధంగా ఆప్యాయత, పెద్దలపట్ల ఇష్టం వుంటాయి. వాటిని చేజేతులా పెద్దలే చంపెయ్యకూడదు. కసురుకోవడం, తిట్టడం, వాళ్ళ తప్పులని చూపించి హేళన చెయ్యడం, కొట్టడంలాంటివన్నీ పిల్లల్లో వుండే అప్యాయతను చంపేస్తాయి.

పిల్లల్లో పెద్దలపట్ల ఎంత అనురాగం వుంటుందో చెప్పడానికి ఒక చిన్న కథ చెప్తాను.

రాము ఆ రోజు చాలా డల్‌గా వున్నాడు. ఎప్పుడూ దగ్గిర కూర్చోబెట్టుకొని కథలు చెప్పే తాతయ్య రెండ్రోజులనుంచీ అనారోగ్యంతో బాధపడుతున్నాడు. తాతయ్యకి ఉబ్బసం. బయట ఏ మాత్రం మబ్బు పట్టినా తాతయ్య ఆయాసంతో రొప్పుతూ, మాట్లాడలేకపోతాడు. రాము తల్లిదండ్రులు కూడా తాతయ్య ఆరోగ్యంపట్ల ఆందోళనగా వుంటారు. అందువల్ల ఆ యిల్లంతా విషాదం తాండవిస్తోంది. రెండ్రోజుల నుంచి ధారాపాతంగా వర్షం కురుస్తోంది. ఆకాశం కనబడకుండా మబ్బులు దట్టంగా కమ్మి వున్నాయి. చలిగాలి మూసివున్న కిటికీ తలుపుల సందుల్లోంచి బలంగా తోసుకువస్తోంది. అటువంటి పరిస్థితుల్లో తాతయ్యకి ఉబ్బసం రాక ఏం చేస్తుంది? డాక్టరొచ్చి తాతయ్యను పరీక్షిస్తుంటే, రాము మౌనంగా చేతులు కట్టుకు నిల్చున్నాడు. డాక్టరుబైటికొచ్చి రాము తండ్రితో, "పరిస్థితి విషమంగా వుంది. చలిగాలి లోపలికి రానివ్వద్దు. బ్లాంకెట్లు కప్పండి" అని చెప్పటం రాము విన్నాడు. డాక్టర్ వెళ్ళిపోయిన తర్వాత తన తల్లి తండ్రితో 'సూర్యుడు కాస్త కనపడినా బాగుండునండీ, మామయ్యగారి ఆరోగ్యం చాలా విషమించింది కదూ' అని చెప్పడం కూడా విన్నాడు. ఆ రాత్రి రాము పూజ గదిలోకి వెళ్ళి దేవుడిని మనసారా ప్రార్థించాడు. మర్నాడు పొద్దున్న రాము లేచేసరికి ఇంట్లో పూర్వపు ఆనందం తొణికిస

లాడుతోంది. రాము పరుగెత్తుకుంటూ తాతయ్యదగ్గర కొచ్చాడు. పూర్వం లాగ తాతయ్య ఈజీ చైర్లో కూర్చొని నవ్వుతూ రాముని పలకరించాడు. అంత హఠాత్తుగా తాతయ్యకి యెలా తగ్గిపోయిందో రాముకి అర్ధమైంది. రాము తండ్రి మాత్రం డాక్టరిచ్చిన మందులవల్ల తగ్గిపోయిందను కున్నాడు. రాము తాతయ్య పడుకున్న దిండు కిందనుంచి తను డ్రాయింగ్ వేసిన కాగితం తీసి అందరికీ చూపించాడు. ఆ కాగితం మీద ఒక సూర్యుడి బొమ్మ వుంది!.... ఇదీ కథ.

కాబట్టి, పిల్లలు తమ పరిధిలో తాము పెద్దలకి ఏదో చెయ్యాలి అనుకుంటూ వుంటారు. ఇలాంటి కోర్కెని సాఫల్యపరిచే బాధ్యత కూడా తల్లిదండ్రులే తీసుకోవాలి. ఉదాహరణకి, ఆరోతరగతి చదువుకున్న కుర్ర వాడిని, "నీ సొంత డబ్బులతో నాకు యేదేనా ఒక ప్రజంటేషన్ కొని తీసుకురా" అని ఒక తండ్రి అడిగితే, తండ్రి లాల్చీ బొత్తాములైనా సరే తన సొంత డబ్బులతో ఆ పిల్లవాడు కొనిపెడితే ఆ తండ్రి సంతోషించి నట్టు కనపడాలి. ఎందుకంటే ఆ పిల్లల స్థాయికి రెండు రూపాయలు సంపాదించడంకూడ కష్టమే. ఇలా సంపాదించడంవల్ల సంపాదనయొక్క కష్టం, డబ్బుకున్న విలువ రెండూ తెలుస్తాయ్. అప్పుడు వాళ్లు దుబారా చెయ్యరు.

పదవ తరగతి కానీ అంతకంటే పైక్లాసు కానీ చదువుకునే కుర్ర వాళ్ళెవరైనా వుంటే, వాళ్ళకన్నా చిన్నపిల్లలకి ట్యూషన్ చెప్పే బాధ్యత అప్పగించాలి. అలా అప్పగించటం ద్వారా తాము మర్చిపోయిన చిన్న క్లాసు పాఠాలు మళ్ళీ చదివే అవకాశం వుంటుంది. అదీకాక, ఒక రెస్పాన్సి బుల్ స్థానాన్ని తమకు తామే ఆపాదించుకుంటారు. పక్కింటివాళ్ళూ, పొరుగింటివాళ్ళూ ఇచ్చే ట్యూషన్ ఫీజు కూడా ఈ పిల్లల్లో ఆత్మవిశ్వా సాన్ని కలగజేస్తుంది. నేను ఖమ్మంలో ఎనిమిదవ క్లాసు చదివేటప్పుడు,

నాలుగో క్లాసు పిల్లవాడికి ఆరు నెలలు పాఠం చెప్పి ఇరవైనాలుగు రూపాయలు సంపాదించాను-అని ధీమాగా చెబుతారు.

**చదువు - భవిష్యత్తు :**

నేనెప్పుడూ ఫస్ట్‌క్లాస్ కోసం గానీ, ఫస్ట్ రాంక్ కోసంగానీ నా చదువులో ప్రయత్నించలేదు. అలాగే పదవ తరగతి పాసయిన మా అబ్బాయికి ఐను వందల పన్నెండు మార్కులు వచ్చాయనీ, స్టేట్ రాంక్ కన్నా కేవలం ఇరవై మార్కులే తక్కువని నేను సంతోషించ లేదు. అతన్ని 'యంసెట్' వైపు వెళ్ళకుండా కామర్స్ చదవమన్నాను. ఎంసెట్ చదివి నాలుగేళ్ళ చదువు పూర్తిచేసి ఒక ఇంజనీరుగానో, ఒక డాక్టరుగానో అతను ఎంత స్థానాన్ని పొందుతాడో, ఎంత డబ్బు సంపాదిస్తాడో అంతే స్థానాన్నీ, డబ్బుని కామర్సులో కూడ పొందవచ్చని నేను అభిప్రాయపడ్డాను. వాడికి అయిదువందల పన్నెండు మార్కులు రాకుండా, నాలుగువందల ఎనభై య్యే వచ్చి మిగతా విషయాలపట్ల అనురక్తి, విషయ పరిజ్ఞానం, ఉత్సాహం, ప్రావీణ్యత వుండి నేను తండ్రిగా మరెంతో సంతోషించి వుండేవాడిని. పదేళ్ళ వయసులోనే వాడిచేత హైనెస్ నుంచి ఇర్వింగ్‌వాలెస్ వరకు, ఆర్థర్ క్లాక్ నుంచి జెఫ్రీ ఆర్చర్ వరకు చదివించాను. దురదృష్టవశాత్తు ఆటల్లో ఏ ప్రావీణ్యత సంపాదించలేక పోయాడు. ఒక పిల్లవాడియొక్క గొప్పతనమంతా 'అతడికెన్ని మార్కులొచ్చాయి' అన్న విషయం మీద ఆధారపడి వుండదని నేను గాఢంగా విశ్వసిస్తాను.

అందరూ మేధావులుండే ఒక గ్రూపులో వుండడంకన్నా, అంతకు కొద్దిగా తక్కువ స్థాయిలో వుండే గ్రూపులో వుండడంవల్ల ఒక తెలివైన స్టూడెంట్ నెంబర్ వన్‌గా భాసిల్లడానికి ఎక్కువ స్కోపుంది. అలాగే అన్ని రాంక్‌లు, ఫస్ట్ క్లాసులు వచ్చే కాలేజీలో చదవటంకన్నా, సెకండ్, గ్రేడ్ స్థాయిలో పరీక్షలు పాసయ్యే విద్యార్థులున్న కాలేజీలో మీ కుర్ర

వాడుండి, ఫస్ట్‌క్లాస్ తెచ్చుకుంటే, మార్కుల మాట అటుంచి, అందరికన్నా నేను గొప్పవాడిని అనే ఆత్మవిశ్వాసం వాడిలో పెరుగుతుంది. ఇది ముందు ముందు జీవితంలోను, ఆఫీసులోను చాలా బాగా పనిచేస్తుంది. అందువల్ల పెద్ద పెద్ద డొనేషన్లు చెల్లించి, మంచి స్కూళ్ళలోనే చేర్పించాలనే అభిప్రాయాన్ని తల్లిదండ్రులు వదులుకోవాలి,

లిటిల్ ఫ్లవర్స్, హైదరాబాద్ పబ్లిక్ స్కూల్, భారతీయ విద్యా భవన్ లాంటి అన్ని స్కూళ్ళలోనూ మా అబ్బాయికి సీటు వచ్చినా నేను మా అబ్బాయిని అక్కడ చేర్పించే ప్రయత్నమేమీ చేయలేదు. అలాగే ఇంటర్మీడియెట్ చేర్పించేటప్పుడు కూడ ఏ పెద్ద కాలేజీలోనో చేర్పించడానికి నేను ఉత్సాహం చూపించలేదు. మనం చదివే చదువుకీ, కాలేజీకి ఏ సంబంధమూ లేదని నేను విశ్వసిస్తాను.

**పిల్లలు - సాంకేతిక పరిజ్ఞానం :**

పైన చెప్పిన విధంగా పిల్లల్ని కేవలం చదువులోనే పరిపూర్ణుల్ని చేయడానికి తండ్రులు ఉత్సాహపడకూడదు, సాంకేతిక పరిజ్ఞానమంటే పెద్ద పెద్ద విషయాలేం కాదు. గడియారం పాడయితే బిగించడం, టేప్ రికార్డర్ క్యాసెట్‌లో టేప్ తెగిపోతే తిరిగి దాన్ని అతికించడం....ఇలాంటి చిన్న చిన్న విషయాల్ని తమంతట తాము బాగుచేసుకునేలాగ పిల్లలకి చిన్నప్పటినుంచే ట్రయినింగ్ ఇవ్వాలి. అలాంటి ట్రైనింగ్ పిల్లలు పెద్ద వాళ్ళయ్యాక ఎలాంటి సమస్యనైనా తార్కికంగా ఆలోచించి పరిష్కరించ గలిగే నైపుణ్యాన్నిస్తుంటే బహుశ మీకు ఆశ్చర్యం కలగవచ్చు.

ఒకసారి డ్రాయింగ్ టీచర్ సైకిల్ బొమ్మ వెయ్యమన్నప్పుడు పిల్లలెవ్వరూ ఆ బొమ్మ సరిగ్గా వెయ్యలేకపోయారు. చిత్రమేమిటంటే ఆ క్లాస్‌లో వుండే పిల్లల్లో డెబ్బయ్ శాతం, రోజూ సైకిల్ మీద స్కూల్ కొస్తారు. చదువుతోబాటు ఇతర విషయాలను కూడా నిశితంగా పరిశీలించే పిల్లలు బొమ్మను సరిగ్గా వేయగలిగారు.

కేవలం చదువు తప్ప ఇతర విషయాలను పట్టించుకోని పిల్లలు బొమ్మను సరిగా వెయ్యలేకపోయారు. పిల్లల దృష్టెప్పుడూ చదువు మీదే వుండి మిగతా విషయాలన్నీ పట్టించుకోకపోవడం అనేది కేవలం పెద్దలిచ్చే తర్ఫీదులో లోపమే.

పిల్లలకు విజ్ఞానం నేర్పినంత మాత్రమే సరిపోదు. పనితనం నేర్పాలి. అందులో మనలాంటి దేశంలో ఏదో ఒక దాంట్లో నైపుణ్యం నేర్పడం చాలా అవసరం సినిమా పరిశ్రమలో ఒక సహాయ దర్శకుడి కన్నా, ఒక రచయిత కన్నా, ఒక బట్టలు కుట్టే దర్జీ ఎక్కువ సంపాదిస్తా డంటే బహుశా మీకు ఆశ్చర్యం కలగవచ్చు.

చాలామంది పిల్లలు లెక్కలంటే భయపడతారు. ఎక్కాలు, గుణింతాలు, భిన్నాలు, వడ్డీలు, శాతాలు వాళ్ళకి భయంకరమైన రాక్షసుల్లా కనపడుతుంటాయి. దీనికి కారణం వాళ్ళకి సరైన అప్రోజ్ లేకపోవడమే. పద్మవ్యూహంలోకి అభిమన్యుడు చొచ్చుకుపోయినట్లు సమస్యలోకి చొచ్చుకుపోలేక, ఒడ్డున నుంచొనిచూసే మనస్తత్వాన్ని యిటువంటి పిల్లల్లో గమనించవచ్చు. కొందరు పిల్లలకి బాగా మేధస్సు వుంటుంది. కానీ లెక్క లంటే భయముంటుంది. ఇది కేవలం వాళ్ళయొక్క అభద్రతా భావాన్ని సూచిస్తుంది. అలాగే మరికొంతమంది తల్లిదండ్రులు పిల్లల్లో సహజంగా వుండే సృజనాత్మకతను చంపేసి బట్టీలు పట్టమని, పుస్తకాల్లో ఎలావుందో అలా చదవమని బలవంతం చేస్తుంటారు. ఇది చాలా దారుణమైన పరిస్థితి.

పిల్లల్ని వాళ్ళిష్టప్రకారం చదువుకోమని వాళ్ళని వదిలేసేటట్టయితే భవిష్యత్తులో వాళ్ళ వక్రమార్గంలో పడతారని; ఏమీ సాధించలేరని తల్లి దండ్రులు అనుకుంటారు. అలా కాకుండా ఒక స్థాయికి వచ్చిన పిల్లల్ని వాళ్ళేం చదువుతారో, దేనిమీద అభిరుచుందో వాళ్ళద్వారా తెలుసుకుని వాళ్ళు చెప్పేది మరీ నిరర్ధకమైన కోర్సయితే - దాంట్లో వుండే నష్టాలు వాళ్ళకి విపులంగా చెప్పి వాళ్ళని సక్రమ మార్గంలో పెట్టచ్చు. కానీ వీలై

నంతవరకు పిల్లలకి ఏ సబ్జెక్టు ఇష్టమైతే అది చదివించడమే మంచిది. మీరు గమనించి వుంటే జీవితంలో చాలా పైకొచ్చిన వాళ్ళందరు తాము ప్రస్తుతం అనుభవిస్తున్న జీవిత విధానానికీ, తమ చదువుకి సంబంధం లేని వాళ్ళుగానే వుంటారు.

ఇప్పటివరకు నేను చెప్పింది క్లుప్తంగా సమీక్షిస్తాను.

—పిల్లల్లో తెలుసుకోవాలనే ఉత్సాహం వుంటుంది.

—పిల్లలకి ఈ ప్రపంచమంతా ఒక మిస్టరీలాగ కనబడుతుంది.

ఆ మిస్టరీని వయసుతోపాటు విడగొట్టడానికి ప్రయత్నిస్తుంటారు.

—పోకిరి మనస్తత్వాన్ని చిన్నప్పటినుంచే కలిగి వుంటారు.

—ఇతరులుచేసే పనిని అనుకరిస్తారు.

—కుత్సితత్వం అసలుండదు.

—సృజనాత్మకశక్తి కలిగి వుంటారు.

—మానసికంగా చాలా ఫ్రెష్‌గా వుంటారు.

—చాలా నిశితంగా చుట్టూ వున్న పరిసరాల్ని పరిశీలిస్తూ వుంటారు.

—స్వతహాగా ధైర్యగుణం కలిగి వుంటారు.

—పెద్దల అటెన్షన్‌ని ఎప్పుడూ తమమీదకి మరల్చుకోవాలని చూస్తుంటారు.

పిల్లల్ని బాగా పెంచే విధానం ఈ క్రింది నాలుగు ప్రశ్నలమీద ఆధారపడి వుంటుంది. అవి :

1. నేనెవర్ని ?
2. నేనెవర్ని సంతోషపెట్టాలి ?
3. నా లక్ష్యం ఏమిటి ?
4. నా లక్ష్యాలను సాధించడంలో నేనెక్కడ వున్నాను ?

## 1. నేనెవర్ని ?

తామెవరో, ఎందుకు పుట్టారో, జీవితలక్ష్యం ఏమిటో వారికి తెలియ చెప్పాలి. పిల్లల పేర్లు గొప్పవి, ఆదర్శవంతమైనవి అయితే అవి వారికి ఎందుకు పెట్టబడినవో చెప్పడం వలన కొంత ప్రోత్సాహాన్ని అందించి వారి విలువనూ, గౌరవాన్ని పెంచవచ్చు. ఈ పేరు యొక్క ప్రభావం పిల్లల్లో కనీసం పధ్నాలుగేళ్ళ వయసు వచ్చేవరకు వుంటుంది.

పిల్లల స్నేహితుల్ని, పిల్లలచుట్టూ పరిసరాల్ని పెద్దలు నిరంతరం గమనిస్తూ వుండాలి. వారెవరో వారికి తెలియజేయాలంటే పిల్లలకి "వారెవరు కాదో" తెలియజేయాలి. పిల్లలు పెద్దవాళ్ళవుతున్నకొద్దీ వాళ్ళయొక్క లక్ష్యాన్ని, వాళ్ళయొక్క గమ్యాన్ని వాళ్ళకి తెలిసేలా చేయాలి. ఉదాహరణకి దంపతులకి ఇద్దరు పిల్లలుంటే "వృద్ధాప్యంలో తమను పోషించే బాధ్యత పిల్లలదే" అని ఇండైరెక్టుగా చెబుతూ రావాలి. దానికి కావల్సినంత ఆప్యాయత, అనురాగం ముందునుంచి యివ్వాలి. మొదటినుంచి పిల్లలపట్ల మనం మెటీరియలిస్టిక్‌గా ప్రవర్తిస్తే ముందు ముందు వాళ్ళు కూడా అలాగే ప్రవర్తిస్తారని ఇంతకుముందు అధ్యాయంలో చెప్పటం జరిగింది.

తమను తాము తెలుసుకొనే ప్రయత్నంలో పిల్లలకి దోహదపడాలి. పిల్లలమీద బలవంతంగా మన అభిరుచిని రుద్దకూడదు. లెక్కల్లోఉత్సాహం వున్న పిల్లవాడిని డాక్టర్ని చెయ్యాలనే మన అభిలాషని బలవంతంగా రుద్దకూడదు. ఇది కూడా గత ఛాప్టర్‌లో విపులంగా చర్చించటం జరిగింది.

పిల్లలు ఇంటర్మీడియెట్ చదివే వరకు పెద్దల దృష్టిలో అసలు లాయరు, కాంట్రాక్టరు, పొలిటీషియన్, సెక్రటేరియట్‌లో గుమాస్తా, సినిమా ప్రొడ్యూసర్, వ్యాపారవేత్త....ఇలాంటి వృత్తులే స్ఫురణకిరావు. అయితే డాక్టరు, లేకపోతే కలెక్టరు, కాకపోతే ఇంజనీరు, లేకపోతే ఛార్టర్డ్ అకౌంటెంట్ అనే పద్ధతిలోనే ఆలోచిస్తారు. తమ పిల్లలు పెద్ద

వృత్తుల్లోకి వెళ్ళాలనే కోరిక వుండటం సమంజసమే. కాని, మిగతా వృత్తులేవీ వాటికి సరిపోవు అన్న ఆలోచన మంచిది కాదు. డాక్టర్లు, ఇంజనీర్లు ఎంత సంపాదిస్తున్నారో, సమాజంలో వారికెంత గౌరవం వుందో మిగతా వృత్తులవారికికూడ అంతే వుంది. ఈ విషయం పిల్లల్లో చిన్నప్పుడే ఏదైనా కాంప్లెక్స్‌లు బయలుదేరుతుంటే వాటిని గుర్తించవలసిన బాధ్యత పెద్దలదే.

పిల్లలు "నేనెవర్ని?" అన్న ప్రశ్నకి సమాధానం ఎంత తొందరగా తెలుసుకుంటే అంత తొందరగా తమ కెరియర్ బాగుపరచుకుంటారు.

## 2. నేనెవర్ని సంతోషపెట్టాలి?

పిల్లలు సంతోషపెట్టవలసింది పెద్దలను ! ఎలా సంతోషపెట్టాలో పెద్దలే పిల్లలకు తెలిసేలా చెయ్యాలి 'పెద్దలను సంతోషపెట్టటం ద్వారా తాము కూడ సంతోషంగా వుండవచ్చు' అన్న విషయం పిల్లలకు మనసులో నాటుకునేలా చేయాలంటే, 'పిల్లలను సంతోషపెట్టడం ద్వారా తాము సంతోషంగా వుంటున్నాము' అన్న విషయం పెద్దలు గ్రహించాలి.

మా రైటర్స్ వర్క్‌షాప్‌లో ఒక అసిస్టెంట్ పద్దెనిమిదేళ్ళ అమ్మాయి—బాగా పాటలు పాడుతుంది. సాయంత్రం ఆరు నుంచి పదకొండింటి వరకు పబ్లిక్ ప్రోగ్రామ్స్‌లో పాటలుపాడి రోజుకు మూడు వందల నుండి అయిదు వందలదాకా సంపాదిస్తుంది. నెలకి పదివేల వరకు తన తండ్రికి పంపిస్తూ గతంలో తన తండ్రి చేసిన లక్ష రూపాయల అప్పులో దగ్గిర దగ్గిర డెబ్బయ్ వేల వరకు తీర్చేసింది. ఆమె ఈ విధంగా కష్టపడటానికి కావలసిన స్ఫూర్తిని 'తండ్రియొక్క అప్పులు తీరుస్తున్నాను' అన్న సంతృప్తిద్వారా పొందుతుంది.

మీకు మీ పిల్లలకు మధ్య సంబంధాలు ఎంత బలమైనవో, దుష్ట సావాసం నుంచి వచ్చే వత్తిడి అంతకంటే బలంగాను, దృఢంగాను వుంటుంది. పిల్లలుకూడా అటువైపు తొందరగా ఆకర్షితులవుతారు. మీరు

గమనించి చూస్తే పధ్నాలుగేళ్ళ వయస్సులో ప్రేమలోపడిన ఆడవాళ్ళంతా తల్లిదండ్రులతో మంచి సంబంధాలు లేనివాళ్ళే అయి వుంటారు.

### 3. నా లక్ష్యం ఏమిటి?

ఇలాంటి నిర్ణయాన్ని తీసుకునేముందు మానసిక స్థయిర్యాన్ని, శారీరక దృఢత్వాన్ని, బలహీనతల్ని దృష్టిలో పెట్టుకోవాలి. ఒక బలహీనంగా ఉన్న కుర్రవాడ్ని వాళ్ళ తండ్రి ఒక సైనికుడ్ని చెయ్యాలని ముందునుంచే ప్లాన్ వెయ్యకూడదు. తార్కికజ్ఞానం, మంచి తెలివితేటలులేని పిల్లవాడిని ఛార్టెడ్ అకౌంటెంటో, ఇంజనీరో చెయ్యాలనే ఆశని చిన్నప్పటి నుంచే వదిలేసుకోవాలి. లేకపోతే అతనిలో ఆ బలహీనతల్ని ఎలా రూపుమాపాలో ఆలోచించుకోవాలి.

నేను ఆరో క్లాసు చదువుతున్నప్పుడు తల్లిదండ్రుల పెంపకంలో కాకుండా బయటి పెంపకంలో పెరగడంవల్ల లెఖ్కల్లో పది మార్కుల లోపే రావడంవలన పరీక్ష పోవటం నాకు బాగా గుర్తుంది. ఆ తరువాత నేను అనంతపూర్ సాయిబాబా స్కూల్లో చదివినప్పుడు ఒక మంచిమాష్టరు శ్రద్ధ తీసుకోవడంవల్ల ఆ సంవత్సరం నూటికి నూరు మార్కులు రావడం కూడ నాకు గుర్తుంది. ఆ తరువాత ఛార్టెడ్ అకౌంటెన్సీలో కాస్ట్ అకౌంట్స్, అకౌంట్స్‌లలో మంచి మార్కులతో ఉత్తీర్ణత సాధించగలిగాను. ఒక మనిషి ఒక బలహీనతను అదిగమించడం పెద్ద కష్టమేమీ కాదు. అలా అధిగమించలేని పక్షంలో ఆ రంగాన్ని వదిలేసి వేరే రంగాన్ని ఎన్నుకోవడం కూడా అసాధ్యమేమీ కాదు.

### 4. నా లక్ష్యాలను సాధించడంలో నేనెక్కడ వున్నాను?

ప్రతి మూడు నెల్లకో, ఆరు నెల్లకో మీ పిల్లవాడు తన గమ్యాన్ని సాధించడానికి ఎంత దూరంలో వున్నాడు? అన్న విషయాన్ని గమనిస్తూ వుండాలి. మంత్లీ పరీక్షల్లో, హాఫ్ ఇయర్లీ పరీక్షల్లో మార్కులు సరిగా రాకపోతే 'ఫైనల్లో మావాడు పాసయితే చాల్లే. మంచి మార్కులు రాక

పోయినా ఫరవాలేదు' అన్న అభిప్రాయాన్ని ఏర్పరచుకోకూడదు. ఇలాగే ఒక పిల్లవాడు గంజాయికో, మరే మత్తుమందుకో అలవాటుపడితే ఎంత తొందరగా గ్రహిస్తే అంత మంచిది. ముఖ్యంగా ఆడపిల్లలున్న తల్లి దండ్రులు తమ పిల్లలు ప్రేమలో పడితే సులభంగా పట్టుకోగలరు. అప్పటి వరకు చురుగ్గా వున్న అమ్మాయి మౌనంగా వుండటం, ఉదాసీనంగా వుండటం, ఏదో ఆలోచిస్తూ వుండటం, ఇలాంటివన్నీ ప్రేమలోపడిన లక్ష ణాలు. తల్లిదండ్రులు తమ కూతురు ప్రేమలో పడిన విషయాన్ని ఆ అమ్మాయి చెప్పేవరకు గుర్తించకపోతే, అది ఆ తల్లిదండ్రులకు తమ కూతురిపై సునిశితదృష్టి లేదన్న విషయాన్ని సూచిస్తుంది.

పిల్లలు తమ లక్ష్యాలకు ఎంత దూరంలో ఉన్నారన్న విషయం గుర్తించవలసింది ఈ విధంగా తల్లిదండ్రులే.

సంబంధాలు :

ఆస్తిపాస్తులు ఏమీ లేకపోయినా, తల్లిదండ్రుల్ని ఆసుపత్రిలో ఉంచడానికి వేలకి-వేలు ఖర్చయినా పిల్లలు పెదవి బిగువన కష్టాలుఅదిమి పెట్టి, ఏదో విధంగా డబ్బు సంపాదించి, తల్లిదండ్రుల ఆరోగ్యాన్ని కాపాడుకోవడం కోసం కష్టపడటం మనం చూస్తూనే ఉన్నాం. రోజురోజుకి ప్రపంచం మెటీరియలిస్టిక్‌గా మారుతోంది. మానవ సంబంధాల్ని ఆర్థిక సంబంధాలు ఏ విధంగా డామినేట్ చేస్తాయో నా లేటెస్ట్ నవల 'అంత ర్ముఖం'లో క్లియర్‌గా రాశాను. ఇటువంటి పరిస్థితులు ఏర్పడకుండా వుండాలంటే మనుష్యుల మధ్య (ముఖ్యంగా తండ్రి, పిల్లల మధ్య) మంచి సంబంధాలు వుండాలి.

మంచి సంబంధాలు పాటించే విధానాలు నాలుగు.

1. సున్నితత్వం.
2. ఒప్పందం.
3. ప్రశ్నించే స్వేచ్ఛ.
4. అవగాహన.

## 1. సున్నితత్వం :

'ప్రపంచంలో తల్లిదండ్రులకు అత్యంత విలువైన నిధి తాము' అని ప్రతి పిల్లవాడికి తెలియాలి. ఈ విషయం పిల్లలు తెలుసుకోవాలంటే తల్లిదండ్రులు వీళ్ళని సున్నితంగా హేండిల్ చెయ్యాలి. 'స్కూలయి పోగానే ఇంటికి వెళ్ళాలి. ఇంటి దగ్గర తన తల్లి ఎదురు చూస్తుంటుంది' అన్న భావన పిల్లల్లో కలగాలంటే ఆతల్లి పిల్లవాడ్ని ఎంతో ఆప్యాయతతో పెంచవలసి వుంటుంది.

పిల్లల్ని దండించవలసిన సందర్భాలు అనేకం రావచ్చు. దానికి తగినట్లుగానే తల్లులు, తండ్రులు ప్రవర్తించవచ్చు. మామూలుగా వున్న సముద్రం తుఫాన్ వచ్చినప్పుడు ఆటుగా, పోటుగా పైకొచ్చినా మిగతా సమయాల్లో మామూలుగా వుంటూ మేఘాలద్వారా మనుషుల్ని రక్షిస్తుంది. అలాగే కోపం వచ్చినప్పుడు దండించినా, మిగతా సమయాల్లో నిలకడగా ప్రేమ చూపించవలసిన బాధ్యత తల్లిదండ్రులదే. దీనికి కొన్ని సలహాలు :

—మీరు పిల్లలతో తప్పుగా ప్రవర్తించినట్లు మీకనిపిస్తే అది మీ పిల్లల దగ్గర ఒప్పుకోండి. (ఈ పుస్తకం మొదట్లో వ్రాసిన ఒక పాప ఇంగ్లీష్ ఆర్టికల్ మళ్ళీ ఇంకొకసారి చదవండి)

— వారి చేతిని స్పృశించడంగానీ, వాళ్ళని దగ్గరకు తీసుకోవడంగానీ అప్పుడప్పుడు చేయండి. అది ఆప్యాయతను సూచిస్తుంది.

—మరీ గంభీరంగా వుండటం మీ వ్యక్తిత్వాన్ని సూచించవచ్చుగానీ మీ పిల్లల దగ్గర మాత్రం గంభీరంగా వుండండి. వాళ్ళు ఏ విషయం లోనైనా బాధపడితే మీరు బాధపడకండి. సానుభూతి చూపండి.

—జాగ్రత్తగా వినండి. లెక్చర్లు ఇవ్వద్దు.

## 2. ఒప్పందం :

ఏ పిల్లవాడికైనా తమ తల్లిదండ్రులు తమను ప్రేమతో బంధించారు అన్న ఊహ ఎంతో గొప్ప సంతృప్తినిస్తుంది. ఇంతకుముందు చాప్టర్‌లో

ఒక పాప ఇంటికి ఆలస్యంగా వస్తే వేరు వేరు తల్లిదండ్రులు ఎలా ప్రవర్తిస్తారో రాయడం జరిగినది. ఆ పాప ఇంటికి ఆలస్యంగా వస్తే తల్లిదండ్రులు పట్టించుకోకపోతే మొదట్లో చాలా బాధపడుతుంది. క్షణ క్షణం మన ప్రేమను నిరూపించుకోవలసిన 'ఆవశ్యకత' ఎంతో వుంది. దీనికి కొన్ని సలహాలు.

—ప్రతి సాయంత్రం మీ పిల్లలని ఆ రోజు ఎలా గడిచిందో అడిగి తెలుసుకోండి.

—వాడి కార్యక్రమాల్లో పాలుపంచుకోండి.

—మీ పిల్లవాడి స్కూలుకెళ్ళి వాడి అభివృద్ధి ఏయేరంగాల్లో ఎలా వుందో అడిగి తెలుసుకోండి.

—స్కూల్ యానివర్సల్ ఫంక్షన్లకి, పేరెంట్స్ డేకి, ప్రోగ్రెస్‌కార్డు ఇచ్చినప్పుడు మీ భార్యనొక్కదాన్నే పంపకుండా తప్పకుండా మీరు గాని లేక ఇద్దరూ కలిసిగాని వెళ్ళండి. అది మంచి పద్ధతి.

—మీ పిల్లలంటే మీ కెందుకు గర్వమో వాళ్ళకు తెలిసేలా చెయ్యండి.

3. ప్రశ్నించే స్వేచ్ఛ :

పిల్లలకి పెద్దలను ప్రశ్నించే స్వేచ్ఛ నివ్వాలి. మీ పిల్లలు ఓపెన్‌గా నిజాయితీగా వుండటానికి ఎంత స్వేచ్ఛనిస్తారో, అంతగా వాళ్ళ విలువల్ని పెంచడానికి కూడ తోడ్పడతారు. కుటుంబ సభ్యుల మధ్య కూడ 'ఇంటరాక్షన్' బాగా పెరుగుతుంది.

మీ పిల్లలు మిమ్మల్నడిగే సమంజసమైన ప్రశ్నలకు ఉచితమైన సమాధానాలివ్వండి. ఎక్కడైతే పిల్లలకు ప్రశ్నించే స్వేచ్ఛలేదో అక్కడ వాళ్ళ ఫీలింగ్స్‌ని నొక్కి పెట్టేస్తారు. ఆ విధంగా చేయడంవల్ల ఆ ఫీలింగ్స్ వాళ్ళలో అగ్నిపర్వతాల్లా కుత కుత ఉడికి ఒక్కసారిగా పేలతాయి. అప్పుడు ఆ ఫీలింగ్స్‌ని బయటి వ్యక్తులతో పంచుకోవడానికి ఇష్టపడతారు. మీకు మానసికంగా దూరమవుతారు.

4. అవగాహన :

మనమీద మన గతం తాలూకు ప్రభావం, మనచుట్టూ వున్న పరిసరాల ప్రభావం స్పష్టంగా మనకు అవగాహనై వుండాలి. ఇద్దరు వ్యక్తులు పెళ్ళి చేసుకున్నప్పుడు, రెండు గతాలు కలిసి ఒక వర్తమానంగా జీవించడం ప్రారంభిస్తాయి. ఆ వర్తమానమే తల్లిదండ్రులుగా రూపుదిద్దుకొని పిల్లల భవిష్యత్తును తీర్చిదిద్దుతుంది. మనకి మన గతం ఒక అనుభవం. మన పిల్లలకి మనమే ఒక అనుభవం. కాబట్టి గతంలో మనం నేర్చుకున్న పాఠాల్ని పిల్లలకి తెలియజెప్పేలాగ ప్రయత్నించాలి.

నేను నా ముప్పైవ సంవత్సరంలో జేమ్స్‌హాడ్లీ ఛేజ్, ఆర్థర్ హేలీ నవలలు చదివేవాడిని. ఆ తరువాత ఆరేడు సంవత్సరాలకి అసిమోవ్, అయినెస్కో వంటి సైంటిస్టుల పుస్తకాలు చదవటం జరిగింది. మా అబ్బాయికి నేను పదిహేనవ సంవత్సరంలోనే అసిమోవ్ పుస్తకాలిచ్చి వాడికర్థంకాని విషయాల్ని చెప్పటంద్వారా మిల్స్ అండ్ బూన్, జేమ్స్‌హాడ్లీ ఛేజ్ లాంటి మామూలు పుస్తకాల స్థాయి నుంచి ఒక మెట్టు పైకి గెంతించి మంచి పుస్తకాలపట్ల అవగాహన ఏర్పరచగలిగాను. నా ముప్ఫయి సంవత్సరాల వయసు అనుభవాన్ని నేను నా కుమారుడికి చెప్పకపోయి వుంటే వాడికి కూడ ఈ పుస్తకాలు చదవటానికి మరో పదిహేను సంవత్సరాలు పట్టేది. ఈ విధంగా పదిహేను సంవత్సరాల అనుభవాన్ని (పుస్తకాలకు సంబంధించి) అతనికి ఇవ్వగలిగాను. ఒకేసారి మూడో మెట్టుమీదకి వెళ్ళిన ఆ పిల్లవాడికి నాలుగో మెట్టుమీదకి, అయిదో మెట్టుమీదకి చేరడానికి బహుశా నాకు పట్టినన్ని సంవత్సరాలు పట్టకపోవచ్చు.

....చాలా సందర్భాలలో మన గతం మనకి మేలు చేసేదిగానే వుంటుంది. మనకెదురైన సమస్యలు–వాటిని పరిష్కరించిన విధానం, మన అనుభవాలు మన పిల్లలకి వివరించి చెప్పగలిగితే, ఇవన్నీ జీవిత సోపానాలుగా ఉపయోగపడతాయి.

## చీకటి కోణాలు :

ప్రతి మనిషికీ చీకటి కోణాలు కొన్నుంటాయి. ఒక తండ్రికి బాగా తాగే అలవాటు వుండవచ్చు. ఒక తల్లికి బంగారంపట్ల, చీరెలపట్ల బాగా పిచ్చి వుండవచ్చు. తమ చీకటి కోణాల్ని పిల్లలు అర్థం చేసుకునేలాగ చెయ్యాలి. తమ బలహీనతల నుంచి బయటపడటానికి తామెంత కష్టపడు తున్నారో, అలా పడలేక కుటుంబానికి ఎంత నష్టం వస్తుందో పిల్లలకి అర్థ మయ్యేలా చెబితే వాళ్ళలో ద్వేషం స్థానే ఒక విధమైన జాలి కలుగుతుంది. 'తామెలాగూ చెడిపోయాం, తమ పిల్లలనన్నా మంచి మార్గంలో పెడదాం' అన్న అభిప్రాయం ప్రతి తల్లీ తండ్రికి ఈ చీకటి కోణాలపట్ల వుండాలి. అలాంటి పరిస్థితిలో పెరిగిన పిల్లలు తిరుగుబాటు ధోరణిని పెంచుకోకుండా సానుభూతి భావాన్ని అలవరచుకుంటారు. చీకటి కోణాలు ఏర్పడే కార ణాలు మూడు విధాలుగా విభజించవచ్చు.

1. అలవాటు
2. భయం
3. పదే పదే అదే తప్పు చేయటం

## 1. అలవాటు :

పాత పద్ధతుల్నుంచి మారటానికి ధైర్యం కావాలి. మానసిక సామ ర్థ్యం కావాలి. తన మీద తనకి కంట్రోల్ కావాలి. కానీ చాలామంది మను షులకి ఈ మూడూ వుండవు. ముఖ్యంగా తండ్రులు ఎప్పుడైతే ఒక కుటుం బానికి అధికార్లై పెత్తనం చలాయించడం మొదలుపెడతారో అప్పుడు వాళ్ళని ఆపేవారు ఎవరూ వుండరు. 'ఈ అలవాటువల్ల నేను ఆనందాన్ని పొందుతున్నాను. ఈ ఆనందాన్ని కాదనే హక్కు మీ కేముంది ?' అనే ధోరణిని ఈ కుటుంబ పెద్దలు అలవాటు చేసుకుంటారు. ఇలాంటప్పుడు పిల్లలు కొంతకాలం అణిగి మణిగి వున్నా తరువాత తిరుగుబాటు ధోరణిని అలవాటు చేసుకుంటారు.

## 2. భయం :

ప్రతి మనిషి ఎందుకు భయపడతాడు అన్నదానికి చాలా రకాలుగా చాలా కారణాలున్నాయి కొంతమంది చీకటిని చూస్తే భయపడతారు. మరి కొంతమంది నాలుగంతస్తుల మేడ మీదనుంచి క్రిందకు చూస్తే భయపడతారు. కొంతమంది రేపు మధ్యాహ్నం ఒంటిగంట ట్రైనుకు వెళ్లాల్సివుంటే ఈ రోజు సాయంత్రం నుంచే అదోరకమైన టెన్షన్‌తో భయపడుతుంటారు. కొంతమంది రేపు పరీక్ష అన్నా కూడ ఈ రాత్రి చాలా నిబ్బరంగా ఉండ గలుగుతారు. భయం వేరు వేరు స్థాయిల్లో మనుషుల్ని బాధపెడుతూ వుంటుంది. తమకి భయమున్నా కూడా పిల్లల ముందు తమ కటువంటి అభద్రతా భావమేదీ లేదని నిరూపిస్తూ వుండాలి, ఇది చాలా లౌక్యపరమైన నాటకీయత అయినా కూడ అలా చేయటం తప్పదు.

## 3. పదే పదే అదే తప్పు చేయటం :

'కష్టాలు వాటంతట అవే పోతాయ్. తప్పకుండా మంచిరోజు అదే వస్తుంది' అనుకొని పాత పద్ధతుల్ని కొనసాగించడం చాలా పురాతనమైన పద్ధతి. ఈశాన్యంవైపు బావి తవ్వడం ద్వారాకాని, చేతికి రక్షణరేఖ కట్టుకోవటం ద్వారాకాని, జ్యోతిష్యం చెప్పించుకోవడం వల్లకాని మంచిరోజులు రావు. మంచిరోజులు మంచి వ్యక్తిత్వం పెంచుకుంటే వస్తాయి. మనం కష్టాన్ని ఎదుర్కొనే ధైర్యాన్ని పెంపొందించుకుంటే వస్తాయి. మనం ఎన్ని కష్టాల్లో వున్నా కూడా మన పిల్లలకు అది తెలియనివ్వకపోవటమే మంచిది. మరీ కష్టాలు ఎక్కువై, వాటివల్ల పిల్లలు బాధపడుతుంటే అప్పుడు వారిని కూర్చోబెట్టి చెప్పటం చాలా మంచి పద్ధతి. మనం ఆర్థిక పరమైన ఇబ్బందుల్లో వుండి మన పిల్లలకి ఒకపూట అన్నం పెట్టలేకపోతే పీలైనంతవరకు అన్నం పెట్టటానికే ప్రయత్నించాలి. కానీ ఆ విషయం పిల్లలకు తెలియనీయకూడదు. అన్నం పెట్టడం దాదాపు దుర్లభం అయినప్పుడు ఆ పిల్లలను కూర్చోపెట్టి తామెందుకు అన్నం పెట్టలేకపోతు

న్నామో, అందుకవసరమయిన డబ్బుకోసం తామెంత కష్టపడుతున్నామో, అయినాకూడ ఆ డబ్బెందుకు దొరకటంలేదో, అందువల్ల పిల్లలకు అన్నం పెట్టలేకపోతున్నందుకు తాము ఎంత బాధపడుతున్నామో తెలియజేయండి. పిల్లలుకూడా తండ్రికి ఏ విధంగా సహాయం చెయ్యాలా అని ఆలోచించటం మొదలుపెడతారు. (ఇక్కడ ఒక పూట తిండి లేకపోవటం అన్నది కేవలం ఒక ఉదాహరణ మాత్రమే.) చిన్న చిన్న కష్టాలను కూడ పంచుకోవటం ద్వారా మానసిక సంబంధాలు బాగుపడతాయనే ఈ రచయిత ఉద్దేశ్యం.

## అధ్యాయం - 5

# పిల్లలూ - స్వభావాలు

—మీ పిల్లలు తమ రూమ్‌ని చిందరవందరగా చేసి అలా ఇష్టమొచ్చినట్టుగా వుంచుకునే హక్కుందని సాధిస్తున్నారా?

—వంటింట్లో అన్ని గిన్నెలు పాడుచేసి, తాము చేయలేదని వాదిస్తున్నారా?

—అక్క చెల్లెళ్ళతో పోట్లాడుతూ, మొదలెట్టింది ఎదుటివాళ్ళేనని దబాయిస్తున్నారా?

—మీకు ఎదురు చెప్తున్నారా ? ఇంటికి లేటుగా వచ్చి కుంటిసాకులు చెప్తున్నారా?

—ఇంట్లో చిన్న వస్తువులు మాయం అవుతున్నాయా?

—డబ్బు దొంగిలిస్తున్నారా? ఇంటికి అడ్డమైన స్నేహితుల్ని తెచ్చి మర్యాద చేయలేదని గోలపెడుతున్నారా ?

—పెద్దగా రేడియోలు. స్టీరియోలు, పెట్టి మీకు తలనొప్పి కలిగిస్తున్నారా?

—ఇంటికి ఆలస్యంగా వచ్చి, పార్టీ అని సాకు చెప్తున్నారా?

—కోపం వస్తే ఏది చేతిలో వుంటే అది విసిరేసి, అన్నీ బద్దలు కొడుతున్నారా?

—అందరితో గొడవలు పెట్టుకొని, ఎవరూ తమని అర్థం చేసుకోవడం లేదని కుమిలిపోతున్నారా?

—స్కూల్లో టీచర్లతోనూ, తోటి పిల్లలతోనూ గొడవలు పడుతున్నారా?

—టీచర్లతో చీటికి మాటికి దెబ్బలు తింటున్నారా?

—అన్నింటిలోనూ తక్కువ మార్కులు తెచ్చుకుంటున్నారా?

—అయితే మీ పిల్లలు తప్పుదోవన వున్నట్లు అర్థం చేసుకోవాలి. బాధగానే వున్నా దానికి విరుగుడు ఏం చెయ్యాలో ఆలోచించాలి. అరవడం, శిక్షించడం, బెదిరించడంవల్ల పెద్ద ఉపయోగం ఉండదు.

—చాలామంది తల్లిదండ్రులు తమ పిల్లలు చేసే తప్పుల్ని ఒప్పుకోరు. అంత చేదు నిజాన్ని అంగీకరించడానికి వాళ్ళ మనస్సు సిద్ధంగా వుండదు. ఉదాహరణకి మా ఇంటి పక్క ఒక బ్యాంకు ఆఫీసరు కూతురు వుండేది. రాత్రి ఒంటిగంట వరకూ చదువు నెపం మీద డాబాపై చేరి, చుట్టుపక్కల రూముల్లో చదువుకునే అబ్బాయిలకి సైగ చేసేది. ఒకరోజు అబ్బాయి తండ్రి అది గమనించి కొడుకుని కట్టడిలో పెట్టాడు. ఆమె వేరే అబ్బాయితో ఇది కొనసాగించింది. ఆయన వెళ్ళి ఆఫీసర్‌కి ఈ విషయాన్ని చెప్పాడు. ఆఫీసరు ఆయనతో మాట్లాడటం మానివేశాడు. ఇలా బిగుసుకు కూర్చోవడంవల్ల పిల్లలు తామేం చేసినా పెద్దలే బాధ్యులని అనుకుంటారు. ఇలాంటి సమయాల్లో మంచీ, చెడూ బోధించడం వల్ల మెల్లి మెల్లిగా వాళ్ళలో మార్పు తెచ్చే అవకాశం వుంది.

—ఇలాంటి చిన్న చిన్న వాస్తవాలు ఎదురైనప్పుడు, అది పిల్లలకి సంబంధించినా, మనకి సంబంధించినా నాలుగు ముఖ్య విషయాలు గుర్తుంచుకోవాలి. ఆటుపోట్లు తప్పవు. ముఖ్యంగా పిల్లల్లో మార్పు తేవాలని మనం బలంగా అనుకుంటున్నప్పుడు ఓ నాలుగు రెస్పాన్స్‌లు ఇవ్వకుండా జాగ్రత్తపడాలి.

1. విసుగొచ్చి మార్పుని గురించి ఆలోచించడం మానేయడం. "ఇక ఈ పిల్లవాడిని మార్చడం నా వల్లకాదు. వీడిని జీవితాంతం భరించటం నా ధర్మం", అనుకోవడం ఇదంతా మెట్టవేదాంతం. ఏదో పెళ్ళి చేసుకున్నాం కాబట్టి రాజీపడడం తప్పదు అనే తప్పనిసరి

నిర్ణయం ఎదుటి వ్యక్తి లోపాన్ని నిశ్శబ్దంగా భరించడమంటే మన చేతకానితనాన్ని ఒప్పుకోవడమన్నమాట. ఇది మన ఆత్మాభిమానాన్ని అవమానపర్చే విషయం. మన గురించి మనమే యింత తక్కువగా ఊహిస్తున్నప్పుడు ఇక ఎదుటివాళ్ళు మన మాట వినాలని ఎందుకు ఆశించడం! ఇంత నిరాశలోంచి మన పిల్లల మీద మనకి ప్రేమ సడలవచ్చు. రాజీ పడాల్సొచ్చింది కదా అని ఉక్రోష పడవచ్చు. కాబట్టి ఇది చాలా తప్పు పద్ధతి.

2. బలైపోవడం: ఎదుటి వాళ్ళలో మార్పురాదన్న విషయాన్ని అంగీకరించడం మొదలెట్టగానే ఆ వ్యక్తి తానెంత మంచివాడో మిగతా కుటుంబ సభ్యులకి చాటాలనుకుంటాడు. తన చేతగాని తనాన్ని–తన త్యాగంగా–తన భర్త గుర్తించాలని తల్లి కోరుకుంటుంది. తాను చేసిన త్యాగాన్ని గుర్తు చేస్తుంటుంది. దీనివల్ల వ్యవహారం మరింతగా బెడిసికొడుతుంది. (నేను కాబట్టి ఈ సంసారం ఈదుతున్నాను, ఈ పిల్లల్తో వేగుకు వస్తున్నా, అనే తల్లులు ఈ కోవకు చెందినవారే)

3. ప్రతీకారం : ఇది ఓటమిని తట్టుకునే మనస్థయిర్యం లేనప్పుడు తీసుకునే చర్య. దీనివల్ల ఎటువంటి లాభమూ వుండదు. అంతేకాక ఎదుటి వాళ్ళను కూడా ప్రతీకారానికి రెచ్చగొడతాయి. (పిల్లలు తప్పు చేస్తే, బెల్టు తెగేలా కొట్టడం లేదా ఉపవాసం వుండటం ద్వారా తనని తానే శిక్షించుకోవటం)

4. వెన్ను చూపడం : ఎదుటి వాళ్ళలో మార్పురాదన్న విషయం స్పష్టమవగానే, ఇక ఏ విషయంలోను ఆసక్తి చూపడం మానేస్తారు. కొందరు ప్రేమ, కేరింగ్ అనేవే మర్చిపోతారు. ఒకే ఇంట్లో అపరిచితుల్లా బ్రతుకుతూ వుంటారు. దీనివల్ల చాలా నష్టపోవాల్సి వస్తుంది.

ఈ నాలుగు పద్ధతుల్నీ అవలంబించకపోవడంవల్ల సగం సమస్యల్ని దూరం చేసుకున్నట్టే. ఓ పద్ధతిలో మంచి చేసుకోవటంవల్ల పనులు సాను కూలపడవచ్చు. దీనికి ముందుగా ఓ ప్లాన్ సిద్ధం చేసుకోవడం ముఖ్యం. మనం పలికే విధానంలో, చెప్పే పద్ధతిలో చాలా ఎఫెక్టు వుంటుంది. రిక్వెస్టు అన్నది నెగిటివ్ కాకుండా సూటిగా పాజిటివ్‌గా వుండాలి. 'ఇలా చేయద్దు' అనే కంటే 'ఇలా చేస్తే బాగుంటుందేమో' అంటే ఎఫెక్టు గొప్పగా వుంటుంది. 'మీరిలా చేస్తే నేను చాలా సంతోషిస్తాను. మీకు మాత్రం నా సంతోషం కంటే ఏది ముఖ్యం చెప్పండి' అనడం వల్ల పిల్లల ముందరి కాళ్ళకు బంధం వేయవచ్చు. వాళ్ళ లోపాల్ని కాకుండా వాళ్ళ గొప్పతనాన్ని ఎత్తిచూపడంవల్ల మార్పు సులభమవుతుంది. ఇలా భావాల్ని పంచుకోవడం వల్ల దగ్గరితనం కూడా పెరుగుతుంది. మనం ఎందుకది ఆశిస్తున్నామో, దానివల్ల ఎదుటి వ్యక్తికి ఎంత అవసరమో తెలియ జెప్పాలి. అంతా వివరించాక, ఏం చేస్తే ఎలాంటి ఫలితాలుంటాయో ఊహించి, రకరకాల ఆల్టర్నేటివ్‌లు ఆలోచించి పెట్టుకోవాలి. వారి మాన సిక స్థితినిబట్టి, వారి పిలునిబట్టి, ఏదో ఒక పద్ధతిని అవలంబించాలి. ఇదంతా నెమ్మది మీద, ఓర్పుమీద జరగాలి. హడావిడి పడితే లాభం వుండదు. చిన్న చిన్న స్టెప్స్‌లో కార్యక్రమాన్ని తేలిగ్గా కన్పించేలా చేసు కోవాలి. అది చేయడానికి ఎదుటి వ్యక్తికి నిరంతరమూ సహకారాన్నీ, ఉత్సాహాన్నీ, ప్రోత్సాహాన్నీ యివ్వాలి. మనం తనని నమ్ముతున్నామన్న భావన కలిగించే భద్రతనూ, ఆనందాన్నీ ఎదుటి మనిషికివ్వాలి.

## చిన్న పిల్లలలో తలెత్తే సమస్యలు :

ఈ సమస్యల గురించి స్థూలంగా క్రిందటి అధ్యాయంలో చర్చించాం. ఇప్పుడు మరింత వివరంగా పరిశీలిద్దాం. చిన్న పిల్లల సమ స్యల గురించి తెలుసుకోవాలంటే, మనం చిన్న పిల్లలుగా వున్నప్పుడు ఎంత చిన్న చిన్న సమస్యలు మనల్ని బాధించేవో ముందు గుర్తు చేసు కోవాలి.

స్కూల్లో ఇష్టమైన టీచర్ వెళ్ళిపోవడమో, స్నేహితులు దూర మవడమో, తల్లిదండ్రులు గొడవపట్టంలాంటివి పిల్లల మనస్సుమీద తీవ్ర మైన ప్రభావం చూపిస్తాయి. తల్లిదండ్రులు పిల్లల్లో చురుకు ఎందుకు తగ్గి పోయిందా అని కంగారుపడి డాక్టర్ల చుట్టూ తిరిగేబదులు, కారణాలు వెదక డానికి ప్రయత్నించాలి. కొత్త స్కూలుకి వెళ్ళడం, కొత్త మనుషులతో మాట్లాడాల్సి రావడం, పరీక్షలో తక్కువ మార్కులు రావడం, పెంపుడు కుక్క చచ్చిపోవడం, స్నేహితులతో కీచులాడుకోవడం లాంటివెన్నో కార ణాలు వాళ్ళకి సమస్యలుగా కన్పిస్తాయి.

ఆ టైంలో వాళ్ళ ఫీలింగ్స్‌ని అర్థంచేసుకోవడానికి ప్రయత్నించాలి. నెమ్మదిగా నచ్చచెప్పి, ధైర్యం తెప్పించాలి. లేదంటే కొన్ని చిన్న చిన్న భయాలు తర్వాత్తర్వాత "ఫోబియాలు"గా మారొచ్చు. ప్రతిదీ ఓపిగ్గా, విశదీకరించి, అర్థమయ్యేలా చెప్పడంవల్ల మనం వాళ్ళకి చాలా దగ్గ రవ్వచ్చు. సెక్స్‌గురించి, మంచి, చెడు గురించి వాళ్ళతో చర్చించి వాళ్ళకో సదవగాహన కల్పించాలి. సమస్య రాగానే పిల్లల్లో మొదటగా ఓ విధమైన షాక్ కన్పిస్తుంది. తర్వాత చాలా ఎంగ్జయిటీగా ఫీలవుతారు. ముందు అలాటి సమస్యల్ని ఎదుర్కొకపోవడంవల్ల దాన్ని తట్టుకోవడం కష్టంగా వుంటుంది.

అదే పెద్దవాళ్ళయితే జరిగిందాన్ని గురించి పదే-పదే తల్చుకోవడం వల్ల ఆ వ్యథనుంచి బయటపడతారు. ఇంత ఆలోచన పిల్లలకు వుండదు. మెల్లి మెల్లిగా వారు నిజాన్ని అంగీకరించడానికి ప్రయత్నిస్తారు. ఇదికూడా వారికి మొదట్లో కష్టంగానే వుంటుంది. పెద్దవాళ్ళు స్నేహితులతోనూ, బంధువుల్తోనూ సంప్రదింపులు, సలహాలు చేస్తారు. కానీ, పిల్లలు అలా చేయలేరు. ఎక్కువగా మాట్లాడం, ఎక్కువగా తల్చుకోవడం వాళ్ళను మరీ దిగులు పరుస్తుంది. ఇలా ఎక్కువకాలం సాగితే, వాళ్ళు భవిష్యత్తులో భయస్థులుగానూ, అసమర్థులుగానూ మారే అవకాశముంది. అందుకే పెద్దవాళ్ళు వాళ్ళ మందకొడితనాన్ని గుర్తించి, పరిస్థితిని చక్కదిద్దడం

మంచిది. వాళ్ళ స్థాయికి దిగి వాళ్ళ కష్టమేంటో తెల్సుకోవాలి. వాళ్ళకే సలహాలు ఇవ్వకుండా, దాన్ని తప్పించుకోవడానికి ఎన్ని మార్గాలున్నాయో తెలియచేసి, నిర్ణయాలు వాళ్ళకే వదిలేయాలి. కానీ, మంచి నిర్ణయం తీసుకోవడానికి సహాయపడాలి. వాళ్ళ కర్థమయ్యే భాషలో మాట్లాడాలి. వారినా అయోమయ స్థితినుండి బయటకు తేవాలి. భవిష్యత్తులో అలాంటి సమస్యలొచ్చినా తట్టుకునే స్థయిర్యం కల్పించాలి.

పిల్లల మానసిక ఎదుగుదలని మూడు రకాలుగా విభజించవచ్చు.

## మొదటి దశ :

కిండర్ గార్డన్, నర్సరీలకి వెళ్ళే వయస్సులలో పిల్లలకి ఏ అవగాహనా వుండదు. ఏది యెలా యెందుకు జరుగుతుందో తెలీదు. చిన్న బాధకి కూడా తట్టుకోలేరు. తమకు జబ్బుచేసినా, అది తాము చెడ్డవాళ్ళయినందువల్లే ననుకుంటారు. వాళ్ళ కిలాంటి భావాలు రావడానికి పెద్దవాళ్ళు చాలమటుకు కారణం. అందుకే పెద్దవాళ్ళు పిల్లల్లో అన్ని అనవసర భయాలు కల్పించకుండా, వాళ్ళ ఫీలింగ్స్ వాళ్ళు ధైర్యంగా చెప్పగలిగేలా చేయాలి. దీనివల్ల వాళ్ళకి సెల్ఫ్‌కంట్రోల్ పెరుగుతుంది ఓపిగ్గా ప్రశ్నలు అడిగి, వాళ్ళచేత సరయిన సమాధానాలు రాబట్టి వాళ్ళ ఆలోచనా శక్తికి పదును పెట్టాలి. దానిక్కాస్త సమయం పట్టినా, మనకు బాగా అసహనం కలిగించినా, మనం ఓర్పు వహించక తప్పదు. మరీ చిన్నపిల్లల్తో డీల్ చేసేటప్పుడు ఈ నాలుగు విషయాలు గుర్తుపెట్టుకోవాలి.

1. చిన్నపిల్లలు సాధారణంగా మొండిగా, స్వార్థంగా, అహంభావంగా వుంటారు. ప్రపంచమంతా తమ చుట్టూనే తిరుగుతుందనే ధీమాలో వుంటారు. ఇతరుల గురించి ఆలోచించరు. అదంతా మామూలే వాళ్ళ లోకంలో వాళ్లుంటారు. వాళ్ళ భాషలో వాళ్ళు మాట్లాడుతారు. ఇతరులకు అర్థం అవుతోందా లేదాని ఆలోచించరు. అన్నీ వాళ్ళ ఇష్టప్రకారం జరగాలని, వేరే వాళ్ళకి జవాబు చెప్పుకోవాల్సిన అవసరం లేదని అను

కుంటారు. ఏడేళ్ళు వచ్చేవరకూ అసలు తమకీ, ఇతరులకి ఆలోచనల్లో వున్న భేదం వాళ్ళు గుర్తించరు.

2. పెద్దవాళ్ళుగా మనం మన భాష విషయంలో చాలా జాగ్రత్త వహించాలి. వాళ్ళతో చక్కగా, హుషారుగా, అర్థమయ్యే భాషలో ఆసక్తి కరంగా మాట్లాడ్డంవల్ల వాళ్ళకి దగ్గరవ్వచ్చు. మనం కోపంగా మాట్లాడితే, వాళ్ళకి మన కోపమే అర్థమవుతుంది కానీ, దాని వెనకవున్న భావం అర్థం కాదు. మనం 'సంబంధం లేదు' అనుకునే విషయాలు కూడా వాళ్ళకి ఏదో లింకు వున్నట్టుగా కన్పిస్తాయి. ఉదాహరణకి తండ్రి జ్వరంతో ఆఫీసు నుండి ఆలస్యంగా వచ్చాడంటే, ఆఫీసునుండి ఆలస్యంగా వస్తే, జ్వరం వస్తుందేమోననే భ్రమ పడతారు. అలాటప్పుడు ఆఫీసంటేనే భయం పెంచు కుంటాడు.

3. మరీ ఎక్కువగా విషయాలు విపులీకరించి చెప్పడంవల్ల పిల్లలు మర్చిపోయే అవకాశం వుంది. అందుకే మెల్లి మెల్లిగా కొన్ని–కొన్ని విషయాల్నే వాళ్ళకి మననం చేయించి ఎప్పటికీ గుర్తుంచుకునేలా చేయాలి. వాళ్ళు ప్రతి విషయాన్ని కూలంకషంగా పరిశీలించి, అర్థం చేసుకునేలా చూడాలి. విడివిడిగా ఉన్న బొమ్మ ముక్కల్ని అతికించి, బొమ్మను పూర్తి చేయడం, పజిల్స్ పూర్తిచేయడంలాంటి ఆటలతో వారి పరిజ్ఞానాన్నీ, ఆలో చనా శక్తినీ పెంపొందించొచ్చు.

4. తామే పని చేసినా, ఫలితానికి తామే బాధ్యులమని పిల్లలు అనుకుంటారు. ఇది ఒకందుకు మంచిదే అయినా, వారిలో గిల్టీ ఫీలింగ్ పెరక్కుండా చూసోకోవాలి. వారు ఎప్పుడూ తాము చెప్పిందే ఎదుటివారు వినాలన్న ఆలోచన్లో వుంటారు. ఇది మామూలే అయినా, భవిష్యత్తులో ఆటంకం కాకుండా చూసోకోవాలి. పెద్దవాళ్ళకి గౌరవం యివ్వడం, ఎక్కడి కయినా వెళితే అక్కడ మర్యాదగా ప్రవర్తించడం, ఈ దశలోనే తెలియ చెప్పాలి. వారి తెలివితేటలు, ఆలోచనాశక్తి మంచి విషయాలపై కేంద్రీ కృతమయ్యాయో లేదో గమనిస్తూ వుండాలి.

## మాధ్యమిక దశ :

ఇది ఏడేళ్ళనుండి పన్నెండేళ్ళ వయస్సు వరకు వుంటుంది. ఇది మానసికంగా కొంత వికసించిన స్థితి. వాళ్ళంతట వాళ్ళుగా చిన్న చిన్న కష్టాల నెదుర్కొంటూ వుంటారు. ఇతర అభిప్రాయాల్ని, ఫీలింగ్స్‌ని గమనించడం మొదలుపెడ్తారు. వాళ్ళ కంపెనీ చాలామటుకు సరదాగా ఆహ్లాదంగా వుంటుంది. ఎక్కువగా గొడవ చెయ్యకుండా, నెమ్మదిగా వుంటాము. కానీ ఏమాత్రం యిబ్బంది కలిగించే సమస్యకైనా తల్లడిల్లి పోతారు. మనమేదైనా విషయాన్ని గురించి ఎక్కువగా చర్చిస్తే వాళ్ల ఆసక్తి కనబర్చరు. పైగా టాపిక్ మార్చడానికి ప్రయత్నిస్తారు. కష్టాల్ని, ఇబ్బందుల్ని తప్పించుకోవడానికి ప్రయత్నిస్తారు. ఎప్పుడు సాయంత్ర మవుతుందాని చూస్తూ వుంటారు. ఆటలు, పాటలు వారికి వినోదాన్ని కలి గిస్తాయి.

వాళ్ళ ఫీలింగ్స్‌ని అప్పుడు మాత్రమే బయటకు కనబరుస్తారు. టేప్ రికార్డర్లు, ఫోన్లు, బొమ్మలు, తోలుబొమ్మలు లాంటివి వారికి ఆలోచనా శక్తిని, వినోదాన్ని కూడా యిస్తాయి. కానీ, పెద్ద తార్కికంగా ఆలోచించే వయసు కాదు. అప్పుడప్పుడూ పెద్దవాళ్ళేం చెప్తున్నారో వాళ్ళకి తెలీదు, అర్థంకాదు. అలాంటప్పుడు పెద్దవాళ్ళే విసుక్కోకుండా ఆ వయసులో వాళ్ళ కర్థమయ్యేలా చెప్పాలి. (ఈ వయసులో నేను మా అమ్మమ్మ– తాతయ్య దగ్గిర వుండేవాడిని. ఎవరింటికయినా వెళ్ళిరాగానే, "అక్కడ చాలా అల్లరి చేసేవురా" అనేది. మరుసటిసారి వెళ్ళినప్పుడు, మరింత కుదురుగా కూర్చుని వుండేవాడిని. అయినా, తిరిగొచ్చాక మళ్ళీ అదేమాట అనేది. నాకిప్పటికీ ఆమె అభిప్రాయం అర్థంకాలేదు. ఇప్పటికీ ఈ విష యమై ఆమెని ఆట పట్టిస్తూ వుంటాను.)

పిల్లల విషయంలో పెద్దవాళ్ళు కొంత పట్టు–విడుపులు చూపాలి. మరీ ఖచ్చితంగా వుండడంవల్ల ఇద్దరిమధ్యా దూరం పెరుగుతుంది. మన ఆలోచనల్ని వాళ్ళమీద రుద్దకుండా, వాళ్ళ అభిప్రాయాల్నికూడా తెల్సుకో

వడం మంచిది. ఎందుకంటే అది తెల్సుకోవడంవల్ల వాళ్ళకెలా నచ్చ చెప్పాలో తేల్చుకోవచ్చు. అసలీ పిల్లల మనస్తత్వాల్ని గురించి మాట్లాడా లంటే, వాళ్ళో ప్రశ్నార్థకం అని చెప్పొచ్చు. వాళ్లు ఒకే ప్రశ్నను చాలాసార్లు అడిగారని విసుక్కునే ముందు, ఏం సమస్యొచ్చి అన్నిసార్లలా అడుగు తున్నారా అని ఆలోచించాలి. వాళ్లు చెప్తున్నది అర్థం కాకపోతే నెమ్మదిగా మళ్ళీ అడిగి తెల్సుకోవాలి.

సాధారణంగా ఏదైనా సమస్యొచ్చినప్పుడు పిల్లలు ఏదో జబ్బును వంకగా పెట్టుకోవడం, ఇతరులమీద నిందలేయడం, ఎవరిమీదో కోపం చూపించడం, లేదా ఫీలింగ్స్‌ని దాచేసుకోవడం లాంటివి చేస్తారు. అది హానికరంగా వుండనంతవరకూ ఫర్లేదు. కానీ ఎదుటివాళ్ళను బాధపెట్టేలా వుంది అనుకుంటే మాత్రం అది నివారించడానికి ప్రయత్నించడం మంచిది.

మాధ్యమిక దశలో డిప్రెషన్ అన్నది భయంకరమైన జబ్బు.

ఇది చిన్నా, పెద్దా, ఆడ, మగా ప్రతిఒక్కరికీ రావచ్చు.ముఖ్యంగా పసిపిల్లల్లో తల్లిదండ్రుల ప్రవర్తన వలన వస్తుంది. కానీ ఇది పెద్దగా బయటపడదు. అందుకే తల్లిదండ్రులు తమ పిల్లలకు డిప్రెషన్ వుంది అన్న నిజాన్ని ఓ పట్టాన ఒప్పుకోరు.

డిప్రెషన్ వున్న పిల్లలు విషాదంగా, దిగులుగా, అసహనంగా వుంటారు. వాళ్ళు మాటల్లోనూ, చేతల్లోనూ ఏమీ చెప్పకపోయినా, తేలిగ్గా కనిపెట్టెయ్యొచ్చు. దేంట్లోను ఆసక్తిగా పాల్గొనరు, దేనిమీద ఇష్టం చూపరు. ఈ డిప్రెషన్ ఫలితంగా ఆరోగ్యంకూడా దెబ్బతినొచ్చు. తల నొప్పులూ, కడుపు నొప్పులూ, తిండి, నిద్ర మీద అనాసక్తి లాంటివి రావచ్చు. అసంతృప్తిగా కన్పిస్తారు. ఏదీ వీళ్ళకు పెద్ద ఆనందాన్నివ్వదు. తొందరగా చిరాకు పడతారు. తామెందుకు బాధపడుతున్నారో వాళ్ళకే తెలియదు.

ఇంకో విధమైన పిల్లలు డిప్రెషన్‌గా వున్నప్పుడు మరింతగా అల్లరి చేస్తారు. ఎదుటివాళ్ళను రెచ్చగొట్టి కోపం తెప్పించి శాంత పడతారు.

డిప్రెషన్‌ని కనబర్చే విషయంలో పెద్దవాళ్ళకేం తీసిపోరు. కోపం,చిరాకు, ఎదురు చెప్పడంలాంటి స్థాయీ భావాలు ప్రకటిస్తారు. తల్లిదండ్రుల మధ్య గొడవలున్నప్పుడు, ఇంట్లో చెలరేగే అశాంతివల్ల పిల్లలు పక్క తడప డం, స్నేహితులతో పోట్లాడం, చదువులో మందగించడం, అతిశయోక్తులు చెప్పడం, తల్లిదండ్రులకు దగ్గరవ్వాలని ప్రయత్నించడం లాంటివి చేస్తారు.

వయస్సు పెరిగేకొద్దీ, వారు డిప్రెషన్ కనబర్చే విధానాలు మారుతూ వుంటాయి. డిప్రెషన్‌కి ముఖ్య కారణాలు ఏమిటంటే-1. ఏదో శారీరక లోపం వుండడం, 2. ప్రేమ కొరత కావడం, 3. ఏం సాధిం చినా మెప్పుకోలు లేకపోవడం, 4. ఆత్మీయులెవరో చనిపోవడం, 5. తల్లి దండ్రులు విడిపోవడం, లేదా పట్టించుకోక పోవడం లేదా తమ తోబుట్టు వులమీద ఎక్కువ ప్రేమ చూపడం, 6. బీదరికం, 7. కొత్త ప్రదేశాల్లో ఇమడలేకపోవడం, 8. చేయని తప్పుకి శిక్ష అనుభవించాల్సి రావడం, 9. అన్నిటికన్నా ముఖ్యం ప్రేమ విఫలమవటం!

డిప్రెషన్స్‌ని అణచివేయడంవల్ల ఎలాంటి లాభం వుండదు. దీని వల్ల భవిష్యత్తులో పెద్ద ఇబ్బందులు యెదుర్కోవాల్సి వస్తుంది. అందుకే పెద్దవాళ్ళు తమ పిల్లల్ని మనస్సులో ఏదీ దాచుకోకుండా వున్నదున్నట్లు చెప్పేందుకు సహకరించాలి. వారు బాధపడుతూంటే, ఓదార్చే బదులు, వాళ్ళను వాళ్ళకే వదిలివేయాలి. దీనివల్ల ఇలాంటి సమస్యల్ని తమంతట తాము పరిష్కరించుకునే స్థితికి వారెదుగుతారు.

వాళ్ళో కొత్త వ్యాపకమో, కొత్త ఆటో, కొత్త హాబీయో, కొత్త ప్రదేశం వెళ్ళడమో లాంటి వాట్లో తమను తాము నిమగ్నమయ్యేలా చూడాలి. దీనివల్ల వాళ్ళు తమ బాధను కొంతవరకు మర్చిపోగలరు. వాటిల్లో ఏదైనా విజయం సాధించేందుకు సహకరించడంవల్ల మనం వాళ్ళ బాధనుండి పూర్తిగా విముక్తుల్ని చేయగలం. ఎందుకంటే కొత్తగా సాధిం చిన విజయం వాళ్ళలో ఆత్మవిశ్వాసాన్ని, ఉత్తేజాన్ని కలుగజేస్తుంది.

ఇంట్లో ఓ కొత్త వంటకం చేయడం, లేదా హోటల్‌కి తీస్కెళ్ళడం, లేదా స్కూలుకి బదులు ఏదైనా పిక్నిక్‌కి తీస్కెళ్ళడం లాంటి చిన్నచిన్నపన్లతో కూడా వాళ్ళలోని డిప్రెషన్‌ని కొంత తగ్గించవచ్చు.

పిల్లలు చెప్తున్న విషయాన్ని యెటువంటి విమర్శలూ, తీర్పులూ లేకుండా సహనంగా, సానుభూతిగా వినాలి. వారికా టైంలో మన సహకారం చాలా అవసరం. వారా వయసులో తమ సమస్యల్ని తామే పరిష్కరించగలిగే స్థితికి చేరుకోగలిగితే భవిష్యత్తులో ఎంత క్లిష్ట పరిస్థితులైనా ఎదుర్కోగలరు. దీంట్లో పెద్దవాళ్ళ పాత్ర ఎంతైనా వుంది.

**మూడవ దశ :**

దీన్నే 'అడాలసెన్స్' అని కూడా అంటారు. ఈ దశ పధ్నాలుగేళ్ళ నుండి పంధొమ్మిదేళ్ళ వరకు వుంటుంది. (కొంతమందికి అరవై ఏళ్ళు వచ్చినా పోదు. అది వేరే సంగతి.) ఈ వయస్సులో ఒక్కోసారి ఎంత చురుగ్గా వుంటారో, అంత మందకొడిగానూ వుంటారు. ఎంత చిన్న విషయానికైనా ఎంత పెద్దగా నవ్వుతారో, అంత చిన్న బాధకే పెద్దగా ఏడవనూగలరు. వీళ్ళ మనస్తత్వం ఎప్పుడూ విపరీతంగానే వుంటుంది. ఒకేసారి ఆనందపు శిఖరాలెక్కి, ఆవేదనల అగాధాల్లోకి పడిపోగలరు.అందుకే ఈ దశను 'టైం ఆఫ్ స్ట్రెస్ అండ్ స్టార్మ్ అండ్ గ్రోత్' అంటారు. మొత్తానికి ఇదో సంక్లిష్ట దశ. ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సులు రావడానికి, ఆత్మన్యూనతా భావాలకి ఇదో సరయిన టైం. మానసికంగా చాలా సున్నితమైన స్థితిలో వుంటారు.

ఈ వయసులో వాళ్ళు గుర్తింపుని కోరుకుంటారు.

అది దొరక్కపోతే ఆత్మన్యూనతా భావాన్ని పెంచుకుంటారు. ప్రస్తుతం ఈ తరం టీనేజ్ మరీ విపరీతమైన టెన్షన్ వాతావరణంలో పెరుగుతోంది. సెక్స్, వయొలెన్స్, దిగజారిన నైతిక విలువలు ప్రబలిపోతున్న వాతావరణంలో పెరుగుతున్న వాళ్ళు అయోమయంలో కొట్టుకుపోతున్నారు. దీనికితోడు-పట్టించుకోని తల్లిదండ్రులు, మంచి, చెడు

నేర్పే సత్తాలేని ఉపాధ్యాయులు, డ్రగ్స్, వెస్టర్న్ కల్చర్, తాగుడు, ప్రమాదకరమయిన సెక్స్‌నుంచి పిల్లల్ని కాపాడుకునే బాధ్యత తల్లిదండ్రులకు కత్తిమీద సాము లాంటిది. ఈ తరం ముఖ్యంగా రేపటిమీదా, ఆశయాల మీద నిరాసక్తతతో కృంగిపోతున్నారు. స్పీడు యుగం, యుద్ధాలు, మారణహోమాలు, బాంబులు, కాలుష్యాలు, రాజకీయాలు, నిరుద్యోగాలు లాంటి సమస్యల్ని తప్పించుకోవడానికి క్షణికానందాలు వెదుక్కుంటున్నారు. ఇక్కడ గమనించాల్సిన ముఖ్య విషయమేమిటంటే ఎప్పుడో భవిష్యత్తుల్లో రాబోయే సమస్యల నుంచి తప్పించుకోవడానికి యిప్పుడు సమస్యలు సృష్టించుకుంటున్నారని.

దీనికి వాళ్ళను తప్పుపట్టే బదులు, మనం మొత్తం సిస్టమ్‌నే సమీక్షించాలి. చాలామంది యింట్లో సరయిన వాతావరణం వుండదు. నాలుగు కాలాలపాటు చల్లగా నిలిచే పెళ్ళిళ్లు చాలా తక్కువ. ఇది వాళ్లలో డిప్రెషన్‌ని కలిగిస్తుంది. అంతేకాదు, ఈ తరంవాళ్లకి తమ పూర్వీకుల్లా పెద్ద కష్టపడాల్సిన పనిలేదు. మైళ్ల తరబడి నడిచివెళ్ళి చదువుకునే అవసరం లేదు. అన్ని దురలవాట్లూ అందుబాట్లో వుంటాయి. మన పూర్వీకులు అతి కష్టంమీద సాధించిన స్వాతంత్ర్యం విలువ తెలీదు. నిరాశా నిస్పృహల్ని, భ్రమల్ని ఎలా ఎదుర్కోవాలో తెలీదు....అందుకే ప్రతి చిన్న విషయమూ సమస్యలా కన్పిస్తుంది. ప్రతిదానికి ఇన్‌స్టెంట్ జవాబులు వెదుకుతారు. డ్రగ్స్‌లాంటి వాటికి అలవాటు పడతారు.

ఈ టీనేజ్ వయసు బాల్యానికి, పరిపూర్ణ వ్యక్తిత్వానికి ఓ వారధి లాంటిది. గుర్తింపు కోసం పాకులాట ఇక్కడ్నుంచే మొదలవుతుంది. జీవితంలో 'ఫలానా' అవడానికి ఇక్కడ్నుంచే కృషి, ట్రైనింగ్ మొదలవుతుంది. ఇవన్నీ సరిగ్గా జరిగితే మంచి భవిష్యత్తు వుంటుంది. కానీ యివి సాధించడానికి చేసే కృషిలోనే రకరకాల సమస్యలెదురవుతాయి. చిన్నవాళ్ళు నిర్ణయాల విషయంలో స్వతంత్రంగా ప్రవర్తించాలని చూస్తారు. గొడవలు మొదలవుతాయి.

ఈ దశలో ఈ నూనూగుమీసాల యువకులు స్నేహితులకోనూ, తమ వయసువారితోనూ ఎక్కువ సమయం గడపడానికి ఇష్టపడతారు. ఎదుటివాళ్ళ సలహాలూ, విమర్శలూ వినడానికి ఇష్టపడరు. సెల్ఫ్ సెంటర్డ్‌గా ఆలోచించడం మొదలుపెడతారు నమ్మదగ్గ స్నేహితులతో గాఢంగా అల్లుకుపోతారు. తమ నెవరైనా పట్టించుకోకపోవడం, గుర్తించక పోవడం, మెచ్చుకోకపోవడం లాంటివి వారిని భయపెడతాయి.

తల్లిదండ్రులు ఈ మార్పులన్నిటినీ సహజమైనవని గుర్తించి చాలా జాగ్రత్తగా, తగు విధంగా ప్రవర్తించాలి. లేదా వారు ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం లేని అసమర్థులుగా తయారయ్యే ప్రమాదం వుంది.

టీనేజ్ మొదట్లో....అంటే పదమూడేళ్ళ నుంచి పదహారేళ్ళ కాలం వరకు డిప్రెషన్ కాస్త పేపుగా వుంటుంది. విమర్శలకు వారు తీవ్రంగా స్పందిస్తారు. ఎవ్వరి గురించి ఆత్రుత చూపరు, బాధపడరు. ఆలోచించడం కంటే వాళ్ళేదయినా చేయడంపట్ల ఆసక్తి చూపుతారు. డిప్రెషన్‌ని ఏదో విధంగా బయటకు కనపర్చాలని ప్రయత్నిస్తారు ఎంత విశ్రాంతి తీసు కున్నా వెంటనే అలసిపోతారు. ఏమాత్రం శారీరక మార్పులు వచ్చినా తీవ్రంగా భయపడిపోతారు. ఏ విషయంలోనూ ఏకాగ్రత చూపలేకపోవడం, ఈ లక్షణాలు ఏ మోతాదులో కన్పించినా, అది డిప్రెషన్‌కే సంకేతం. బోర్‌గా, రెస్ట్‌లెస్‌గా కన్పిస్తారు. ఏదైనా మంచి వ్యాపకంలో వాళ్ళను బిజీ చేయడంవల్ల డిప్రెషన్‌ని చాలావరకు పోగొట్టవచ్చు. ఎందుకంటే వాళ్ళ మనసులు చాలా లేతవి. ఏటొచ్చీ, ఆ వ్యాపకాలు కూడా వాళ్ళకు బోర్ కొట్టకుండా చూస్కోవాలి. కొంతమంది ఒంటరితనమంటే విపరీ తంగా భయపడుతూ వుంటారు. తమకోసం సమయం, ఓర్పు వెచ్చించే వాళ్ళంటే మొగ్గు చూపుతారు. ఫ్రెండ్లోనే చాలా సమయం వృధా చేసి, చదువు, ఆటలు, అలక్ష్యం చేసి ఎటూ కాకుండా పోతారు. మరికొంత మంది పూర్తి ఒంటరితనాన్ని కోరుకుంటారు. తాము చేయగల ఏ పని మీదైనా ఎక్కువగా ఉత్సాహం, తెలివితేటలు చూపి మంచి విజయాలు సాధిస్తారు.

కొంతమంది టీనేజర్స్ ఎప్పుడూ ఎవరివో సహాయ సహకారాల కోసం ఎదుర్చూస్తుంటారు. అవి దొరకనప్పుడు కోపం, చిరాకు ప్రదర్శించడం, పారిపోవడం, దొంగిలించడం లాంటి విపరీతమైన, సంఘవిద్రోహ చర్యలు చేస్తుంటారు. ఇలాంటివి చేయటంవలన ఏదో సాధించామన్న ఫీలింగ్ ఇచ్చే సంతృప్తితో వీరు తమ సమస్యల్ని మర్చిపోవటానికి ప్రయత్నిస్తారు. దీనికి మెచ్చుకోలు లభిస్తే మరింతగా రెచ్చిపోతారు. ఎప్పుడో ఒకసారి పెద్ద దెబ్బతింటారు.

పదహారేళ్ళనుండి, పంధొమ్మిదేళ్ళవరకు వుండే పిల్లలు తమ డిప్రెషన్‌ని నేరుగా ప్రదర్శిస్తారు. డ్రగ్స్‌కి అలవాటు పడడం, సెక్స్ కోసం ప్రాకులాడ్డం, ఆత్మహత్యా ప్రయత్నాలు చేయడం, ఒంటరితనంతో గడపడం, అందరికీ దూరంగా మసలడం లాంటివి చేస్తారు. ఏదో ప్రపంచమంతా తమ మీద కక్ష కట్టినట్టు, తమనర్ధం చేసుకునే వారూ, ప్రేమించే వారూ, ఆదరించేవారు ఎవరూ లేనట్టు తమ మీద తామే జాలి పెంచుకుని, అది అడ్డుపెట్టుకొని ఇలాంటి చర్యలకు పూనుకుంటారు. ఈ స్థితిలోనే అవతలి సెక్స్ నుంచి రికగ్నిషన్ రాగానే అదే ప్రేమ అన్న భావంతో, ఒక 'మధురమైన' బాధలో పడిపోతారు. ఇదంతా స్వభావసిద్ధమే. అయితే ఈ ప్రేమలోంచి ప్రేరణ పొందాలే తప్ప డిప్రెస్ అవకూడదు అని గ్రహించాలి. (దీనిని గురించి వివరంగా 'లేడీస్ హాస్టల్' అన్న నవలలో వ్రాశాను.)

## అడొలసెంట్స్‌ని అర్థం చేసుకోవడం :

ఇది అన్నింటికైనా కష్టమైన పని. ఈ దశలో వున్న స్ట్రెస్, స్ట్రెయిన్ మరే దశలోనూ అంతగా కన్పించవు. యూనివర్సిటీ క్యాంపస్‌ల లోనూ, హిప్పీల్లోనూ, స్కిజోఫ్రినియా జబ్బుతో బాధపడేవాళ్ళలోనూ ఇది కన్పించిపోతూ వుంటుంది. సంఘంలోని కట్టుబాట్లకు ఎప్పుడూ రెబెల్లియన్‌గా పోట్లాడేవాళ్లు అడొలసెంట్స్ అయ్యుంటారు. వారి భాష, ప్రవర్తన ఎంత తేడాగా వుంటుందంటే అసలు వాళ్లు బ్రతికేది వేరే

ప్రపంచంలోనేమో అనే భావన మనకు కలుగుతుంది. తల్లిదండ్రులూ, వాళ్ళతో మెలిగే ఇతర పెద్దవాళ్లు, వాళ్ళను సరిగ్గా అర్థం చేసుకోలేక తల క్రిందులై పోతూ వుంటారు. వీరికి, పెద్దవాళ్ళకి మధ్య వున్న తేడానే 'జనరేషన్ గ్యాప్' అంటారు. జనరేషన్ గ్యాప్ అన్నది ఎందుకువస్తుందో ఎలాంటి పరిస్థితుల్ని ఈ అడాలసెంట్స్ ఎదుర్కొంటారో తెల్సుకోవడం చాలా అవసరం. ఈ అడాలసెంట్స్ ఎదుర్కొనే సమస్యల్ని తెల్సుకునే ముందు, వారికా దశలో ఏమేమి జరుగుతూ వుంటుందో తెల్సుకోవాలి. అడాలసెన్స్ అంటే అడల్ట్‌కి బాల్యానికి మధ్య వుండే దశ. ఈ దశ మొదలయ్యే ముందు, చిన్నపిల్లల మనస్తత్వం వుంటుంది. అంతమయ్యే సరికి పెద్దవాళ్ళయిపోతారు. ఈ దశలోనే అతిముఖ్యమైన శారీరక,మానసిక మార్పులూ కలుగుతాయి. ఇవన్నీ కూడా వారి ప్రాబ్లమ్స్‌కి కారణాలవు తాయి.

పెద్దవాళ్ళు, ముఖ్యంగా తల్లిదండ్రులూ, టీచర్లూ వారి మనస్తత్వాలు ఆలోచనా విధానం, వీరి అశాంతికి తోడ్పడతాయి. పెద్దవాళ్ళలా వీరినొకోసారి చిన్నపిల్లలగానూ, మరొకోసారి పెద్దవాళ్ళలా బాధ్యతాయుతంగానూ ప్రవర్తించాలని కోరుకుంటారు. ఇది అడాలసెంట్స్‌ని అయోమయంలో పడేస్తూ వుంటుంది. తను చిన్నపిల్లవాడో, పెద్దవాడో ఆ కుర్రాడికి అర్థం కాదు.

చుట్టూ వున్న స్నేహబృందం కూడా వీరికీ, వీరి తల్లిదండ్రులకి మధ్య గొడవలు ఉత్పన్నమవడానికి తోడ్పడతారు. తాము మరింత స్వతంత్రంగా, స్వేచ్ఛగా బ్రతకగలగాలని వీరు కోరుకుంటారు. ఇంట్లో వాళ్ళకంటే స్నేహితుల మీద ఎక్కువ ఆసక్తిని చూపిస్తారు. ముఖ్యంగా ఆపోజిట్ సెక్స్‌వైపు మొగ్గుతారు. ఇంట్లో కంటే బయట సమయం గడిపేయడానికి ఎక్కువ ఇష్టపడతారు. ఇది తల్లిదండ్రులకు ఆందోళన కలిగిస్తుంది. పిల్లవాడు చేయిదాటిపోతున్నాడని వారి బాధ. చుట్టూ వున్న మనుష్యులూ, సాంఘిక పరిస్థితి వీరి ప్రాబ్లమ్స్‌కి దోహదపడే మరో

కారణం. కాలంతోపాటు మారే జీవన విధానాలూ, విలువలూ, ఆలోచనా సరళి వీరిని అయోమయంలో వుంచుతుంది. సెక్స్‌ని గురించి చర్చించడం ఇప్పుడు మరీ పెద్ద తప్పుగా పరిగణించబడటంలేదు. విలువల కంటే ఆనందంగా జీవించగలగడం మీద ఎక్కువ ఆసక్తి కలుగుతోంది. యుద్ధాలు, మత కలహాలు, పెరుగుతూన్న అరాచకత్వం మన మోరల్స్‌ని పూర్తిగా మార్చేస్తున్నాయి. ఇవన్నీ (సాంఘిక మార్పులు) మన అడాలసెంట్స్ ఎదుర్కోవల్సిన ప్రాబ్లమ్‌లో ఓ భాగం.

**అడాలసెన్స్‌లో ఎదురయ్యే శారీరక, మానసిక మార్పులు :**

పెరుగుదల, అభివృద్ధి అన్నది జీవితాంతం వుండే ప్రాసెస్‌లు. అయితే అడాలసెన్స్‌లో ఈ పెరుగుదల మరింత వేగంగా, చురుగ్గా కన్పిస్తుంది. పొడుగు పెరగడం, బరువు పెరగడం ఈ వయస్సులో మరీ ఎక్కువ. ఈ మార్పు ఒక్కొక్కరిలో ఒకో దశలో వుండగా వస్తుంది. మరీ త్వరగా, లేదా మరీ ఆలస్యంగా ఈ మార్పులకి గురైన వాళ్ళు అందరిలోకి వేరుగా కన్పిస్తారు. వీరు తమ గురించి తామే తక్కువగా (లేదా ఎక్కువగా) ఫీలవడం మొదలుపెడతారు. ఇక్కడి నుంచి వీరి ప్రాబ్లమ్స్ మొదలవుతాయి.

అయితే ఈ అడాలసెన్సీలో ఎదురయ్యే మానసికమైన మార్పులకు, శారీరక మార్పులకన్నా ఎక్కువ ప్రాముఖ్యత వుంటుంది. ఈ వయస్సులో మీరు సెక్సువల్‌గా మెచ్యూర్ అవుతారు. అబ్బాయిలు పురుషులుగాను, అమ్మాయి స్త్రీలుగానూ పరిగణించబడతారు. పురుషులైతే గడ్డాలూ, మీసాలు, గొంతులో మార్పులూ కన్పిస్తాయి. స్త్రీలలో వక్షోజాల పెరుగుదల, ముఖాన మొటిమలు, నడుము సన్నబడటంలాంటి మార్పులువస్తాయి. అమ్మాయిలైనా, అబ్బాయిలైనా తమలో కలిగే మార్పులను గురించి తెల్సుకోవడం మొదలుపెడతారు. అందంగా కన్పించడానికి, ఆకర్షణీయంగా చలాకీగానూ వుండడానికి తాపత్రయపడతారు. ఆపోజిట్ సెక్స్ వారిని ఆకర్షించడానికి, వారిని మెప్పించడానికి ఆరాటపడుతూ వుంటారు.

అబ్బాయిల్లో స్వప్న స్ఖలనాలు, అమ్మాయిల్లో సుదీర్ఘ చింతనాలూ మొదలవు తాయి.

సెక్స్ కోరికలు కలగడం కూడా కద్దు. అయితే వారి కోరికలు తీరే మార్గాలు మాత్రం వుండవు. పుస్తకాల్లోనూ, పేపర్లలోనూ, సినిమాల్లోనూ, అడ్వర్‌టైజ్‌మెంట్లలోనూ బహిరంగంగా కన్పించే సెక్స్ ఆసక్తిని రేకెత్తిం స్తుంది. స్నేహితులతో దీని గురించి చర్చించడం, బూతు జోకులు చెప్పు కోవడం సామాన్యమైపోతుంది. ఏమీ చేయలేని స్థితిలో వాళ్ళలాంటి పస్లకి పూనుకుంటారు.

సెక్స్ కోరికలు తీర్చుకోవడమంటే, పెళ్ళి ద్వారానే అన్న సాంప్ర దాయానికి మన దేశంలో యింకా విలువుంది. పెళ్ళి చేసుకోవాలంటే, ఓ వ్యక్తి తనని తానే కాకుండా తన భార్యాబిడ్డల్ని కూడ పోషించుకోగలిగే స్థితిలో వుండాలి. ఓ టీనేజర్ ఉద్యోగం సంగతటుంచి, ఇంకా చదువే పూర్తికాని స్థితిలో పెళ్ళి గురించేం ఆలోచించగలడు? అయితే కొంతమంది కుర్రాళ్ళ తమ కోరికల్నదుపులో వుంచుకోలేక, పెళ్ళిచేసేస్కుని,ఉద్యోగం, సంపాదనా లేక తల్లిదండ్రులమీద ఆధారపడి, ఆత్మగౌరవం లేకుండా బ్రతికేస్తున్నారు. ఈ విషయం దగ్గర చాలామంది అడాలసెంట్స్ కాంఫ్లి క్ట్సకి లోనవుతారు. ఇలాంటి నిర్ణయాలకి కల్చర్ కూడా చాలా తోడ్పడు తుంది.

కుర్రవాడు బాల్యంలో ఉన్నంతవరకూ, తల్లిదండ్రులు అతన్ని కంట్రోల్లో ఉంచగలుగుతారు. వారికివ్వవలసిన స్వేచ్ఛ వారికిచ్చినా, వారిని కంట్రోల్లో వుంచగలమన్న ధీమా తల్లిదండ్రుల్లో వుంటుంది. అయితే టీనేజ్‌లో యిది సాధ్యపడదు. ఈ దశలో వారు తమలో కలిగే శారీరక మార్పుల్ని విచిత్రంగా గమనిస్తూ ఉంటారు. తమకు కలిగే అనుమానాల్నీ, ఆందోళనల్నీ తల్లిదండ్రుల దగ్గర వెలిబుచ్చి సమాధానాలు తెల్సుకోవాలను కుంటారు. అయితే వారేసే ప్రశ్నలకి సమాధానాలు చెప్పడానికి తల్లి దండ్రులు సుముఖత చూపరు. పైగా, తిట్టి నోరు మూయిస్తారు. సెక్స్

గురించిన అనుమానాలు వెలిబుచ్చినప్పుడు ఈ ఇబ్బంది తప్పనిసరి తల్లి దండ్రులు తమనుంచి ఏదో కొత్త విషయం దాస్తున్నారన్న విషయం వారికి అర్థమవుతుంది. దాంతో ఆ సమాధానాలేవో తామే స్వయంగా తెల్సుకోవా లని నిర్ణయించుకుంటారు. అదే సమయంలో తమ తోటిపిల్లలు కూడా ఇలాంటి స్థితిలోనే వున్నారని అర్థం చేసుకుంటారు. దీంతో వారిమధ్య ఆ విషయాలను గురించి చర్చలు, అభిప్రాయాలు ఏర్పర్చుకోవడంలాంటివి జరుగుతాయి. అందరు పిల్లలకీ ఈ దశలో తల్లిదండ్రులు తమ నుంచి ఏదో దాచేస్తున్నారని ఉక్రోషంవల్ల కలిగే కసి తప్పకుండా వుంటుంది. అందుకే వాళ్లు కూడా తమ ఆలోచనల్నీ, అనుమానాల్నీ, ఇబ్బందుల్నీ తమ లోనే దాచుకోవడం మొదలుపెడతారు. ఈ వయసులో విద్యార్థులకి చాలా స్పేర్ టైమ్ ఉంటుంది. భర్తలు ఆఫీసులకి వెళ్ళిన తరువాత యిళ్ళల్లో ఖాళీగా వుండే 'ఆంటీ'లతో హస్కు మొదలుపెడతారు. కొత్త విషయాలు తెలుసుకోవాలన్న ఈ కుర్రవాళ్ళ తపనని 'ఆంటీ'లు కొందరు రెచ్చగొడ తారు.

ఒక్కొక్క స్త్రీని 'గెలవటం' ఒక్కొక్క విజయంగా భావించే మనస్తత్వం ఈ వయసులోనే పెరగటం ప్రారంభమవుతుంది.

పెద్దలకి దూరంగా తమకంటూ ఓ క్రొత్త ప్రపంచాన్ని సృష్టించు కోవడం మొదలుపెడతారు. తల్లిదండ్రులు పిల్లలు తమకి దూరం అయి పోతున్నారన్న విషయం క్రమ క్రమంగా తెల్సుకుంటారు. కానీ, గ్యాప్‌ని ఎలా పూర్తిచేయాలో తెలీని స్థితిలో మిగిలిపోతారు.

ఈ టీనేజ్‌లో పిల్లలు తమ స్నేహితులతో కాలం వెళ్ళబుచ్చడానికి ఎక్కువ ఇష్టపడతారు. ఎందుకంటే అందరూ ఒకే పడవలో ప్రయాణం చేస్తున్నవారు కాబట్టి. ఇలా వాళ్ళు స్నేహితులతో తిరిగి సమయం వృధా చేస్తూవుంటే, వారు చదువు నిర్లక్ష్యం చేస్తున్నారేమోననే భయంతో తల్లి దండ్రులు వారిని మందలించో, తిట్టో దారిలో పెట్టాలనుకుంటారు. ఇది పిల్లల్ని మరింత రెచ్చగొడుతుంది తాము చాలా ఎదిగిపోయినట్లు తమ

కన్నీ బాధ్యతలు తెల్సును కానీ, తల్లిదండ్రులు తమని పిల్లల్లా ట్రీట్ చేశారని వీరి అభియోగం.

అసాధారణమైన సెక్స్ కథలు, పార్టీలు, డ్రగ్స్‌లాంటివి టీనేజర్స్ జీవితాల్లోకి మెల్లి మెల్లిగా ప్రవేశించడం తల్లిదండ్రుల్లో దిగులుకలిగిస్తుంది. అందుకని వారు మరింత స్ట్రిక్ట్‌గా వుండడం ప్రారంభిస్తారు. అయితేపిల్లలు తమకు తెలీకుండా ఏయే పనులకు పూనుకుంటున్నారో అది ప్రపంచం మొత్తానికి మాత్రం తెలుస్తుంది.

పిల్లల అకృత్యాల గురించి ఆఖరుగా తెల్సేది ఒక్కతల్లి దండ్రులకే.

తల్లి దండ్రులకి, అడాలసెంట్ పిల్లలకీమధ్య ఆ విధమైన ప్రాబ్లమ్స్ వచ్చేది ఒక మధ్య తరగతి లేదా పై తరగతుల్లోనే. మరీ క్రింద తరగతి వాళ్ళలో ఇలాంటి భేదాభిప్రాయాలు పట్టించుకోరు. టీనేజ్ వయస్సు వచ్చే సరికే వారు స్కూలు కెళ్ళడం మానేసుంటారు. ఏదో ఒక చిన్న పని చేసుకుంటూ వుంటారు. డబ్బుకోసం ఎవరిమీదా ఆధారపడకుండా స్వతం త్రంగా బ్రతకడంవల్ల ఇంట్లో ఎవరూ ఏమీ అడ్డు చెప్పరు. ఏ పనీ లేనప్పుడు ఏ వీధి మొదట్లోనో, రోడ్డు ప్రక్కనో తనలాంటి వాళ్ళతోనే టైం గడిపేస్తూ వుంటారు. తల్లిదండ్రులు చూసిన ఏ పిల్లనో పెళ్ళి చేసుకుని, పిల్లల్ని కని పోషిస్తూ వుంటారు. ఈ టీనేజ్ వయస్సులో వుండాల్సిన మామూలు స్ట్రెస్, స్ట్రెయిన్ లాంటివి వీళ్ళలో కన్పించవు. వారు తమ క్కావలసిన స్వాతంత్ర్యం, సెక్స్‌కోరికలు తీరేమార్గం. బ్రతక డానికి ఏదో ఒక పని ఎప్పటికప్పుడు సంపాదించేసుకుంటారు. కాబట్టి, వీరి జీవితాల్లో పెద్ద సంఘర్షణలు తలెత్తవు.

మధ్యతరగతి, పై తరగతికి చెందిన వాళ్ళలో ఈదశలో ఎక్కువగా సమస్యలు తలెత్తడానికి కారణం వారింకా చదువుకుంటూ, తల్లి దండ్రుల మీద ఆధారపడి బ్రతకాల్సి రావడమే. ఈ ఆధారపడడం మూలంగా వారు ఇష్టంలేకపోయినా తల్లిదండ్రులతో రాజీ పడిపోతూ వుంటారు. అంతేకాక ఒకవైపు కోరిక వుంటుంది. కానీ పెళ్ళికాకుండా సెక్స్‌లో

పాల్గొనడం తప్పనే భయం వీరి నరనరాల్లో వ్యాపించిపోయి వుంటుంది. ముఖ్యంగా అమ్మాయిలు అలాంటి వాటిలో తల దూర్చాలంటే గిల్టీగా ఫీలవుతూ వుంటారు. పైగా పెద్ద చదువులు చదువుకుని, మంచి స్థితికి ఎదగాలన్న తపన వారిని తల్లిదండ్రులతో రాజీపడేలా చేస్తుంది. కాబట్టి సెక్స్, కెరియర్, తల్లిదండ్రుల చేతుల్నుంచి స్వాతంత్ర్యంలాంటి మూడు కాన్‌ఫ్లిక్టింగ్ అవసరాల మధ్య కుర్రవాళ్ళు నలిగిపోతూ వుంటారు. సామాజిక స్థితిగతులు అడాలసెంట్స్‌మీద ఎలాంటిప్రభావం చూపిస్తాయనేది అందరిలోనూ ఆసక్తిని కలిగించే చర్చ. యుద్ధాలూ, రక్తపాతాలనూ చవి చూసిన దేశాలకు భవిష్యత్తు అంతా అస్పష్టంగావుంది. మనిషి తన మేధస్సు నంతా ఉపయోగించి కనుగొన్న బాంబులు, మిసైల్స్‌ని ఊహించుకుంటే, మనకు భవిష్యత్తు పెద్ద ఆశాజనకంగా కన్పించదు. అందుకే రేపటి గురించి మర్చిపోయి, ఈ క్షణం అనుభవించాలన్న ఆలోచన కలుగుతుంది.'రేపనేది వస్తుందో రాదో, అందుకే ఈ రోజునే ఆనందంగా అనుభవించు' అన్నది వీరి సిద్ధాంతం. 'ఈ క్షణం' సిద్ధాంతం అనేది సెక్స్ విషయంలో గొప్ప గొప్ప విప్లవాలకు దారి తీసింది. సెక్స్ గురించిన ఆలోచనలు మారిపోతున్నాయి. పూర్వం, పెళ్ళికి ముందు సెక్స్ అన్నది అసలు ఊహించరాని విషయం. ఎవరో అలాంటి పన్లకి పాల్పడినవారు గిల్టీగా ఫీలయ్యేవారు. కానీ ఇప్పుడు మాత్రం అలాంటి గిల్టీ ఫీలింగ్స్ లేవు. పెళ్ళికిముందు సెక్స్ సర్వసాధారణం అయిపోయింది. ప్రస్తుత సమాజంలో లేటెస్ట్ సర్వే ప్రకారం యువతీ - యువకుల్లో వందమందిలో యాభై మంది సెక్స్‌ని అనుభవించిన వాళ్ళే. గర్భనిరోధక సాధనాలను గురించిన ప్రకటనలు, ఏ మాత్రం జంకు లేకుండా ఈ పనులకు పాల్పడేందుకు దోహదపడుతున్నాయి. అయినా, పెళ్ళికాని తల్లులేం తక్కువ మంది లేరు. ఇక్కడ గమనించాల్సిన ముఖ్య విషయమొకటుంది. అందరూ గోలపెట్టే విధంగా అమ్మాయిలు సెక్స్‌లో వేరేవేరే వ్యక్తులతో పాల్గొనరు.

కేవలం ఒక వ్యక్తినే తమ పార్ట్‌నర్‌గా ఎంచుకుంటున్నారు. అదీ తాము వివాహం చేసుకుందామని కోరుకునే వ్యక్తినే. అయితే ఇలాటి విషయాలు 'వివాహం'తో పూర్తి అవవు.

సెక్స్ అనే పదం మనలో చాలా ఆసక్తి కలిగిస్తుంది. మన సాహిత్యం, వార్తా పత్రికలు, రేడియోలు, టీ.వీ.లు, ప్రకటనలు, ఫ్యాషన్స్ అన్నీ సెక్స్ విషయంలో ఇంకా-ఇంకా ఆసక్తిని కలిగిస్తూనే వుంటాయి. నార్మల్‌గానే కాకుండా హోమోసెక్సువాలిటీ, లెస్బియనిజమ్‌కూడా సాధారణ విషయాలుగా చర్చించబడుతున్నాయి. ఇలాంటి చేదునిజాలన్నీ మన పిల్లల లేత మనసుల్లో అల్లకల్లోలాలు సృష్టిస్తున్నాయి.

సాంఘిక జీవనంలో వచ్చిన మరో ముఖ్యమైన మార్పు - కుల మతాలకూ, సాంప్రదాయాలకూ మనల్ని అదుపులో వుంచే శక్తి తగ్గిపోవడం. దేవుడు చాలా శక్తిమంతుడనీ, దయామయుడనీ, మరణం తర్వాత మనకు మంచి జీవితాన్ని ప్రసాదిస్తాడనీ నమ్మడం ప్రస్తుతం మూర్ఖత్వంలా అనుకోబడుతోంది. అందుకని, ప్రార్థనలూ, ధర్మబోధలూ, తగ్గిపోతున్నాయి. దేవుడు కేవలం మొక్కుబడులకోసం పనిచేసే బ్రోకరు అయిపోయాడు.

చాలామంది అడాలసెంట్స్‌కి ఎదురయ్యే కామన్ ప్రాబ్లమ్ వారి విచ్ఛిన్నమైన కుటుంబ జీవనం. ఇలా కూలిపోయిన సంసారాల్లోంచి వచ్చిన పిల్లలు మరింతగా ప్రాబ్లమ్స్ యెదుర్కోవాల్సి వస్తుంది. తల్లిదండ్రులు విడిపోతే, ఎక్కువగా నష్టపోయేది పిల్లలే. వారికి తల్లిదండ్రుల ప్రేమకొరత ఎప్పటికీ వుండిపోతుంది. ఇద్దరి మనస్పర్థల మధ్య వారు బలిపశువులయే అవకాశా లెక్కువ. వారు ఒంటరిగా, దిగులుగా, ఫ్రస్ట్రేటెడ్‌గా మారిపొయ్యే ప్రమాదముంది. అంతేకాక, వారు భవిష్యత్తులో అందరికీ ఒక తల నొప్పిలా తయారయినా. ఆశ్చర్యపడాల్సిందేం లేదు. అందుకే అడాలసెంట్స్‌కి వుండే ప్రాబ్లమ్స్‌కి విచ్ఛిన్నకరమైన కుటుంబాలు చాలా పెద్ద కారణాలవుతాయి.

పిల్లల్లో 'నేర్చుకునే' గుణాలు :

ఇవి మూడు రకాలుగా అలవడతాయి.

1) అలవాటునుంచి నేర్చుకోవడం : ఉదాహరణకి బిడ్డకు రోజూ స్వీట్స్ తెచ్చే తండ్రివుంటే;తండ్రి వస్తున్నాడంటే, స్వీట్స్ ఇవ్వడంకోసమే నని బిడ్డ అర్థం చేసుకుంటాడు. అందుకే ఏ మాత్రం జంకు, సందేహం లేకుండా, ఎదురెళ్ళి అవి అందుకుంటాడు. బెల్ కొట్టగానే లంచ్ అన్న విషయం మొదటిరోజే నేర్చుకుంటాడు. ఇంట్లో చుట్టాలందరూ వుండగా తనేడిస్తే, తల్లి ఏమడిగితే అదిస్తుందన్న విషయం బిడ్డకు ఒకసారి అర్థ మవ్వగానే అతడు రెండోసారి తప్పక అలాగే చేస్తాడు. మొండితనంవల్ల ఏదైనా సాధించగలమన్న ధీమా వస్తే ఆ పద్ధతినే అవలంబిస్తాడు. దీన్నే 'కండీషనింగ్' అని కూడా అంటారు.

2. తప్పులద్వారా నేర్చుకోవడం : ఏదయినా నేర్చుకోవడంలో "తప్పు" తోడ్పడుతుంది. ఒకటి రెండుసార్లు తప్పులు దొర్లినా, చేసిన పనినే రకరకాల పద్ధతులు మార్చి చేయడంవల్ల నైపుణ్యత పెరుగుతుంది. ఏ పద్ధతివల్ల అయితే మనం తేలిగ్గా, సమయం ఆదాచేసి, చేయగలుగు తున్నామో అదే పద్ధతిని పర్మినెంటుగా అవలంబించడం జరుగుతుంది. వాహనాలు నడపటం, కుట్టుమిషను నేర్చుకోవడం, సైకిలు తొక్కడం, ఈతకొట్టడం, వంట చేయటం లాంటి వాటికి ఈ పద్ధతి తోడ్పడుతుంది.

3. తార్కిక జ్ఞానం అలవర్చుకోవడం : దీన్నే ఇంగ్లీషులో 'ఇన్ సైట్ ఫుల్ లెర్నింగ్' అని అంటారు. ఓ చిక్కు సమస్యను తార్కికంగా ఆలోచించి, ఓ వినూత్నమయిన పరిష్కారం కనుక్కోవడం దీని లక్షణం. మన సమస్యకు పరిష్కారం ఓ ఫ్లాష్‌లా తడుతుంది. ఎంత ఆలోచించినా అంతుబట్టని పరిష్కారాలు, ఏదో పన్లో బిజీగా వున్నప్పుడు కూడా ఓ మెరుపులా స్ట్రైక్ అవుతాయి. ఆర్కిమెడిస్ తన 'ప్రిన్సిపల్ ఆఫ్ గ్రావిటీ'ని, న్యూటన్ తన 'లా ఆఫ్ గ్రావిటేషన్'ని యీ విధంగానే కను

కున్నాడు. ఏదైనా కొత్త విషయం/పరిష్కారం/సమాచారం హఠాత్తుగా నేర్చుకోవడం ఈ మెకానిజమ్ యొక్క ప్రత్యేకత. చాలా డిసిప్లిన్‌గా, బ్రెయిన్స్‌గా వున్న వ్యక్తులు మాత్రమే ఇంత క్లిష్టమైన సమస్యలకు మెరుపు లాంటి పరిష్కారాలు పట్టుకోగలరు. వేలమంది మనుష్యులు తాము బాత్ టబ్‌లోకి దిగగానే నీళ్ళు ఉబికివస్తాయి అన్నది గమనించి వుంటారు. కాని ఆర్కిమెడిస్ మాత్రమే దాన్నుంచి 'స్పెసిఫిక్ గ్రావిటీ'ని కనుగొన్నాడు. ఆపిల్ చెట్టు నుంచి రాలి పడడం అన్నది కోట్లాదిమంది సాధారణంగా చూసే విషయమే. కానీ, ఒక్క న్యూటన్ మాత్రమే అది భూమ్యాకర్షణ శక్తివల్ల అని తెల్సుకున్నాడు. ఇలాంటివి చాలా అరుదు. ఇది కేవలం మనిషికి మాత్రమే భగవంతుడు ఇచ్చిన వరం. ఇతర రెండు మెకానిజమ్స్ పశువులకూడా వర్తిస్తాయి.

అయితే ఈ 'లెర్నింగ్' అన్నది అమీబా నుంచి మనిషి వరకూ ఉన్న జీవజాతిలో క్రమంగా ముఖ్యపాత్ర వహిస్తూ వస్తుంది. చిన్న చిన్న జంతువులు పెద్దగా యేమీ నేర్చుకోకుండానే బ్రతికేస్తాయి. కానీ మనిషి విషయంలో అలా కాదు. మెదడు, నెర్వస్ సిస్టమ్ మరింత సంక్లిష్టంగా వుంటాయి. నేర్చుకోవడానికి మెదడు చాలా అవసరం. అతి చిన్న వయస్సులో మనం నేర్చుకొనే విషయాలు మనపై చెరగని ముద్ర వేస్తాయి. వాటినే అలవాటుగా మార్చుకుంటాం. చేసిన పనినే, అదే ఆర్డరులో తిరిగి తిరిగి మెకానికల్‌గా, అదేదో గాలి పీల్చుకోవడం అన్నంత మామూలు స్థితిలో చేసేది అలవాటుగా మారిపోతుంది. మన ప్రమేయం లేకుండానే, చేసేస్తూ వుంటాం. ప్రొద్దున్నే లేవడం, పళ్ళు తోముకోవడం, కాఫీ త్రాగడం, న్యూస్‌పేపర్ చదవడం లాంటివి ఉదాహరణలు. ఇవి చేస్తున్నప్పుడు మనం వీటి గురించి పెద్దగా ఆలోచించం. మనకున్న వేరే పెద్ద సమస్యల గురించి ఆలోచిస్తూ ఆటోమేటిగ్గా ఇవి చేసేస్తూ వుంటాం. మొదట్లో సైకిల్ తొక్కడం, వంట చేయడం, ఈత కొట్టడం లాంటివి

స్కిల్స్ అని చెప్పుకున్నాం. నేర్చుకునేటప్పుడు అవి స్కిల్స్, కానీ అల వాటయిపోయాక, ప్రాక్టీస్ పెరిగాక, మనం పెద్దగా ఏకాగ్రత చూపించ కుండానే, ఆ పనిని రొటీన్‌గా పూర్తి చేసుకుంటాం కనుక అవి అలవాట్లు అయిపోతాయి. అతి క్లిష్టమైన సమస్యల కోసం మన శక్తిని, తెలివితేటల్ని ఉపయోగించడం జరుగుతుంది. అందుకే సైకాలజిస్టులు 'అలవాట్లు' అనే సబ్జెక్టు మీద అంత శ్రద్ధ చూపిస్తారు. మంచి అలవాట్లని చేసుకోవడంవల్ల మన జీవితాలు మరింత బాగుంటాయని వీరి భావన. మంచి పన్లు చేయడం అలవాటయిపోతే, ఉన్న కొద్ది చెడ్డ గుణాలు కూడా తొలగిపోయి, ఆ అల వాట్లే శాశ్వతమవుతాయని వీరు విశ్వసిస్తారు. కనుక పెద్దవాళ్ళు తమ పిల్లలకు మంచి అలవాట్లని, క్రమశిక్షణని నేర్పాలి. ఒక పదహారేళ్ళ కుర్ర వాడికి సిగిరెట్ ఎంత ఆనందం యిస్తుందో, మరొక కుర్రవాడికి పుస్తక పఠనం అంత ఆనందం యిస్తుంది. 'ఆనందం' ఒకటే అయినపుడు మంచి చెడు అలవాట్లు దేనికి?—ఈ విషయాన్ని తల్లిదండ్రులు పిల్లలకి అర్థ మయ్యేలా చెప్పాలి.

అయితే ఈ అలవాట్లకి మరో కోణం కూడా వుంది. మంచి అల వాట్లు చేసుకోవడం యెంత కష్టమో, చెడ్డ అలవాట్లు చేసుక్కోవడం అంత తేలిక. ఇవి కూడా ఒకసారి అలవాటయిపోతే, వదులుకోవడం చాలా కష్టం.

ఏ అలవాటయినా వ్యసనమైతే చాలా యిబ్బందులు ఎదురవుతాయి. ఓ రకమైన జీవితానికి అలవాటుపడ్డ మనిషి, ఏదో కారణంవల్ల అనా రోగ్యంవల్లే అనుకోండి, తన పద్ధతుల్ని మార్చుకోకపోతే ప్రమాదం అని తెలిస్తే, మార్చుకోనూలేక, అలాగని వుండనూలేక సతమతమయి పోతాడు.

ఇంకో ఉదాహరణ : ఓ దొంగని తీసుకుందాం. ఎప్పుడో ఓసారి రిస్క్ తీసుకుని దొంగతనం చేసి ఓ రెండు మూడు నెలలు గడిపేస్తాడు. ఈ జీవితం అతనికి ఎక్సైట్‌మెంట్‌ని, తృప్తిని, సుఖాన్ని కలిగించవచ్చు. అతన్ని మార్చాలనుకునేవాళ్ళకి అది అసాధ్యమనిపిస్తుంది. అతను చేసేది

తప్పని కన్విన్స్ చేయగలిగినా, అతనికి నచ్చిన ఆ వృత్తిలోంచి బయట పడటానికి ఓ పట్టాన వప్పుకోడు.

బహుమతుల ద్వారానో, శిక్ష ద్వారానో మనం యితరుల్ని బాగు పరచే అవకాశాలున్నాయి. బహుమతి అయినా, శిక్షయినా అది అందుకునే వ్యక్తికి-తన చర్యలకి, ఆ ప్రతిఫలానికీ వున్న సంబంధం స్పష్టమయి వుండాలి. కేవలం అప్పుడే దాని విలువ తెలుస్తుంది. తనకు రివార్డ్ ఏ విషయానికి వచ్చిందో తెలిస్తే అతను అదే ప్రవర్తనను మళ్ళీ రిపీట్ చేసే అవకాశం వుంది. అలాగే, తనకు శిక్ష ఎందుకు లభించిందో అర్థమైతే, దానికి స్పందించే వ్యక్తి తిరిగి ఆ పని చేయడు.

చదువు విషయానికొస్తే పిల్లలకు క్రమశిక్షణ నేర్పడంలో దండ ననే ఆయుధంగా ఉపయోగిస్తున్నారు. సైకాలజిస్ట్‌లు దీన్ని చాలా నిరసించినా, ఎవరూ పట్టించుకోవటంలేదు. తాము ఎందుకు దండింపబడుతున్నామో తెలీని స్థితిలో పిల్లలుంటే, ఇక వాళ్ళు కొత్తగా నేర్చుకునేది ఏముంది? చాలా ఎక్కువగా దండించినా, పెద్దవాళ్ళ తమను అన్యాయంగా చావబాదారన్న కసిని పిల్లలు పెంచుకోవచ్చు. ఇలాంటి పద్ధతుల్లో శిక్షించడం అంత మంచిదికాదు. అలాగే ప్రతి చిన్న మంచి పనికూడా వాళ్ళకి రివార్డ్స్ యివ్వడంవల్ల వాటి విలువ తరిగి అర్థం మారిపోయే ప్రమాదం వుంది.

చాలామంది తల్లిదండ్రులు పిల్లల్ని తప్పుచేసినందుకు మాత్రమే కాక, తమ చిరాకుల్నీ, కోపాల్నీ తీర్చుకునేందుకు కూడా శిక్షిస్తారు. వాళ్ళే చాలా కోపంలో వుండడంవల్ల, శిక్ష మరింత కఠినంగా వుంటుంది. అందుకే పిల్లల్ని దండించే ముందు తల్లిదండ్రులు, అది తమ కోపం తీర్చుకోవడం కోసమా? లేక పిల్లల తప్పును సరిదిద్దడానికా? అన్నది తర్కించుకోవాలి. ఏదేమైనా, అన్యాయంగా దండింపబడుతున్నామన్న కసినీ కాక, ఎందుకు దండింపబడుతున్నారో తెల్సుకున్నే జ్ఞానం పిల్లలకు

కలిగించడం చాలా అవసరం. మరికొంతమంది తల్లిదండ్రులు పిల్లలను దండించడానికి చాలా ముందు వెనుకలు ఆలోచిస్తారు. ఇది తమపట్ల వాళ్ళ కున్న వీక్‌నెస్ అని పిల్లలు అర్థం చేస్కుని, అది ఎక్స్ప్లాయిట్ చేసే అవకాశం వుంది. ఒకటి అతివృష్టి-మరొకటి అనావృష్టి.

పిల్లల్ని కంట్రోల్ చేయాలనుకునే ముందు తల్లిదండ్రులు, ఇద్దరూ ఒకే మాటమీద వుండాలి. లేదంటే గడుగ్గాయి పిల్లలైతే ఆ విషయం ఇట్టే పట్టేసి, ఒకరికి వ్యతిరేకంగా మరొకరితో ట్రిక్స్ ప్లే చేసే ప్రమాదం వుంది. పిల్లలు తల్లి దండ్రులు ఊహించినంత అమాయకంగా ఏం ఉండరు. వారిలో గమనింపు ధోరణి చాలా యెక్కువ. తల్లిదండ్రుల మధ్య తేడాల్ని వారు తేలిగ్గా గ్రహించేయగలరు. దీనిని తమకు అనుకూలంగా కూడా మార్చుకోగలరు.

అయితే తల్లి దండ్రులు పిల్లలకెప్పుడూ ప్రేమ విషయంలో ఏ కొరతా రానివ్వకూడదు. రివార్డ్స్‌ని వస్తు రూపంలోనో, చిన్న పొగడ్త రూపంలోనో యిస్తూ వారి ముందరి కాళ్ళకు బంధం వేయాలి. అవసరమైతే చిన్నగా కోప్పడ్డమో, తమ కిష్టం లేదని సున్నితంగా చెప్పడమో, మందలించడమో చేయాలి. ఒకో సందర్భంలో ఒకో విధంగా దేనికి తగ్గట్టుగా అలా ప్రవర్తించడంతో పిల్లలు ఆ తేడాలు గమనించి, తమ నడవడికను సరిదిద్దుకునే అవకాశం వుంది.

చిన్నతనంనుంచే పిల్లలు తల్లిదండ్రులు విధించే శిక్షలు తప్పించుకోవడానికే ప్రయత్నిస్తారు. కొంతమంది పిల్లలు తమ తల్లిదండ్రుల బలహీనతల్ని యిట్టే పట్టేస్తారు. తమను కొట్టటం తల్లికో, తండ్రికో యిష్టం లేదని, తమ ఏడుపుని, మొండితనాన్ని భరించలేదని గ్రహిస్తారు. అందుకే ఏడ్చి, మొండితనం చేసి తమ కోరికల్ని సాధించుకుంటారు. ఒకోసారి పిల్లల్ని క్రమశిక్షణగా వుంచే తల్లిదండ్రులకే బేదాభిప్రాయాలు తలెత్తే సమస్య వుంది. దీంతో పిల్లలకి యిద్దరూ చెరో రకమైన ఇన్‌స్ట్రక్షన్స్

ఇస్తారు. పిల్లలు దీన్ని ఓ అవకాశంగా తీసుకొని ఒకరికి తెలీకుండా మరొక రితో చేతులు కలిపి, తమ పబ్బం గడుపుకోవాలని చూస్తారు. అందుకే పిల్లల్ని మరీ అమాయకులుగా అంచనా వేయకుండా, వారి ఎదురుగానైనా కలసికట్టుగా వుండడం శ్రేయస్కరం.

ఒకోసారి తల్లిదండ్రులకికూడా కొన్ని ఇబ్బందులుంటాయి. ఇంట్లో వున్న ఇతర వ్యక్తులు (ముఖ్యంగా పెద్దవాళ్ళు) పిల్లల్ని పెంచడంలో వేరే రకమైన అభిప్రాయాలు కలిగి వుండవచ్చు. పిల్లల్ని కొట్టడానికి, దండించ డానికి వారు వ్యతిరేకత చూపవచ్చు. అలాంటప్పుడు వాళ్ళని కాదని వీరికి క్రమశిక్షణ నేర్పడం సాధ్యపడదు. ఇంటి ఇరుగు పొరుగువారు కూడా రక రకాల సలహాలిస్తూ వుంటారు. వాటిలో కొన్నైనా పాటించకపోతే, భేదాభి ప్రాయాలు తలెత్తే ప్రమాదం వుంది. ఇక స్కూల్లో టీచర్ పిల్లల విష యంలో వేరుగా ఆలోచించవచ్చు. తల్లిదండ్రులు ఏదైనా చెప్తే పిల్లలు 'కాదు, మా టీచర్ అలా చేయమంది' అంటారు.

ఇలా పిల్లవాడి సాంఘిక జీవనం పెరిగేకొద్దీ, అతన్ని ప్రభావితం చేసే ఇతర వ్యక్తుల అభిప్రాయాల్ని కూడా తల్లిదండ్రులు గుర్తించి గౌర వించవలసి ఉంటుంది. పిల్లవాడు అడాలసెంట్ అయ్యేసరికి, చాలామంది తమ తల్లిదండ్రుల పెంపకంలో ఏదో గొప్ప లోపముందని గ్రహిస్తారు. వారి ప్రవర్తన వీరికి అర్థం కాదు. ఇక కంట్రోల్ చేసే విషయాలు మరచి పోవలసినదే.

## పిల్లల్ని అర్థం చేసుకోవడమెలా ?

ఈ విషయానికి మొదట్లో పెద్ద ప్రాధాన్యత ఇచ్చేవారుకాదు. ఎందు కంటే అప్పుడన్ని కుటుంబాలూ ఒకే విధంగా వుండేవి. పిల్లలు తల్లి పాలు త్రాగేవరకూ ఆమెనే అంటిపెట్టుకుని వుండేవారు. తరువాత ఆట పాటల వయస్సులో తల్లి తన పని తాను చేసుకుంటూ పిల్లల్ని ఓ కంట కని పెడుతూ వుండేది. తండ్రి అస్సలు పిల్లల పెంపకం విషయంలో కల్పించు

కునేవాడు కాదు. పెరిగి పెద్దవారయ్యాక, ఆడపిల్లయితే ఇంట్లో పనికి, మొగపిల్లవాడయితే బయట తండ్రికి పనిలో సాయపడేవారు. చిన్నవయసు లోనే పెళ్ళిళ్ళు చేసుకుని ఆనందంగా కాపురాలు చేసుకునేవారు.

ఇప్పటికీ ఇంత ఆనందకరమైన జీవితాన్ని గడిపే అదృష్టం ఉన్న వాళ్ళున్నారు.

అయితే సాంఘిక జీవన విధానంలో మార్పులొచ్చేసరికి ఈ చిన్న సింపిల్ జీవితానికి అందరం దూరమయ్యాం. మనకూ, మన పిల్లలకూ కూడా జీవితాన్ని క్లిష్టతరం చేసాం. పిల్లల పెంపకం విషయంలో అనేక మైన భయాందోళనలకు గురి అవుతున్నాం. పిల్లలకి తిండి అరగకపోయినా కంగారుపడతాం. పిల్లలు త్వరగా నడక నేర్చుకోకపోయినా, తిట్లు నేర్చు కున్నా తెగ బాధపడిపోతాం. మూడో ఏడు రాగానే వాళ్ళని స్కూల్లో పారేసి ఇంకా అక్షరాలు దిద్దడం నేర్చుకోవట్లేదేంటా అని దిగులుపడతాం. వయస్సు పెరిగేకొద్దీ, పిల్లల చదువు, మార్కులు, ఐ. క్యూ. గురించి దిగులు చూపిస్తాం. ఇవన్నీ కల్సి వాళ్ళ చిన్నిబుర్రల్ని ఎంత అవస్థలకు గురిచేస్తాయో గుర్తించం. ఇవన్నీ వాళ్ళని అయోమయంలో పడేసి, వాళ్ళ అభివృద్ధికి నిరోధకాలు అవుతున్నామేమో అనికూడా ఆలోచించం. ఇవీ, మన తల్లిదండ్రులకుండే బాధలు.

తండ్రి మంచి స్థితిలో వుండినట్లయితే, పిల్లల భవిష్యత్తుని గురించి పెద్దగా చింతించాల్సిన అవసరంలేదు. వారు తండ్రి వృత్తినే చేపడతారు. వీరికి కెరియర్ విషయంలో పెద్దగా ఛాయస్ వుండదు. చిన్నప్పుడు అమ్మ కొంగు పట్టుకు తిరిగి, తర్వాత ఇరుగు పొరుగు వాళ్ళతో చేరి ఆటలాడి, తర్వాత ఓ వయసొచ్చాక తండ్రికి పనిలో సాయపడుతూ, తండ్రి ఇక పని చేయలేని స్థితిలో అతన్ని రిటైర్ చేసి, ఆ స్థానాన్ని భర్తీ చేయడం, పెళ్ళిళ్ళు, పిల్లలు అన్నీ త్వరత్వరగా జరిగిపోయి, పెద్ద గొడవలు లేకుండా

సాఫీగా సంసారాలు చేసుకుంటారు. వీరికి ఏ పిల్లల మనస్తత్వ శాస్త్రవేత్తల అవసరం ఎదురవ్వదు.

యాంత్రిక జీవనం మొదలైనప్పటినుంచి, సంఘంలో బ్రతకడం మరీ క్లిష్టతరమైపోయింది. రకరకాల ఉద్యోగాలు, రకరకాల చదువులూ వెలిశాయి. చదువు అందరికీ లభ్యమైపోతూంది. బాల్యమూ, కౌమారమూ కూడా స్కూళ్ళలోనే గడిచిపోతూంది. తర్వాత ఏం చేయాలా అన్నది అందర్నీ వేధించే ప్రశ్న. పిల్లల పెంపకాల గురించి కొత్తగా వెలువడిన అర్థమైన థియరీలు, ఎవర్నెలా పెంచితే ఏం జరుగుతుందోనని రకరకాలుగా చెప్పి, ఏదీ అర్థం కాకుండా తల్లిదండ్రుల్ని అయోమయంలో పడేస్తాయి. చదువుకున్న తల్లిదండ్రుల్కి ఈ ప్రాబ్లమ్స్ మరీ ఎక్కువ. ఈ ఏంగ్జయిటీ ఎక్కువయేకొద్ది సమస్యలు మరింత జటిలంగా కన్పిస్తాయి. దీంతో పిల్లలనుంచి ఎక్కువ ఆశిస్తారు. దీనికంటే అసలు పిల్లల ప్రాబ్లమ్స్ ఏ విధంగా వుంటాయో తెల్సుకోవడం మేలు.

పిల్లల్ని అర్థం చేసుకోవడం తేలికే, ఎటొచ్చీ వారిని కంట్రోల్ చేయడమే మరీ కష్టం. తల్లిదండ్రులు తమని తాము ముందు అదుపులో వుంచుకోగలిగితే, ఈ బాధ్యత సగం వదిలినట్లే. వారికి తమ లోపాలు, తప్పిదాలు తమకే అర్థమై, పిల్లల్ని శిక్షణలో పెట్టే సమయంలో వాటిని సరిదిద్దుకుని ప్రవర్తిస్తే, ఎంతో సాధించినట్లే. అసలైన గొప్ప విజయం ఏంటంటే, పిల్లల్ని క్రమశిక్షణలో పెడుతూ కూడా ఇంట్లో ఆహ్లాదకరమైన ఆనందకరమైన వాతావరణాన్ని నెలకొల్పగలగడం.

# ఉపసంహారం

**సూడో మంచి గుణాలు :**

తల్లిదండ్రులు పిల్లలకి ఎప్పుడూ కేవలం ప్రేమ, భద్రత యిచ్చి, వ్యక్తిత్వ వికాసానికి కావల్సిన మనోధైర్యం, సపోర్ట్స్ యివ్వకుండా, 'నీకు మేమున్నాం' అంటూ....ఎప్పటికప్పుడు వాళ్ళ అవసరాల్ని తీరుస్తూ వుంటే, స్వశక్తిమీద వాళ్ళకు నమ్మకం కలగదు. కాకమ్మ కథల్లోలా కేవలం వాళ్ళకు మంచి గురించి, సాత్వికత గురించి మాత్రమే చెప్పకుండా ప్రపంచంలో రకరకాల మనుష్యుల్తో ఎలా డీల్ చేయాలో నేర్పాలి. పిల్లలను అమాయకులుగా, నిర్వీర్యంగా, ఎప్పుడూ ఎవరిమీదో ఆధారపడే పారసైట్‌లా కాక, స్వతంత్రంగా, కంపీటెంట్‌గా తయారుచేయాలి. అమాయకులను దేవుడే కాపాడుతాడులాంటి పిచ్చి-పిచ్చి నమ్మకాల్ని వాళ్ళకి కలిగించడంవల్ల వాళ్ళు తెలివిగా స్వతంత్రంగా ఆలోచించటం కూడా తప్పేమో అని 'సూడో' మంచి గుణాలు అలవర్చుకుంటారు. 'సూడో' అంటే - భ్రమ.

ప్రపంచంమీద నమ్మకముంచుకోవడం మంచిదే కానీ, నెమ్మదిగా అన్యాయాల్ని, మోసాల్ని గురించి కూడా తెల్సుకోవడం మంచిది. వయస్సుకి తగిన వ్యక్తిత్వం అలవర్చుకోవడం ఎంతైనా అవసరం. 'మనం కష్టపడి పనిచేయడంవల్ల మనకు చాలా మంచి జరుగుతుంది. మనను అందరూ గౌరవిస్తారు', 'అందరూ ఒక్కటిగా కల్సి వుండడం వలన కష్టాలు కల్సి పంచుకోవచ్చు' లాంటి నీతికథలు చెప్పడం వలన పెద్దగా ప్రమాదమేం వుండదు. ఎందుకంటే, దానిలో అంతో, ఇంతో నిజముంది కనుక, ఆ సిద్ధాంతం నమ్మడంలో తప్పేంలేదు కనుక.

భవిష్యత్తులో కష్టానికి తగ్గ ఫలితం నిజంగా లభించకపోయినా, అప్పటికి తగిన మెచ్యూరిటీ వుండి వుండడంవలన మానసికంగా అంత

అప్‌సెట్ అయ్యే అవకాశంలేదు. పిల్లల్ని ఊహాలోకాల్లోనూ, కలల్లోనూ విహరింపచేసే కథలు - జీవితంలో హఠాత్తుగా ఎదురయ్యే ఏక్సిడెంట్లకూ, విపత్తులకూ తట్టుకునే మనస్థయిర్యాన్ని కలిగించవు. రాజకీయంగా,సామాజికంగా జరిగే మార్పులవల్ల, దేశం నుండి దేశం వలస వెళ్ళాల్సిరావాల్సి వచ్చినప్పుడో, యుద్ధసమయాల్లో ప్రాణభీతితో గడపాల్సి వచ్చినప్పుడో, అమాయకత్వం నుంచి బలవంతంగా బయటపడాల్సి రావల్సి రావచ్చు. దీని ఫలితం దారుణంగా వుంటుంది. సీతైన చందమామ కథలు ప్రస్తుత సమాజంలో నిజమని నమ్మటంవల్ల కలిగే మానసిక సమస్యలకూ, విపత్తులకూ అంతంత పెద్ద కారణాలే అవసరంలేదు. ఇళ్ళలో అతి సాధారణంగా మనకు ఎదురయ్యే హిపోక్రసీకూడా కారణం కావచ్చు. పెద్దవాళ్లు పిల్లలకు తామేం చెప్పారో మర్చిపోయి, అవే తప్పులు వాళ్ళు చెయ్యడంవల్ల, పిల్లలు ఓ రకమైన అయోమయంలో పడిపోతారు.

ఏది నమ్మాలో, ఏది నమ్మకూడదో, నిజమేదో, అబద్ధమేదో తెలీని స్థితిలో అభద్రతాభావం, అపనమ్మకమూ పెంచుకుంటారు. పిల్లలు పెద్దలుచేసే తప్పుల్ని ఎత్తిచూపితే, పరిస్థితులు మరింత దారుణంగా వుంటాయి. అలాచేస్తే వారు సాధారణంగా దండనకు గురవుతూ వుంటారు. దాంతో అప్పటివరకూ ఎంతో నమ్మకం పెంచుకుని, ఎంతో నిశ్చింతగా వున్న వారి లేత మనసుల్లోకి మోసం అనేది, అబద్ధాలనేవి వుంటాయన్న నిజం నాటుకుపోతుంది. అందుకే అలాటి పనులు చేసినప్పుడు, దానికి సరైన కారణం పిల్లలకు చూపించాల్సిన బాధ్యత తల్లిదండ్రులదే. ఇలా ఒకటి రెండుసార్లు పొరపాట్లు జరగడంవల్ల వారు ఆ అయోమయస్థితిలో గతపు తీయటి జ్ఞాపకాల్లోకి వెళ్ళిపోయి బతికేయడం మొదలుపెడ్తారు.

ముందు ముందు తమ భావాలన్నీ వున్నదున్నట్టుగా చెప్పడం మర్చిపోయి, ఎవరేమంటారోననే భయంతో ఆలోచించి జాగ్రత్తగా, సేఫ్ అన్పిస్తేనే మాట్లాడ్డం మొదలుపెడతారు. రిస్క్ వున్న పనులు దాచేయటం ఇక్కడ్నుంచి మొదలవుతుంది. ఈ స్థితిలో అసలైన, స్వచ్ఛమయిన

అమాయకత్వం పోయి, హిపోక్రసీ మొదలవుతుంది. దీన్ని సూడో-ఇన్నో సెన్స్ అంటారు. ఈ దశలో వారు తమ గొప్పతనాన్ని గుర్తించుకోరు. అంతా విధివిలాసమని, ఏదైనా మన మంచికేలాటి సూక్తులతో, మెట్ట వేదాంతంలో గడిపేస్తూ వుంటారు. ఓవిధంగా ఇది వాళ్ళకు డిజప్పాయింట్ మెంట్లకూ, నిస్పృహలకూ తట్టుకునే (సూడో) శక్తి నిస్తూ వుంటుంది. ఇలా భ్రమల్లో బ్రతకడంవల్ల తాత్కాలికంగా మనశ్శాంతి లభించినా మొత్తానికి సరైన పద్ధతికాదు.

మానసికంగా వ్యక్తిత్వాన్ని పెంచుకొనడంవల్ల, స్వంతంగా నిర్ణయాలు తీసుకోని, ధైర్యంగా వాటి ఫలితాలకు తట్టుకునే స్థయిర్యంఅలవర్చుకోవడం మంచి మార్గం. కానీ, ఆ లేత వయస్సులో ఇంత విశ్లేషణాశక్తి (అందులోనూ ఎవరూ గైడ్ చేయని స్థితిలో వున్నప్పుడు) ప్రదర్శించడం అసాధ్యమని చెప్పవచ్చు. ఇది ఇలాగే కొనసాగటంవల్ల పిల్లలు న్యూరోటిక్‌గా తయారయ్యే ప్రమాదం వుంది. ఈ సూడో - ఇన్నొసెన్స్‌లో బ్రతుకుతున్న వ్యక్తి తన అసమర్థతను అమాయకత్వమని చెప్పుకుని, అమాయకులని దేవుడే కాపాడుతాడనే భ్రమలో వుంటాడు. వీరిలో చిన్నతనపు ఛాయలు పోవు. పోవడానికి వాళ్ళిష్టపడరు కూడా. చిన్నతనమంటే ఇక్కడ పిల్లల్లో వుండే స్వచ్ఛత, స్పాంటెనిటీ, చురుకుదనమని కాదు; ఎప్పుడూ ఎవరో ఒకరు తమ బాధ్యత తీసుకోవాలని డిమాండ్ చేసే మొండితనం. ఇలా తమ కనుకూలంగా ప్రవర్తించే పద్ధతిని బట్టే దీనికి 'సూడో' అని పేరొచ్చింది.

మన గొప్పతనం ప్రపంచం గుర్తించచ్లేదని, ఏదో ఒకరోజు హీరోయిక్‌గా ప్రవర్తించి, చెడునంతా తొలగించేసి, దుష్టశిక్షణ చేసిపారేసి అందరిచేత గుర్తింపబడతామని, కీర్తింపబడతామని కలలు కనటం మొదలెడతాం. ఈ సూడో మనస్తత్వం నిజంగానే బాధాకరమైనది. కానీ, దీన్ని ఒప్పుకోక, అదే నిజమైన అమాయకత్వమని మొండిగా వాదించేవాళ్ళు, ఏంగ్జయిటీ, డిప్రెషన్ లాంటి వాటికి లోనవుతూ వుంటారు. అంతేకాక,

కష్టాలనేవి అందరికీ మామూలే అయినా, తామేదో ప్రత్యేకమనీ, రాబట్టి తమలాంటి వాళ్ళకి అవి రాకూడదని గొంతెమ్మ కోరికలు కోరుతూ వుంటారు. భ్రమలు లేకుండా బ్రతకడం పిరికి చాలా కష్టంగా తోస్తుంది.

ఇతర జీవాలతో పోల్చి చూస్తే, పసితనపు ఛాయలూ, ఆధారపడే మనస్తత్వం పక్షులూ, జంతువులకన్నా 'మనుషుల్లోనే' దీర్ఘకాలం కన్పి స్తుంది.

వయస్సు పెరుగుతున్నకొద్దీ, చుట్టూ వున్న రిస్క్ అర్థమవడం వల్ల తమను కృంగదీసే పరిస్థితులమీద అనాసక్తత కలిగి, 'అజ్ఞానమూ, ఏమీ తెలియనితనమే' సేఫ్ అనుకునే స్థితికొస్తారు. ఇది సేఫ్టీ అనుకోవడం ఎంత అబద్ధపు భావాన్నైనా, వారికది బాగా తోడ్పడుతుంది. పిల్లల్లో అలాంటి అమాయకత్వం గొప్ప కంఫర్టు ఇస్తుంది. 'సూర్యుడెందుకు ఉదయిస్తాడు?' అనే ప్రశ్నకి 'ఉదయించాలి కాబట్టి' లేదా, 'నేను ప్రొద్దున్నే లేవాల్సిన సమయం తెలియడానికి' అన్న సమాధానాలు బోల్డంత సంతృప్తి కల్గిస్తాయి. 'సూర్యుడు ఎందుకు అస్తమిస్తాడు?' అన్న ప్రశ్నకి, 'అల్సిపోతాడుకాబట్టి' అనో 'నేను నిద్రపోవాలి కదా మరి' అనే సమాధానాలు మనంఎదురు చూడ వచ్చు. సింప్లిసిటీయో లేదా, ప్రపంచంలో ఏదైనా 'తమ అనుకూలం కోసమే' అనే భావన వారికి బాగా నచ్చుతుంది. 'వానా వానా రావమ్మా, నన్ను తడిపి పోవమ్మా' అని ప్రకృతిని కమాండ్ చేయడంలో వున్న ఆనందం ఇంత పెద్ద ప్రపంచంలో ఓ చిన్న పిపీలికం మనిషి అన్న పచ్చి నిజం రియలైజ్ చేయడంలో రాదు. కానీ ఈ సూడో - అమాయకత్వంలో వుండడంవల్ల మన పవర్ మనకు తెలిసే అవకాశం లేదు.

నిజాలు అర్థమయ్యేకొద్దీ, ఒక రకమైన అయిష్టత పెరుగుతూ వుంటుంది. మనం పట్టించుకోకుండా అమాయకంగా వుండాలనుకునేకొద్దీ ఆ అయిష్టత పెరుగుతూ వుంటుంది. అందుకే మన వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవాలి. స్వేచ్ఛగా, స్వతంత్రంగా బ్రతకడంలో వున్న ఆనందాన్ని డిస్కవర్ చేయాలి. అలా చేయగలిగాలంటే, మనం మన

అమాయకత్వం ముసుగు నుంచి బయటపడాలి. ఇది మనకు చాలా సంక్లిష్ట మైన వ్యవహారంలా కన్పించవచ్చు.

పరిస్థితుల్ని మరింత విషమం కాకుండా కాపాడుకోగలగడంలో మన లౌక్యం, మన తెలివితేటలు బయటపడతాయి. ఇదంతా కష్టమే అయినా, చెత్త సిద్ధాంతాల్ని నమ్మటంవల్ల కలిగే నిస్పృహ, క్షోభ అంత బాధాకరం మాత్రం కాదు.

కొంత సూడో - ఇన్నోసెన్స్‌తో కొంతమంది పెద్ద వేదాంతుల్లా, అన్నీ త్యజించిన మహర్షుల్లా ఫోజిచ్చేస్తూ వుంటారు. ఇలా కన్పించడానికి వాళ్ల జీవితంలో అతి చిన్న చిన్న ఆనందాలకు కూడా దూర మవ్వాల్సొస్తుంది. దానికి సిద్ధంగా లేని పక్షంలో మరింత అభాసుపాలయే ప్రమాదం వుంది.

మనం చేసే ప్రతి పని వెనుక కారణాలు వెదుక్కోవడం చాలా అవసరం.

మనం చేసే పనులన్నిటికీ మూడు స్టేజీలు వుంటాయి.

మొదటి స్టేజీలో—మనకేదో కావాలనో, ఏదో లేదనో అనిపిస్తూ వుంటుంది. ఆ అసంతృప్తి అస్పష్టంగా తెలుస్తూ వుంటుంది. ఒక పని చెయ్యాలనిపిస్తుంది. అది చెయ్యకపోతే ఇబ్బందిగా ఉంటుంది.

ఇక రెండో స్టేజిలో—ఏదో విధంగా మన అవసరాన్ని తృప్తి పరుచుకోవాలనిపిస్తుంది. ప్రయత్నం చేయటం మొదలవుతుంది.

మూడోది—తృప్తి స్టేజి. పనిచేయటంవల్ల కలిగే సంతృప్తి ఇది.

ఈ ప్రపంచంలో చాలామంది మొదటి స్టేజిలో ఆగిపోతారు. ఇంకా చాలామంది రెండో స్టేజీలో ఆగిపోయి బాధపడతారు. కొద్దిమందే మూడో స్టేజి పూర్తి చేస్తారు.

అందుకే 'ఆరంభింపరు నీచ మానవులు' అన్నాడు భర్తృహరి.

—*—